మలతే ధారయతి దేహం మలః. అ. ప్న. మల మల్ల ధార
...హమును ధరించునది. ౨. విణ్మూత్రిములు మొదలైన దేహమల
...తే ద్వాదశ. తదుక్తం, "వసా శుక్ర మసృజ్మజ్జా కర్ణ విణ్మూ
...శ్లేష్మాశ్రు దూషికా స్వేదా ద్వాదశైతే మలా నృణా"
...ప్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, గులిమి, మూత్రము, విష్ఠ,
...లెమడ,కన్నీరు, కంటిపుసి, చెమట అని మలములు పండ్రెండు.

...న్త్రం పురీతత్ -

...అమ్యతే సంభజ్యతే భుక్తాన్నాదిక మనేనేతి అంత్రం. అమ గ
... భుజించిన యన్నాదులు దీనిచేత నేర్పఱచఁ బడును. పా.
...౧.పురీం దేహం తనోతి పురీతత్. త. స్న. తను విస్తారే.పురి
... శరీరము. దానిని విస్తరింపఁజేయునది. ఈశబ్దము స్త్రీలింగ
...ందఱు. ౨. పేగులపేళ్లు.

గుల్మస్తు ప్లీహా పుంసి-

...గుడ్యతే ప్రకోపాదినా రక్ష్యత ఇతి గుల్మః. గుడ రక్షణే. ప్ర
...లచేత రక్షింపఁబడునది. ౧. ప్లీహాతి కదాచి దుద్రిక్తః ప్రదే
... గచ్ఛతి ప్లీహా. న. పు. ప్లీహ గతౌ. ఒకానొకప్పుడు ఉద్రిక్త
...యొకచోటికిఁ బోవునది. ౨. హృదయమునకు నెడమదిక్కునఁ
...యుండు మాంసవిశేషము పేళ్లు.

అథ వస్నసా,

...యుః స్త్రియామ్-

...వ స్తేఛాదయతి దేహం వస్నసా. వస ఆచ్ఛాదనే. దేహమును
...యుండునది. పా. స్నసా. "స్నసా స్నాయుశ్చ కథితా" ఇత్య
...లాయాం.౧. స్నాతి సదా ఆర్ద్రీభవతి స్నాయుః. సీ. ష్ణా శౌచే.
...ఆర్ద్రమైయుండునది. ౨. సన్నపునరములపేళ్లు.

కాలఖణ్డ యకృతీ తు సమే ఇమే. ౬౬

...ఖండం మాంసఖండం. కాలంచ తత్ ఖండంచ కాలఖండం.నల్ల
...ఖండము. ౧. క్లోమ్నా ద్వితీయమాత్మానం కరోతీతి యకృత్.
...క్లోమమనెడు మాంసముకంటె తన్ను రెండవదానిఁగాఁ జేసికొను

నది. ౨. కడుపులో కుడిదిక్కున నల్లనై యుండు మాంసవిశేషము.
* సృణికా స్యన్దినీ లాలా-
సరతీ స్రవతి సృణికా.పా. సృణీకా. ౧. స్యందీతి స్యందినీ. స్యందూ ప్రస్రవణే. జాఱునది. ౨. విరుద్ధలక్షణయా లలతి లాలా. లల ఈప్సాయాం. విరుద్ధలక్షణచే నింపైనది. ౩. నోటిజొల్లుపేళ్లు. చొంగ.
* దూషికా నేత్రయో ర్మలమ్,
నేత్రే దూషయతీతి దూషికా. దుష వైకృత్యే. కన్నులను వికారముగాఁజేయునది. పా. దూషీకా. "దూషీకాపటలనిరుద్ధలోచనస్య దుర్గంధా బహుళమలోపలిప్తగాత్రే" తి గోపదత్తః. "ఆఃకీర్య నిలోచన దూషికాయాం పీయూషదీధితిరితి గ్రథితోఽనురాగః" ఇతి మురారిః. "నాసామలం తు శింఘాణం శింజూషం కర్ణయోర్మల" మిత్యధికపాఠః. ౧. కంటిపుసిపేరు.
* మూత్రం ప్రస్రావః-
మూత్రయతి ప్రస్రవతి మూత్రం, ప్రస్రావశ్చ. మూత్ర ప్రస్రవణే. స్రు స్రవణే. జాఱునది. ౧ ౨. మూత్రముపేళ్లు.
* ఉచ్చారావస్కరౌ శమలం శకృత్.
పురీషగూథే వర్చస్క మస్త్రీ విష్ఠా విషా స్త్రియామ్,
ఉచ్చార్యతే త్యజ్యతఇతిఉచ్చారః. చర గతౌ. విడువఁబడునది. ౧. అవలధః క్రియత ఇత్యవస్కరః. డుకృఞ్ కరణే. క్రిందుగాఁజేయఁబడునది. ౨. శ్యామతిశమలం.శము ఉపరమే. నశించునది. ౩. శక్నోతి అనేనేతి శకృ త. న. శక్ ౯ శక్తౌ. దీనిచేత శక్తుఁడౌను. ౪. పూర్యతే అనేన ఉదరమితి పురీషం. పౄ పాలనపూరణయోః. దీనిచేత నుదరము నిండింపఁబడును. ౫. గూయతే ఉత్సృజ్యత ఇతిగూథం. గు పురీషోత్సర్గే.విడువఁబడునది. ౬. వృజ్యత ఇతి వర్చస్కం. అ. న్న. వృజీ వర్జనే. విడువఁబడునది. ౭. వితిష్ఠతి నాభేరధః విష్ఠా. ష్ఠా గతి నివృత్తౌ. నాభిక్రింద నుండునది. ౮. విశతి నాభేరధః విట్. ష. సీ. విశ. ప్రవేశనే. నాభిక్రిందఁ బ్రవేశించునది. శకారాంత స్త్రీలింగమును గలదు. ౯. అమేధ్యముపేళ్లు.
* స్యాత్కర్పరః కపాలోఽస్త్రీ-
భారధారణాయ కల్పతే సమర్థో భవతి కర్పరః. కృపూ సామర్థ్యే. భారమును ధరించుటకొఱకు సమర్థమైనది. ౧. కం శిరః పాతి

... అప్న. శిరస్సును రక్షించునది. ౨. తలయెముకతునకపేళ్లు.

కీకసం కుల్య మస్థిచ. ౬౮

కీతిశబ్దం కుర్వన్ కసతి చలతీతి కీకసం. కస గతౌ. కి యనెడు ... ను జేయుచు చలించునది. ౧. కోలతి సంస్త్యాయతి కుల్యం. కుల ... స్త్యానే. కూడుకొనియుండునది. ౨. అస్యతే త్యజ్యత ఇత్యస్థి. ఇ. స. ... క్షేపణే. విడువఁబడునది. ౩. ఎముకపేళ్లు.

... స్యాచ్ఛరీరాస్థ్ని కఙ్కాలః-

కం జలం స్వాభ్యన్తరేణ కాలయతి ప్రేరయతి కంకాళః. కల కిల ... జలమును తనలోనికిఁ బ్రేరేపించునది. డొక్కపేరు. ౧. చర్మమాం ... సాతమై ఒకటితో నొకటి కూడుకొనియున్న ఒడలియెముకల సము ... యము.

పృష్ఠాస్థ్ని తు కశేరుకా,

కో వాయుశ్శేతే౽త్ర కశేరుకా. శీఙ్ స్వప్నే. వాయువు దీని ... యుండును. ౧. వెన్నెముకపేరు.

శిరోస్థని కరోటిః స్త్రీ-

కం వాయుం రోటతే కరోటిః. రుట దీప్తౌ, ప్రతిఘాతే. వాయు ... అడ్డపెట్టునది. ౧. తలపుఱ్ఱె.

పార్శ్వాస్థని తు పర్శుకా. ౬౯

స్పృశ్యతే శయనాదినేతి పర్శుకా. స్పృశసంస్పర్శనే. శయ ... నులచేత స్పృశింపఁబడునది. ౧. "జంఘాస్థని నళం ప్రోక్తం నళకం ... త్వయోరుభా" విత్యధికపాఠః. ప్రక్కయెముక.

... అఙ్గం ప్రతీకోఽవయవోఽపఘనః-

అఙ్గతి చలతి అఙ్గం. అగి గతౌ. చలించునది. ౧. ప్రత్యేత్య ... అన్యోన్యాభిముఖ్యేన గచ్ఛతీతి ప్రతీకః. ఇణ్ గతౌ. అన్యోన్యమభిము ... ముగానుండునది. ౨. అవయౌతి మిథో మిశ్రీభవతి అవయవః. యు ... మిశ్రణే. అన్యోన్యము కూడియుండునది. ౩. అపహన్యత ఇత్యపఘనః. ... హన హింసాగత్యోః. పీడింపఁబడునది. ౪. కరచరణాద్యవయవముల ... పేరు.

అథ కళేబరమ్,

* గాత్రం వపుః సంహననం శరీరం వర్ష్మ విగ్రహః.

కాయో దేహః క్లీబపుంసోః స్త్రియాం మూర్తి స్తను స్తనూ

ఆదానాద్యుపయోగితయాకళే కరే బరం వరం కళేబరం. ... యోర్వబయోశ్చాభేదః. పుచ్చుకొనుట మొదలైన క్రియల కుప... గించుటచేత హస్తమందు శ్రేష్ఠమైనది. కల్యతే ఆద్రియత ఇతి ... బరం. కల సంఖ్యానే. ఆదరింపఁబడునది. ౧. గాతే గచ్ఛతీతి గా... గాజ్ గతౌ. పోవునది. ౨. ఉప్యతే ప్రాక్కర్మభిరితి వపుః. ... బీజసంతానే. పూర్వకర్మములచేతఁ బుట్టింపఁబడునది. ౩. సంహ... సంబద్ధ్యన్తే అఙ్గాన్యత్రేతి సంహననం. హన హింసాగత్యోః. ... వములు దీనియందుఁ గూడియుండును. పృథివ్యాదిపంచభూతాని ... న్తిసంహతాని భవన్త్యత్రేతి సంహననం. పృథివ్యాదిపంచభూత... దీనియందుఁ గూడియుండును. ౪. శీర్యత ఇతి శరీరం. శౄ హి... యాం. నశించునది, ౫. వృష్యత ఇతి వర్ష్మ. న. న. వృషు ... తడుపఁబడినది. ౬. విశేషేణాత్మనా గృహ్యత ఇతి విగ్రహః, ... ఉపాదానే. విశేషముగా ఆత్మచేత గ్రహింపఁబడినది. ౭. చీయ... వయవైరితి కాయః. చిఞ్ చయనే. అవయవములచేత కూర్చ... నది. ౮. దిహ్యతే అన్నరసేనేతి దేహః. అ. పు. దిహ ఉపచయే... న్నరసాదులచేత వృద్ధిబొందింపఁబడునది. ౯. మూర్ఛతి సముచ్ఛ్రి... భవతీతి మూర్తిః, స్త్రీ. మూర్ఛా మోహసముచ్ఛ్రాయయోః. ... మగునది. ౧౦. తన్యతే ఆహారేణ తనుః. ఉ. స్త్రీ. తనూశ్చ. ఊ. స్త్రీ... విస్తారే. ఆహారముచేత విస్తారము చేయఁబడునది. తనుశబ్దము ... రాంత నపుంసకంబును గలదు. 'తను పేతను పేక' మితి వాసు... ౧౧. ౧౨. శరీరము పేళ్లు.

* పాదాగ్రం ప్రపదమ్-

పాదస్య అగ్రం పాదాగ్రం. పాదముకొన. ౧. పదస్య ప్రా... భః ప్రపదం. పదముయొక్క ప్రారంభము. ౨. మీఁగాళ్లు,

* పాదః పదఙ్ఘ్రి శ్చరణోఽస్త్రియామ్,

పద్యతే అనేనేతి పాదః. పచ్చ. ద. పు. పద గతౌ. దీని... బోదురు. ౧. ౨. అఙ్గతి గచ్ఛత్యనేన అంఘ్రిః. పు. అఘి గతౌ. దీ...

ము. ౩. చరత్యనేన చరణః. అ. పు. చర గతిభక్షణయోః. దీని
సంచరింతురు. ౪. పాదము పేళ్లు.

ర్ణ్రంథీ ఘుటికే గుల్ఫౌ-

ఘోటతే పరివర్తతే ఘుటికా. ఘుట పరివర్తనే. చుట్టువాఱి
యునది. ౧. అభిఘాతాద్గుల్ఫ్యతే రక్ష్యత ఇతి గుల్ఫః. గుడ రక్షా
. అభిఘాతమువలన రక్షింపఁబడునది. ౨. పాదముల పార్శ్వము
వెలి బుడుపుల పేళ్లు. చీలమండ.

పుమాన్ పార్ష్ణి స్తయోరధః,

పారయతి గమనం పార్ష్ణిః. పు. పార తీర కర్మసమాప్తౌ. గమన
ను నెఱవేర్చునది. పార్ష్ణి. అని స్త్రీలింగంబును గలదు. 'పార్ష్ణ్యైవ
తాసుం దనుసుత మవతాత్కుర్వతీ పార్వతీ నః' 'పార్ష్ణిః స్త్రీపుం
సాః పాదమూలే స్యా' దితి నిఘంటు. ౧. మడమ.

జఙ్ఘాతు ప్రసృతా-

జాయత ఇతి జంఘా. జనీ ప్రాదుర్భావే. పుట్టునది. ౧. ప్రసర
ప్రసృతా. సృ గతౌ. వృద్ధిఁబొందునది. ౨. పిక్క పేళ్లు.

జానూరుప ర్వాష్ఠీవ దస్త్రియామ్. ౭౨

జాయతే జంఘోరుసంధిభాగ ఇతి జాను.ఉ.న.ప.పుం.జనీ ప్రాదు
ర్భావే. తొడపిక్కలసందునఁ బుట్టునది. 'జాను మపృష్ఠ్య మృద్నియాత్'.
సుశ్రుతప్రయోగము. ౧. ఊర్వోః పర్వ ఊరుపర్వ. న. న. తొడల
క్క కనుపు. ౨. అస్థీన్యత్రా స్తీతి అష్ఠీవత్. త. పు. ఎముకగలది.
మోఁకాలిపేళ్లు.

సక్థి క్లీబే పుమానూరుః-

సజతే సంగచ్ఛతీతి సక్థి. షంజ సంగే. కూడుకొనియుండునది. ౧.
ర్ణూయతే వస్త్రేణేతి ఊరుః. ఉ. పు. ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే. వస్త్రముచే
ప్పఁబడునది. ౨. తొడ పేళ్లు.

తత్సంధిః పుంసి వఙ్క్షణః,

వంకతే ఉపవేశసమయే కించిత్కుటిల మాపద్యత ఇతి వంక్షణః,

వకి కౌటిల్యే. కూర్చుండునపు డించుక కుటిలత్వమును బొందు
తొడలు పిఱుదులు వీనియొక్క సంధి. గజ్జలు.

* గుదం త్వపానం పాయు ర్నా-

గువతి పురీషముత్సృజతీతి గుదం. గు పురీషోత్సర్గే. మ
విడుచునది. ౧. అపానతి అధోవాయు ముత్సృజతి అపానం.
ణనే. అధోవాయువును విడుచునది. ౨. పాతి మలోత్సర్జనేన
ఉ.పు.పా రక్షణే. మలమును విడుచుటచేత రక్షించునది. 3.గుద
పేళ్లు.

* వ స్తి ర్నాభే రధో ద్వయోః.

వసతి మూత్రాదికమత్రేతి వస్తిః. ఇ.పు.వస నివాసే. మ
దికము దీనియం దుండును. ౧. బొడ్డుక్రిందిపొత్తికడుపు.

* కటో నా శ్రోణిఫలకమ్-

కట్యతే ఆవ్రియతే వస్త్రాదినేతి కటః. కటే వర్షావరణ
వస్త్రాదులచేఁ గప్పఁబడునది. ౧. ఫలకాకృతిః శ్రోణిః శ్రోణిఫలకం.
కవలెనుండెడుశ్రోణి. ౨. మొలపేళ్లు.

* కటి శ్శ్రోణిః కకుద్మతీ,

కట్యతే కటిః. సీ.పా. కటీ. సీ. కప్పఁబడునది. ౧. శ్రోణి
చ్ఛతే శ్రోణిః.సీ.పా. శ్రోణీ.సీ. శ్రోణృ సంఘాతే. సంహతమైయుం
౨.శ్రోణిపార్శ్వదేశో మాంసలతయా కకుదాకారత్వాత్ కకు
తే. తద్యోగాత్ కకుద్మతీ. సీ. మూఁపురమువలె బలిసియుండు
పార్శ్వముగలది. 3. పిఱుదులపేళ్లు. ఈగేను మొలపేళ్లని కొంద

* పశ్చా న్నితంబః స్త్రీకట్యాః-

సురతసమ్మర్దేన నితరాం తామ్యతి నితంబః. తము గ్లానౌ.
సమ్మర్దముచేత మిక్కిలి గాసిఁ బొందునది. ౧. స్త్రీలమొలకు
నున్నప్రదేశము. పిఱుదు.

* క్లీబే తు జఘనం పురః.

హన్యతే పురుషేణ తాడ్యత ఇతి జఘనం.హన హింసాగ
పురుషునిచేత పీడింపఁబడునది. ౧. స్త్రీలమొలముందరిచోటు. మ

* కూపకౌ తు నితమ్బస్థౌ ద్వయహీనే కుకున్దరే,

యా కూపకౌ పృష్ఠవంశాదధోగతౌ తే కుకుందరే ఇత్యుచ్యేతే.
...కలమీదనుండు గుంటలు కుకుందరము లనంబడును. కు ఈషత్
...తుబభూమిం దృణీత ఇతి కుకుందరే. అ. న. ద్వివచనము. ఇంచు
...నితంబభూమిని భిన్నముగాఁ జేయునది. ఆఁడుదాని పిఱుఁదుల
...గుంటలు.

...స్త్రియాం స్ఫిచౌ కటిప్రోథౌ-

స్ఫాయేతే స్ఫిచౌ. చ. సీ. ప. జ. సీ. స్ఫాయీ వృద్ధౌ. వృద్ధిఁబొం
... ౧. కట్యాః ప్రోథౌ మాంసపిండౌ కటిప్రోథౌ. అ. పు. కటియొక్క
...సపిండములు. ౨. పిఱుఁదులమీఁది యున్నతప్రదేశముల పేళ్లు.

ఉపస్థో వక్ష్యమాణయోః. ౭౫

ఉప సమీపే తిష్ఠతీత్యుపస్థః. స్థా గతినివృత్తౌ. పరస్పరము సమీ
...మండునవి. ౧. ముందరఁ జెప్పఁబడు రెంటియందును ఉపస్థశబ్దము
...చును.

...భగో యోని ర్ద్వయోః-

భజ్యతే పురుషైరితి భగః. భజ సేవాయాం. పురుషులచే నాశ్ర
...ఁబడునది. ౧. యౌతి శిశ్నేన యోనిః. అ. పు. యు మిశ్రణే. శిశ్న
...ఁ గూడుకొనునది. ౨. యోని (స్త్రీ యుపస్థము) పేళ్లు.

శిశ్నో మేఢ్రో మేహన శేఫసీ,

శ్లిష్యతి భగేన శిశ్నః. శ్లిష ఆలింగనే. భగముతోఁ గూడున
... రేతసా భగం మేహతి మేఢ్రః. మేహనం చ. మిహ సేచనే. రేత
...త భగమును దడపునది. ౨. ౩. రేతసః ప్రావేణ శేతే శేఫః. స.
...ఙ్ స్వప్నే. రేతస్సుపడినమీఁదట నింద్రించునది. అకారాంతంబును
... శిశ్నము పేళ్లు.

ముష్కోఽణ్డకోశో వృషణః-

ముష్ణాతి గోపాయతి రేత ఇతి ముష్కః. ముష స్తేయే. రేతస్సును
...నది. ౧. అండయోః కోశః అండకోశః. అండములయొక్క కూ
అండః, కోశః. అని రెండు పేళ్లని కొందఱు. ౨. వర్షతి రేత ఇతి
...ః. వృషు సేచనే. రేతస్సును గురియునది. ౩. వృషణముల పేళ్లు.

పృష్ఠవంశాధరే త్రికమ్. ౭౬

పృష్ఠవంశాధరే త్రికం. పృష్ఠవంశమనఁగా వీఁపుయెముక. దిగువనున్న ప్రదేశము త్రికమనంబడును. త్రయాణాం ఊరుద్వయ స్థినాం సమాహార స్త్రికం. తొడలు రెండును వీఁపుయెముకయు యొక్క కూటమిగనుక త్రికము. ౧. వెన్నెముక దిగువనున్నచోటు

* పిచణ్డకుక్షీ జఠరోదరంతున్దమ్-

పచతి అన్నం స్వగతాగ్నినా పిచండః. తనయందుండె చేత అన్నమును బక్వము సేయునది, అపిచము త్యాహార మితివా చము అదనే. ఆహారమును భక్షించునది. ౧. కుష్యతే బహిష్కి మలమస్మాదితి కుక్షిః.పు. కుష నిష్కర్షే. దీనివలన మలము బయలు పఁబడును. ౨. జన్యతే గర్భోఽస్మిన్నితి జఠరం. జనీ ప్రాదుర్భావే యందు గర్భము పుట్టింపఁబడును. ౩. ఉదియర్తిగర్భోఽస్మాదితి ఋ గతౌ. దీనివలన గర్భము ప్రకాశమౌను. ౪. తుద్యతే అజీర్ణ తుందం. తుద వ్యథనే. అజీర్ణాదులచేత వ్యథపెట్టఁబడునది. ౫. దిశబ్దములు ౩ ను సమాహారద్వంద్వము. కడుపుపేళ్లు.

* స్తనౌ కుచౌ,

స్తనతి బాల ఆభ్యా మితి స్తనౌ. అ. పు. స్తన శబ్దే. అకు బాలుఁడు మొఱపెట్టును. ౧. కుచ్యతే కామినా నఖైః అ.పు. నాయకునిగోళ్లచే గిల్లఁబడునవి. ౨ చన్నులపేళ్లు.

* చూచుకం తు కుచాగ్రం స్యాత్ -

చూచు ఇతి కాయతి బాలేన పీయమానమితి చూచుకం శబ్దే. బాలునిచేత పానము చేయఁబడుచున్నదై చూచు అని దె. ౧. కుచయోరగ్రం కుచాగ్రం. కుచములయొక్క అగ్రము చనుమొనలు.

* న నా క్రోడం భుజాన్తరమ్,

క్రోడతీతి క్రోడం. అ.స్న. క్రుడ ఘనత్వే. ఘనమైనది. ౧. యో రంతరం భుజాంతరం. భుజములయొక్కనడుము. ౨ చేతు ము పేళ్లు.

* ఉరో వత్సంచ వక్షశ్చ-

స్థైర్యమృచ్ఛత్యురః. స.న. ఋ గతౌ. స్థైర్యమును బొందున

...శేన స్త్రీణ వత్సం. వస ఆచ్ఛాదనే. వస్త్రముచే గప్పఁబడునది. ౨.
...కే సురతాదా వక్షః. స. న. వక్ష సంఘాతే. సురతాదులయందుఁ
...బడినది. 3 బొమ్మపేళ్లు. ౫ ను బొమ్మపేళ్లని కొందఱు.

పృష్ఠం తు చరమం తనోః,

తనోశ్చరమం పృష్ఠ మిత్యుచ్యతే. శరీరముయొక్క వెనుకటిభా
...పృష్ఠమనంబడును. పృష్యతే కేశోదకై రితి పృష్ఠః. పృషు సేచనే
...ంద్రకల నీళ్ళచేఁ దడుపఁబడునది.

స్కన్ధో భుజశిరోఽంసోఽస్త్రీ-

కం శిరో దధాతీతి స్కంధః. డు ధాఞ్ ధారణపోషణయోః.
...ము ధరించునది. ౧. భుజస్య శిరోఽగ్రం భుజశిరః. స.న. భుజము.
...కొన. ౨. అమ్యతే భారేణ అంసః. అ. పు. అమరోగే. భార
... బీడింపఁబడునది. 3 మూఁపుపేళ్లు.

సంధీ తస్యైవ జత్రుణీ. ౭౮

జాయతే బాహురస్మాత్ జత్రు. ఉ. న. జనీ ప్రాదుర్భావే. దీని
... బాహువు పుట్టును. ౧. మూఁపుసంధులు. ఆమూఁపుయొక్కయు
...మ్మయొక్కయు సంధు లని కొందఱు.

బాహుమూలే ఉభే కక్షౌ-

బాహ్వోర్మూలే బాహుమూలే. అ. న. చేతులయొక్క మొ
... ౧. కష్యేతే స్వేదేన కక్షౌ. అ. పు. కష హింసాయాం. చెమటచేఁ
...పఁబడునవి. ౨ చంకలపేళ్లు.

పార్శ్వ మస్త్రీ తయో రధః,

పూర్యతే అస్థిభి రితి పార్శ్వం. అ. పు. పౄ పాలనపూరణయోః.
...కలచేత పూర్ణమైయుండునది. ౧. చంకలక్రిందిభాగము. ప్రక్క.

మధ్యమం చావలగ్నం చ మ ధ్యోఽస్త్రీ)-

మధ్యేభవం మధ్యం, మధ్యమం చ. శరీరమునడుమఁ బుట్టినది.
...గ్యత ఇతి అవలగ్నం లగే సఙ్గే. పూర్వాపరములతోఁ గలియునది. 3
...ము పేళ్లు.

ద్వా పరౌ ద్వయోః, ౭౯

భుజబాహూ ప్రవేష్టో దోః స్యాత్ -

ద్వౌ పరౌ ద్వయోః. ఈముందు చెప్పఁబడు భుజబాహు లురెండును స్త్రీలింగ పులింగములయందు వర్తించును. భుజ్యతే దికమనేనేతి భుజః. భుజపాలనాభ్యవహారయోః. దీనిచేత భు డును. ౧. బాహతే అనేన పురుషో వస్తూపాదనాయ ప్రయత్నం బాహుః.ఉ.పు. బాహృప్రయత్నే. దీనిచేత పురుషుఁడు వస్తు హించుటకు యత్నముచేయును. బాధత ఇతి బాహుః. బాధిం స్త్రీలింగమైనప్పుడు ఆకారాంతము. ౨. ప్రవేష్ట్యతేఽనేన ప్రవేష్టః వేష్టనే. దీనిచేత చుట్టఁబడును. ౩. దమ్యతే అనేన దోః. న.పు. శిక్షింపఁబడును. దోః దోషా. దోషః. సకారాంతనపుంసకము దోః, దోషీ, దోంషి. దోషా. 'ఆకారాంత స్త్రీలింగము. "దో చ భుజోబాహు" రితి ధనంజయః. "బాహో దోషా ప్రవేష్ట" జరీ. "దక్షిణం దోర్నిశాచర" ఇతి కాళిదాసశ్చ. నకారాంత గలదని కొందఱు. ౪ చేతులపేళ్లు.

* కఫోణిస్తు కూర్పరః,

కం సుఖం ఫుణతి కరోతి కఫోణిః. ఇ. పు. ఫుణ శుభక సుఖమును జేయునది. పా. కఫోణీ. సీ. 'కఫోణిరనపుంసకం' అని డు. కఫోణిశబ్దము నుకారమధ్యముగాఁ గొందఱు చెప్పుదురు.౧ ర్థ కర్షణే హఠాత్ కురతి కూర్పరః. కుర శబ్దే. పదార్థములను గ తీయునపుడించుక ధ్వనించునది. పా. కుర్పరః. మోఁచేతిపేళ్లు.

* అస్యోపరి ప్రగణ్డ స్స్యాత్ -

ప్రగణ్యతే సువృత్తతయా ప్రగండః. గణ సంఖ్యానే. టచే లెక్కపెట్టఁబడునది. ౧. మోఁచేతిమీఁద భుజమూలము గలభాగము.

* ప్రకోష్ఠ స్తస్య చాప్యధః.

ప్రకృష్యతే ప్రావరణా ద్బహి ర్నిస్సార్యత ఇతి ప్రకోష్ఠః నిష్కర్షే. కప్పునకు వెలుపలగాఁ దీయఁబడునది. మణికట్టువఱకు మోఁచేతిక్రిందప్రదేశముపేరు. ౧. ముంజేయి.

* మణిబన్ధా దాకనిష్ఠం కరస్య కరభో బహిః,

మణిబన్ధో ... ప్రగ్రంథిః ... కనిష్ఠపర్యన్తం

గ॥ కరభ ఇత్యుచ్యతే - మణికట్టునుండి చిటికెనవ్రేలిదనుక చేతి వెలుపలిపార్శ్వము కరభ మనఁబడును. కరే భాతి. కరభః - యందు ప్రకాశించునది. ౧. మణికట్టుమొదలు చిటికెనవ్రేలివఱకుఁ చేతివెలుపలిభాగము.

పఞ్చశాఖ శ్శయః పాణిః-

పఞ్చ శాఖా అఙ్గులీరూపా అస్యేతి పఞ్చశాఖః - వ్రేళ్లనెడి కొమ్మలుగలది. ౧. స్వకీయ ధనమత్ర శేతే తిష్ఠతీతి శయః. స్వప్నే. తనధనము దీనియం దుండును. ౨. పణతి వ్యవహారత్య పాణిః. ఇ. పు. పణ వ్యవహారే స్తుతౌ చ. దీనిచేత నరుఁడు వ్యవహరించును. 3 మణికట్టునుండి వేళ్లతోఁగూడిన చేతిపేళ్లు.

తర్జనీ స్యా త్ప్రదేశినీ. ౮౧

తర్జయం త్యనయా తర్జనీ. నీ. తర్జ భర్జ సంతర్జనే. దీనిచేత భయపెట్టుదురు, ౧. ప్రదిశతి నిర్దిశత్యనయా ప్రదేశినీ. పా. ప్రదేశనీ. నీ. అతిసర్జనే. దీనిచేత నిర్దేశింతురు. ౨ జుట్టన వ్రేలిపేళ్లు.

అఙ్గుళ్యః కరశాఖా స్స్యుః-

అఙ్గన్తి అన్యోన్యం అఙ్గుళ్యః. ఈ. నీ. బహువచనము. అగి గతౌ-స్వరము కలసియుండునవి. ఇకారాంతమును గలదు. అకారాంత నపుంసకమును గలదు. కరస్య శాఖా ఇవ కరశాఖాః - హస్తమునకు కొమ్మలవలె నుండునవి. ౨ సామాన్యముగా వ్రేళ్లపేళ్లు.

పుం స్యఙ్గుష్ఠః ప్రదేశినీ,

మధ్యమానామికా చాపి కనిష్ఠా చేతితాః క్రమాత్. ౮౨

అఙ్గే తిష్ఠతీత్యఙ్గుష్ఠః. ష్ఠా గతినివృత్తౌ - అంగమం దుండునది. బొటనవ్రేలు. ౧. ప్రదేశిని ముందు చెప్పఁబడినది. ౧. మధ్యేభవా మధ్యమా. నడుమ నుండునది. నడిమివ్రేలు. ౧. నాస్తి ప్రసిద్ధనామాస్య అనామికా - ప్రసిద్ధమైన నామము దీనికి లేదు. దర్భవ్రేలు. ౧. అతిశయేన అల్పా కనిష్ఠా - మిక్కిలి చిన్నది. చిటికెనవ్రేలు. ౧ వరుసగా బొటనవ్రేలు దగ్గిరనుండి అయిదువేళ్లకును పేళ్లు.

పునర్భవః కరరుహో నఖోఽస్త్రీ నఖరోఽస్త్రియామ్,

ఛిన్నోఽపి పునర్భవతీతి పునర్భవః-ఛిన్నమైనను మరల మొలచు

నది. ౧. కరే రోహతీతి కరరుహః. రుహ బీజజన్మని ప్రాదు
చేతియందు మొలచునది. ౨. న విద్యతే ఖ మింద్రియం స్ప
మత్ర నఖః. అ. ప్న. స్పర్శజ్ఞాపక మైనయింద్రియము దీనికి లే
నఖశబ్దో నఖైకదేశేఽపి. సోఽస్యాస్తీతి నఖరః. అ. ప్న. నఖశ
ఖైకదేశమందు వర్తించును. ఆనఖైకదేశముగలది. అరుణుని
రశబ్దము త్రిలింగమని చెప్పఁబడెను. గోళ్లపేళ్లు.

* ప్రాదేశ తాల గోకర్ణా స్తర్జన్యాదియుతే తతే.

ప్రదన్యతే పరిమీయతేప్రాదేశః. దిశ అతిసర్జనే. పెను
జుట్టనవ్రేళ్లనడిమికొలత. జుత్తెడు. ౧. తలతి ప్రతిష్ఠతే పరిమేయ
న్నితి తాలః. తల ప్రతిష్ఠాయాం - కొలవఁదగినవస్తువు దీని
ప్రతిష్ఠగలిగియుండును. పెనువ్రేలునడిమి వ్రేళ్లనడిమికొలత. ౧.
కృతిరత్రాస్తీతి గోకర్ణః - ఆవుచెవులవంటి ఆకారముగలది. పెను
దర్భవ్రేళ్లనడిమికొలత. వరుసగా, జుట్టనవ్రేలు, నడిమివ్రేలు, దర్భ
వీనితోఁగూడి చాఁచఁబడిన బొటనవ్రేలిచేతఁ గొలిచిన. 3 కొ
పేళ్లు. దుత్తెళ్లు.

* అఙ్గుష్ఠే సకనిష్ఠే స్యా ద్వితస్తి ర్ద్వాదశాఙ్గుళః,

వితస్యతి హస్తాపేక్షయా ఉపక్షయతే వితస్తిః. తసు ఉపక్ష
హస్తమునుగూర్చి. తక్కువైనది. ఈశబ్దము సాహచర్యమునఁ
గము. స్త్రీలింగంబును గలదు. "వితస్తిః స్త్రీ కనిష్ఠా చ" అని
మాల. ౧. ద్వాదశ అఙ్గుళయః ప్రమాణ మస్య ద్వాదశాఙ్గు
డ్రం డంగుళములప్రమాణము గలది. ౨ చిటికెనవ్రేలితోఁగూడి
చఁబడిన పెనువ్రేలిచేతఁ గొలిచిన కొలతపేళ్లు. జానెఁడు.

* పాణౌ చపేట ప్రతల ప్రహస్తా విస్తృతాఙ్గులౌ.

విస్తృతాఙ్గులౌ పాణౌ చపేటాదిత్రయం వర్తతే. చప్యతే
త్రాదిసాన్త్వ్యతే అనేన చపేటః. చప సాన్త్వనే - దీనిచేత ప్ర
దులు ఊరడింపఁబడుదురు. ౧. ప్రసృతం తలమస్యాస్తీతి ప్రతలః-వి
మైన ప్రదేశముగలది. ౧. విస్తృతో హస్తః ప్రహస్తః. విస్తృత
హస్తము. 3 చాఁచినవ్రేళ్లు గలయఱచేతిపేళ్లు.

* ద్వౌ సంహతౌ సంహతల ప తలౌ వామ దక్షిణౌ,

సహితం సంఘట్టం లాతీతి సంహాతలః. పా. సింహాతలః. లా
...సే. సంఘట్టమునుబొందునది. ౧. ప్రతతే తలే అత్ర ప్రతలః-చాఁ
...యఁబచేతులుగలది. ౨ చాఁచినవ్రేళ్లు గలిగి కలుపఁబడిన కుడి
...ను యఁబచేతులవేళ్లు.

...పాణిర్నికుబ్జః ప్రసృతిః-

కుంచితః పాణిః ప్రసృతిరుచ్యతే - వంచఁబడిన యఁబచేయి ప్ర
...యనంబడును. నితరాం కుబ్జా ప్రకృతిరస్య నికుబ్జః - మిగులనిఱికి
...కునలవాటుగలది. ౧. ప్రసార్యతే విరుద్ధలక్షణయా సంకుచ్యత
...ప్రసృతిః- చాచఁబడినది. అనఁగా విరుద్ధలక్షణచేత ముడుపఁబడినది
...టి. ౨ చేర, పుడిసిలి.

తౌ యుతావఞ్జలిః పుమాన్. ౮౫

అఞ్జ్యతే వ్యజ్యతే భక్తిరనేనేతి అఞ్జలిః. ఇ. పు. అఞ్జూ వ్యక్తిమ్ల
...న్తిగతిషు - దీనిచేత భక్తి వ్యక్తముగాఁ జేయఁబడును. దోసిలి.

ప్రకోష్ఠే విస్తృతకరే హస్తో-

కఫోణేరధః ప్రకోష్ఠః.తత్ర విస్తృతకరే సతి హస్త ఇత్యుచ్యతే-
...బడిన అరచెయ్యిగల మోఁచేతికి దిగువ నున్న ప్రదేశము హస్త
...బడును. మూర. హన్యతే అంశుకాదిరనేన హస్తః. హన హిం
...త్యోః - దీనిచేత వస్త్రాదులు కొట్టఁబడును. అనఁగా కొలవఁబడు
... ౧.

ముష్ట్యా తు బద్ధయా,

...రత్నిః స్యాత్ -

బద్ధయా ముష్ట్యా ఉపలక్షితః స హస్తో రత్నిరుచ్యతే-ముడువఁ
...యఁబచేయిగల యాహస్తము రత్నియనంబడును. రమన్తే వ్యవ
...రనేనేతి రత్నిః. రము క్రీడాయాం-దీనిచేత వ్యవహారులు క్రీడిం
... ౧. పిడిమూర.

అరత్నిస్తు నిష్కనిష్ఠేన ముష్టినా. ౮౬

నిష్కనిష్ఠేన నిర్గతకనిష్ఠాఙ్గులినా ముష్టినా ఉపలక్షితో హస్త
...ఇత్యుచ్యతే-చాఁచినచిటికెనవ్రేలు గల పిడికిలితోఁ గూడినమూర
...యనంబడును. ఋచ్ఛతి మానసంజ్ఞా మిత్యరత్నిః. ఇ. పు. ఋ.

గతౌ-ప్రమాణసంజ్ఞను బొందునది. రత్న్యరత్నిశబ్దములు హ
హాచర్యమువలనఁ బుల్లింగములు. 'నారత్నిః కఫణౌ హస్తే స
తతాఙ్గుళే' అని రుద్రుఁడు. స్త్రీలింగమును గలదు. 'రత్న్య
యాహస్తా బద్ధముష్టితలాంగుళౌ' అని యమరమాల.' ముష్టి
నా' అని రూపభేదములచేత ముష్టిశబ్దము పుంస్త్రీలింగముల
వర్తించును.

* వ్యామో బాహ్వోః సకరయో స్తతయో స్తిర్య గన్తరమ్,

సకరయోః పాణిసహితయోః తిర్యక్తతయోః తిర్యక్
యో ర్బాహ్వో రన్తరం వ్యామ ఇత్యుచ్యతే - అఱచేతులతో
డ నడ్డముగా చాచఁబడిన బాహువులయొక్క నడుము వ్యామ
బడును. వ్యామీయతే రజ్జ్వాదిక మనేనేతి వ్యామః. మాఙ్
త్రాడు మొదలైనవి దీనిచేత కొలవఁబడును. ౧. బార.

* ఊర్ధ్వవిస్తృతదోఃపాణినృమానే పౌరుషం త్రిషు.

ఊర్ధ్వం విస్తృతః ప్రసారితః దోస్సహితః పాణి ర్యస్య
రుషస్య మానం పౌరుష మిత్యుచ్యతే - మీఁదికి చాచఁబడిన
వులతోఁగూడిన అఱచేయిగలపురుషునియొక్క ప్రమాణము
షమనంబడును. పురుషస్యేదం మానం పౌరుషం. త్రి. పురుష
క్క ప్రమాణము. పౌరుషం జలం. పౌరుషస్సేతుః. పౌరుషీ
మానిసిచేయెత్తుపొడవు.

* కణ్ఠో గళః-

కణతి ధ్వనతి కణ్ఠః. కణ శబ్దే - పలుకునది. ౧. గళ
గళః. గళ అదనే - దీనిచేత మ్రింగుదురు. ౨ కుత్తుకపేళ్లు.

* అథ గ్రీవాయాం శిరోధిః కంధరేత్యపి,

గిర న్త్యనయాఽన్నాదిక మితి గ్రీవా. గౄ నిగరణే - దీ
నన్నాదుల మ్రింగుదురు. ౧. శిరో ధీయతేఽస్యామితి శిరోధిః.
ధాఞ్ ధారణపోషణయోః - దీనియందు శిరస్సు ధరింపఁబడును.
కం శిరో ధారయతి కంధరా. ధృఞ్ ధారణే- శిరస్సును ధరించు
3 మెడపేళ్లు.

* కమ్బుగ్రీవా త్రిరేఖా సా-

సా త్రిరేఖా రేఖాత్రయయుక్తాచే త్కమ్బుగ్రీ వేత్యుచ్యతే -
మూఁడు రేఖలు గలదై కంబుగ్రీవ యనంబడును. కమ్బుతుల్యా
కమ్బుగ్రీవా - శంఖసమమైనమెడ. ౧. మూఁడురేఖలుగలమెడ.

అవటు ర్ఘాటా కృకాటికా. ౮౮

వ వటతి న వేష్టతే అవటుః. వట వేష్టనే - చుట్టువాఱియుండ
పుంలింగము. 'అవటుః పురుషే. కృకాటికా' అని రత్నకోశము.
సమ స్తకయోస్సంధిం ఘటతే ఘాటా. ఘట చేష్టాయాం - శరీర
ములయొక్క సంధిని ఘటించునది. ౨. కృశం శిరోగ్రీవే అటతి
తి కృకాటికా. అట గతౌ-శిరస్సును మెడను పొందియుండు
పెడతలపేళ్లు.

క్త్రాస్యే వదనం తుణ్డ మాననం లపనం ముఖమ్,
ఉచ్యతేఽనేన వక్త్రం. వచ పరిభాషణే-దీనిచేత పలుకఁబడు
. అస్యతే క్షిప్యతే భక్ష్యమత్రేతి ఆస్యం. అసు క్షేపణే - దీని
భక్ష్యవస్తువులు వేయఁబడును. ౨. వదన్త్యనేన వదనం. వ
క్తాయాం వాచి - దీనిచేత పలుకుదురు. ౩. తుడ్యతే హింస్యతే
మనేనేతి తుణ్డం. తుడి తోడనే - భక్ష్యవస్తువు దీనిచేత పీడింపఁ
. ४. అనితి శ్వసత్యనేన ఆననం. అన ప్రాణనే - దీనిచేత బ్రతు
. ౫. లపంత్యనేన లపనం. లప వ్యక్తాయాం వాచి - దీనిచేతఁ
దురు. ౬. ఖన్యతే భక్ష్యమనేనేతి ముఖం. ఖను అవదారణే -
భక్ష్యము పీడింపఁబడును. ౭ ముఖముపేళ్లు. నోరు.

బే ఘ్రాణం గన్ధవహో ఘోణా నాసా చ నాసికా. ౮౯
జిఘ్రతి అనేన ఘ్రాణం. న. ఘ్రా గన్ధోపాదానే - దీనిచేత వా
సించుదురు. ౧. గంధం వహతీతి గంధవహః. వహ ప్రాపణే- గం
వహించునది. ౨. ఘుణతి భ్రమతి గంధగ్రహణాయ ఘో
ణ భ్రమణే- భ్రమించునది. ౩.నాసతే శబ్దాయతే నాసా. నాసి
నాసృ శబ్దే. ధ్వనిచేయునది. ४. ౫ ముక్కుపేళ్లు.

ష్ఠాధరౌ తు రదనచ్ఛదౌ దశనవాససీ,
ఉష్ణాహారేణ ఉష్యతే ఓష్ఠః. ఉష ప్లుష దాహే- ఉష్ణాహారముచే
కాల్పఁబడునది. ౧. అధోభవత్వాదధరః-ముఖముయొక్క అధో

భాగమం దుండునది. ౨. రదనాః ఛాద్యంతే అనేన రదనచ్ఛదః
పవారణే - దంతములు దీనిచేఁ గప్పఁబడియుండును. 3. దశనా
త్వేన వాసస్సామ్యా ద్దశనవాసః. స. న. దంతములకు వస్త్ర
నుండునది. ర పెదవుల పేళ్లు.

* అధస్తాచ్చిబుకమ్-

ఓష్ఠా దధఃప్రదేశశ్చిబుక మిత్యుచ్యతే - పెదవియొక్క
టిప్రదేశము చిబుకమనంబడును. చీవతి చేవ్యతే వా చిబుకం
కొనియుండునది. లేక పట్టుకోఁబడినది - చీవృ ఆదానసంవరణ
౧. గడ్డము.

* గణ్డౌ కపోలౌ-

గణ్డతీతి గండః. గడి వదనైకదేశే - కూడుకొనియుండు
భక్షణసమయే కంపత ఇతి కపోలం. కపి కిఞ్చిచ్చలనే - భక్షించు
మందుఁ జలించునది. ౨ చెక్కిళ్ళ పేళ్లు.

* తత్పరో హనుః.

తాభ్యాం కపోలాభ్యాం పరః ఉపరిభాగః హనురిత్యుచ్య
చెక్కిళ్ళమీఁదటిపార్శ్వముగాని వెనుకటి పార్శ్వముగాని హను
డును. హంతి భక్ష్యం హనుః. పుం. హన హింసాగత్యోః - భక్ష
నములునది. వెలిదాడలు. (కటమరలు).

* రదనా దశనా దన్తా రదాః-

రద్యన్తే భక్ష్యా ణ్యేభి రితి రదనాః, రదాశ్చ - రద
వీనిచేత భక్ష్యములు తునకలుగాఁ జేయఁబడును. ౧. ౪. దంశ
ధరమేభిరితి దశనాః. దంశ దశనే- వీనిచేత వనితలయధరమును
కుదురు. ౨. దమ్యతే భక్ష్య మేభి రితి దన్తాః. దము ఉపశమే.
వస్తువు వీనిచేత భక్షింపఁబడును. 3. ఈ ర పుల్లింగములు. పు

* తాలు తు కాకుదమ్,

తలతి ప్రతిష్ఠతి దగ్ధశేషమత్రేతి తాలు. ఉ. న. తల
యాం- భుక్తశేషము దీనియందు నిలుచును. నకారాంతంబును
౧. కాకు ధ్వని విశేషం దదాతీతి కాకుదం. దా దానే-కాకుధ్వని
నది. ౨ దౌడపేళ్లు.

జ్ఞా రసనా జిహ్వా-

రసం జానాతీతి రసజ్ఞా. జ్ఞా అవబోధనే-రసము నెఱుఁగునది.౧.
అనయా రసనా. రస ఆస్వాదనే.దీనిచేత నాస్వాదింపఁబడును.
హ్వయతి రసవద్వస్తు జిహ్వా. హ్వేఞ్ స్పర్ధాయాం శబ్దే చ-రస
మైనవస్తువుల నిచ్ఛయించునది. 3 నాలుక పేళ్లు.

ప్రాన్తా వోష్ఠస్య సృక్విణీ. ౯౧

ఓష్ఠస్య ప్రాంతౌ సృక్విణీ ఇత్యుచ్యేతే-పెదవులయొక్క కడపటి
లు సృక్వ లనంబడును. సృజతో లాలాం సృక్విణీ-జొల్లును బు
వి. ఇకారాంతనపుంసకద్వివచనము. అకారోపధమైన నకారాంత
కద్వివచన మని కొందఱు. "వామం లిహా స్వకవ పరాపూర్ణే"
తిరాజీయే. 'సక్థ్యస్థిదధిసృక్వస్య' ఞీతి శబరస్వామీ. ౧ సెలవులు.

లాట మలికం గోధిః-

లలంత శ్చలంతః అటం త్యలకా అత్రేతి లలాటః. అట గతౌ-దీని
ముంగురులు చలింపుచు నటించును.౧. అల్యతే భూష్యతే అనే
కం. అల భూషణే-అలంకరింపఁబడునది. పా. అలీకం. "తేద్రుష్ట
పతితా అలికస్య నామత్శోభాయ పత్త్మలదృశా మలకాః కలాశ్చ,
ద్దైవ సవిలాసమలీకముగ్నా" ఇతి కావ్యప్రకాశికా. ౨. గావో
ధీయతే అస్మిన్నితి గోధిః. గోశబ్దము నేత్రవాచకము.నేత్రములు
దు ధరింపఁబడును. పుల్లింగము. "పాలో గోధిర్నరా వుభౌ"
ాదవుఁడు. 3 నుదురు పేళ్లు.

ఊర్ధ్వే దృగ్భ్యాం భ్రువౌ స్త్రియాౕ,

దృగ్భ్యామూర్ధ్వస్థానే భ్రువా విత్యుచ్యేతే. నయనములకంటె
భాగములు భ్రూవు లనఁబడును. భ్రమతి ఇతి భ్రువౌ. భ్రము
నే-చలించునవి. ఊ. సీ. ద్వి. కనుబొమలు.

ర్చ మస్త్రీ భ్రువో ర్మధ్యమ్-

భ్రువో ర్మధ్యం కూర్చ మిత్యుచ్యతే. కనుబొమలనడుము కూ
బడును. కోచతి భ్రూవోమాణి కుటిలాని కరోతి కూర్చం.కుచ
నే-కనుబొమ్మవెండ్రుకలను కుటిలముగాఁ జేయునది. ౧. కను
నడిమిప్రదేశము.

* తార కాక్ష్ణః కనీనికా.

తారయతి తమః తారకా. తౄ ప్లవనతరణయోః - ముసు దాఁటించునది. ౧. కనతి ప్రకాశయతి సర్వం కనీనికా. అన్నిటినిఁ బ్రకాశింపఁజేయునది. ౨ కంటినల్లగ్రుడ్డుపేళ్లు.

* లోచనం నయనం నేత్ర మీక్షణం చక్షు రక్షిణీ,
దృ గ్దృష్టీ చ-

లోచ్యతే అనేనేతి లోచనం. లోచృ దర్శనే-దీనిచేత బడును.౧. నీయతే అనేన నయనం. నేత్రం చ. ణీఞ్ ప్రా త అర్థములు పొందింపఁబడును.౨.౩.ఈక్ష్యతే అనేనేతి ఈక్ష దర్శనే-దీనిచేత చూడఁబడును. ౪. చష్టే వస్తుస్వరూపం వ స. న. చక్షిఙ్ వ్యక్తాయాం వాచి-వస్తుస్వరూపమును చెప్పునది క్ష్ణోతి దూరమిత్యక్షి. అక్షూ వ్యాప్తౌ-దూరముగా వ్యాపించ న. ద్వి. ౬. పశ్యంతి అనయా దృక్. శ.సీ. దృష్టిశ్చ. సీ. దృశి ణే-దీనిచేతఁజూతురు. ౭. ౮ నేత్రములపేళ్లు.

* అశ్రు నేత్రాంబు రోదనం చాస్ర మస్రు చ

అశ్నుతే కపోలం అశ్రు. ఉ. న. అశూ వ్యాప్తౌ-కపోల దు వ్యాపించునది. ౧. నేత్రయో రంబు నేత్రాంబు-కన్నీరు. తేఽనేన రోదనం. రుదిర్ అశ్రువిమోచనే-దీనిచే దుఃఖింతురు. తే అస్రం. అస్రుచ.ఉ.న.అసు క్షేపణే-చేత మీటఁబడునది, ' ప్రావర్తయన్నదీరస్రైర్ద్విషతాం యోషితాం చ సః' అని మందు రుధిరవాచకముతోఁగూడ శ్లేషగాఁ జెప్పుటవలన స ము. 'శమశ్నీలేఽజగరే చాశ్రమశ్రుణి' అని శాంతమున రుద్ర కన్నీరుపేళ్లు.

* అపాఙ్గౌ నేత్రయో రన్తౌ-

నేత్రయోరన్తౌ అపాఙ్గౌ ఇత్యుచ్యేతే - రెండుకన్నుల పాంగము లనంబడును. కడకన్నులు. అఙ్గా న్నాసికాయా అపాఙ్గౌ. అంగమునకంటె అపకృష్టములైనవి. ౧. కడగన్నుల

* కటాక్షోఽపాఙ్గదర్శనే,

అపాంగదర్శనే కటాక్షో వర్తతే-కడకంటిచూపు కట

కటము. కటే నేత్రదేశే అక్ష్ణోతీతి కటాక్షః. అక్షూ వ్యాప్తౌ-కటమనఁ నేత్రములయొక్క వెలుపలిభాగము. దానియందు వ్యాపించునది.౧. కంటిచూపు.

కర్ణ శబ్దగ్రహౌ శ్రోత్రం శ్రుతిః స్త్రీ శ్రవణం శ్రవః. ౯౪

కరోతి శబ్దగ్రహణం కర్ణః. డుకృఞ్ కరణే - శబ్దగ్రహణమును చేయునది. కీర్యతే శబ్దోఽత్రేతి వా కర్ణః. కౄ విక్షేపే-శబ్దము దీనియందు చల్లఁబడును. ౧. గృహ్యతే అనేన గ్రహః. శబ్దస్య గ్రహః. శబ్దగ్రహః. గ్రహ ఉపాదానే-శబ్దము దీనిచేత గ్రహింపఁబడును. ౨. శృణో త్యనేన శ్రోత్రం. శ్రుతిః. సీ. శ్రవణం శ్రవశ్చ. స. న. శ్రు శ్రవణే-దీనిచేత వినఁబడును. కనుక శ్రోత్రము, శ్రుతి, శ్రవణము, శ్రవస్సు.౩. ర. ౫.౬, చెవు లు.

ఉత్తమాఙ్గం శిర శ్శీర్షం మూర్ధా నా మస్తకోఽస్త్రియామ్,

ఉత్తమం చ తత్ అంగం ఉత్తమాంగం-ఉత్తమమైన అంగము. జరయా శీర్యతే శిరః. స. న. శీర్షం చ. శౄ హింసాయాం. జరచేఁ శిథిలపఁబడునది గనుక శిరము, శీర్షము-శిరశ్శబ్దము అకారాంతపుంలిం గము గలదు. ఆలాగే రజశ్శబ్దంబును. 'విచకర్త శిరాం ద్రోణి రథః పాద రజమ్మౌ' అని కందభూషణాలంకారము. ౨.౩. మూర్ఛత్యున్న తమవతి మూర్ధా. న. పు. ముర్ఛా మోహసముచ్ఛ్రాయయోః-ఉన్న తమైనది.౪. మస్యతి కఠినత్వేన పరిణమతి మస్తః. మస్తఏవ మస్తకః. మసీ పరిణామే. కఠినమౌటచేత పరిణమించునది మస్తము; మస్త కము-మస్తకము. ౫. ఉత్తమాంగశబ్దము మొదలు ౫ తలపేళ్లు.

చికురః కున్తలో వాలః కచః కేశ శ్శిరోరుహః. ౯౫

చిన్వన్ వర్ధమానః కుర్యతే ఛిద్యత ఇతి చికురః. చిఞ్ చయనే- ఛేదనే - వృద్ధిఁబొందుచు ఖండింపఁబడునది.౧. దైర్ఘ్యాత్ కున్తా లాతీతి కుంతలః. లా ఆదానే-దైర్ఘ్యముచే కుంతమను నాయు ధమును ధరించునది.౨. వల్యతే వస్త్రేణ వాలః. వల సంవరణే-వస్త్ర ముచేఁ జుట్టఁబడునది. ౩. కచ్యతే కచః. కచ బంధనే-ముడువఁబడునది. ౪. శిరసి శేతే వర్తతే కేశః. శీఙ్ స్వప్నే-శిరస్సున నుండునది. ౫. శిరసి రోహతీతి శిరోరుహః. రుహ బీజజన్మని ప్రాదుర్భావేచ-శిరస్సున

మొలచునది. ౬. తలవెండ్రుకలపేళ్లు.

* తద్బృన్దే కైశికం కైశ్యమ్-

కేశానాం సమూహః కైశికం. కైశ్యం చ. కేశములసము
ము కైశికము. కైశ్యము. ౧. ౨. తలవెండ్రుకలసమూహముపేళ్లు

* అలకా శ్చూర్ణకున్తలాః,

అల్యంతే భూష్యంత ఇత్యలకాః. అ. పు. వ. న. అల భూ
అలంకరింపఁబడునవి. 'అలకా యక్షనగరేఽలకోఽ స్త్రీచూర్ణకు
అని రత్నమాలిక. 'స్వభావవక్రా ణ్యలకాని యోషితాం' అని ప్ర
గంబును.౧. చూర్ణాః కుటిలాః కుంతలాః చూర్ణకుంతలాః. కు
లైన వెండ్రుకలు. 'చూర్ణః క్షోదే చ కుటిలే' అని రభసుఁడు
ముంగురులపేళ్లు.

* తే లలాటే భ్రమరకాః-

తే అలకాః లలాటోపరి పతితా శ్చేత్ భ్రమరకాఇత్యుచ్యం
ఆ కురులు నొసటిమీఁదఁ బడినవైనచో భ్రమరకము లనఁబడును
మ రాకృతిత్వాత్ భ్రమరకాః. తుమ్మెదలవలెనుండునవి. పుష్ప
ములుం గలవు. 'త్రిషు భ్రమరకో భ్రాన్తే న స్త్రీ ఫాలాలకే భ
రభసః.' ౧. నెటికురులు.

* కాకపక్ష శ్శిఖణ్డకః.

కార్ష్ణ్యచాఞ్చల్యాభ్యాం కాకపక్షసాదృశ్యా త్కాకపక్షః.
వుచేతను కదలుటచేతను, కాకిఱెక్కలవలె నుండునది. ౧. శిరసి
త్వేన వర్తమానత్వా చ్ఛిఖండకః. శిరస్సునఁ బిలకగా నుండునది
కూఁకటిపేళ్లు. చిప్పకూఁకటినెఱులు.

* కబరీ కేశవేశః-

కం శిరః వృణోతీతి కబరీ.సీ. వృఞ్ వరణే. శిరస్సును క
దునది. ౧. కేశావిశం త్యస్మిన్నితి కేశవేశః. విశ ప్రవేశనే. కే
దీనియం దుండును. తుఱుముపేళ్లు. కొప్పు.

* అథ ధమ్మిల్ల స్సంయతాః కచాః,

సంయతాః బద్ధాః కేశా ధమ్మిల్లఇత్యుచ్యతే, కట్టఁబడిన
కలు ధమ్మిల్లమనఁబడును. [illegible] మూర్ధ్ని ధః ఊర్ధ్వ

శ్యతే ధమ్మిల్లః. ధిల శ్లేషణే. శిరస్సుయొక్క అధోభాగమందుఁగాని
ర్ధ్వభాగమందుఁ గాని కూడియుండునది. ౧. కీలుగంటు.

శిఖా చూడా కేశపాశీ-

శిరసి శేతే శిఖా. శీఙ్ స్వప్నే. శిరస్సునం దుండునది.౧. చుల్యతే
ఛాద్యత ఇతి చూడా. చుల ఆచ్ఛాదనే. కప్పఁబడునది. ౨. కేశ
. కేశసమూహోఽత్రాస్తీతి కేశపాశీ. ఈ. సీ. కేశసమూహము
. ౩. సిగవేళ్లు.

వ్రతినస్తు జటా సటా. ౯౭

జటతి సంఘీభవతీతి జటా. జట ఝట సంఘాతే. కూడుకొని
యుండునది. ౧. సటతీతి సటా. షట అవయవే. వ్రతమునకు అంగమగు
. ౨. వ్రతియొక్క జడవేళ్లు.

వేణీ ప్రవేణీ-

వేణతీతి వేణీ. ప్రవేణీ చ. అణఁగియుండునది. వేణృ నిశామన
వాదిత్రాదాన గమన జ్ఞాన చిన్తాసు. పా. వేణిః ప్రవేణిః. ౧. ౨. (మగఁ
లేని మగువలు మున్నగువారు) అల్లినజడ.

శీర్షణ్యా శిరస్యా విశదే కచే,

శిరసి భవః శీర్షణ్యః. శిరస్యశ్చ. శిరస్సునందుఁ బుట్టినది శీర్షణ్య
శిరస్యము. ౧. ౨. ఒకటితో నొకటి కూడక గరగరికె (నిర్మలము)
వెండ్రుకలు.

పాశః పక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పరే. ౯౮

కచాత్పరే కచపర్యాయశబ్దాత్పరతః ప్రయుజ్యమానాః పాశా
స్త్రియః కలాపార్థాః స్సమూహవాచకా భవంతి. కచశబ్దపర్యాయ
నశబ్దములమీఁదఁ బ్రయోగింపఁబడినపాశాదిశబ్దములు. ౩. సమూ
వాచకములు. ఉ.— కేశపాశము. కేశపక్షము. కేశహస్తము. పా
ఇతి పాశః. పశ బన్ధే. కట్టఁబడునది. ౧. పక్ష్యతే పరిగృహ్యతే
. పక్ష పరిగ్రహే. పరిగ్రహింపఁబడునది. ౨. శ్లిష్యతే హస్తః.
కొనియుండునది.

తనూరుహం రోమ లోమ-

తన్వాం రోహతీతి తనూరుహం.శరీరమందుఁ బుట్టునది.పా.తను

రుహం. ౧. రోహతీతి రోమ. లోమ చ. న. రుహ బీజజన్మని ర్భావేచ. మొలచునది. రోమము. లోమము. ౨. 3. శరీర బుట్టిన వెండ్రుకలపేళ్లు.

* తద్వృద్ధౌ శ్మశ్రు పుంముఖే,

పుంముఖే తద్వృద్ధౌ రోమవృద్ధౌ శ్మశ్రుశబ్దో వర్తతే. ముఖమందలి యారోమముల వృద్ధియందు శ్మశ్రుశబ్దము వర్తిం శ్మ శబ్దో ముఖవాచీ శ్మని ముఖే శ్రియత ఇతి శ్మశ్రు. ఉ. న. సేవాయాం. ముఖము నాశ్రయించునది. గడ్డమును, మీసము

* ఆకల్ప వేషౌ నైపథ్యం ప్రతికర్మ ప్రసాధనమ్.

ఆ సమంతా త్కల్ప్యతే ఇత్యాకల్పః. అంతట కల్పింపః ౧. వేష్టి తత్తదంగమితి వేషః. విష్లృ వ్యాప్తౌ. ఆయాయంగ వ్యాపించునది. 'వేషోవ్యాప్తౌ విప్రయోగే నైపథ్యే' చేతి మూ తే రుద్రః. శవర్ణోపథముగాఁ గొందఱు చెప్పుదురు. "నైపథ్యే మాత్రే చ వేశో వేశ్యాగృహేఽపిచ" ఇతి తాలవ్యాంతే ౨. నేత్రయోః పథ్యం నైపథ్యం. నేత్రములకు హితమైనది. 3. గతం అంగప్రాప్తం కర్మ. ప్రతికర్మ. న. న. ప్రత్యంగమును డుక్రియ. ర. ప్రసాధ్యతే అలంక్రియతేఽనేనాంగమితి ప్రసాధన సాధ సంసిద్ధౌ. దీనిచేత అంగ మలంకరింపఁబడును. ౫. వస్త్రప దులచేత నైన యొప్పిదముపేళ్లు. ప్రతికర్మ ప్రసాధన శబ్దము పత్త్రిరచనాదులపేళ్లని కొందఱు.

* దశైతే త్రిషు-

ఈముందరఁ జెప్పఁబడు నలంకర్తృశబ్దము మొదలు రో పర్యంతముగల పదిశబ్దములు మూఁడులింగములయందును వర్తిం

* అలంకర్తాలంకరిష్ణుశ్చ-

అలం కరోతీతి అలంకర్తా. ఋ. అలంకరించువాఁడు. ౧. ర్తుం శీలమస్య అలంకరిష్ణుః. ఉ. అలంకరించునట్టిస్వభావము డు. ౨. అలంకరించువాని పేళ్లు.

* మణ్డితః,

ప్రసాధితో ఽలంకృతశ్చ భూషితశ్చ పరిష్కృతః.

మణ్డ్యతేస్మ మణ్డితః. మడి భూషాయాం. అలంకరింపఁబడిన
ఁడు. ౧. ప్రసాధ్యతే స్మ ప్రసాధితః. రాధ సాధ సంసిద్ధౌ. అలంక
ఁబడినవాఁడు. ౨. అలం క్రియతేస్మ అలంకృతః. డు కృఞ్ కరణే.
కరింపఁబడినవాఁడు. ౩. భూష్యతే స్మ భూషితః. భూష అలంకారే.
రింపఁబడినవాఁడు. ౪. పరిష్క్రియతేస్మ పరిష్కృతః. అలంకరింపఁ
వాఁడు. ౫. అలంకరింపఁబడినవాని పేళ్లు.

విభ్రాడ్భ్రాజిష్ణు రోచిష్ణూ-

తాచ్ఛీల్యేన విభ్రాజతే విభ్రాట్. జ. భ్రాజిష్ణుశ్చ. ఉ. రోచతే
ష్ణుః. భ్రాజిర్ దీప్తౌ. రుచ దీప్తౌ. ప్రకాశించుస్వభావము గలవాఁ
౧. ఉ. ౨. ౩. భూషణాదులచేఁ బ్రకాశించువాఁడు

భూషణం స్యా దలంక్రియా,

భూషా భూషణం. అలంకరణ మలంక్రియా. అలంకరించుట భూ
ము. అలంక్రియ. ౧. ౨. అలంకరించుటపేళ్లు.

అలఙ్కార స్త్వాభరణం పరిష్కారో విభూషణమ్. ౧౦౧

మణ్డనం చ-

అలంక్రియతే అనేన అలఙ్కారః. దీనిచేతఅలంకరింపఁబడును. ౧.
మంతాత్ భ్రియతే ఆభరణం. భృఞ్ భరణే. అంతట భరింపఁబడు
౨. పరిష్క్రియతే అనేన పరిష్కారః. డు కృఞ్ కరణే. దీనిచేత అలం
ఁబడును. ౩. విశేషేణ భూష్యతే అనేనేతి విభూషణం. భూష అలం
. దీనిచేత నలంకరింపఁబడును. ౪. మండ్యతే అనేన మండనం. మడి
షాయాం. దీనిచేత నలంకరింపఁబడును. ౫. సొమ్ముల పేళ్లు.

అథ మకుటం కిరీటం పుంనపుంసకమ్,

మంక్యతే అనేన మకుటం. మకి మండనే. దీనిచేత నలంకరింపఁ
ను. పా. ముకుటం. ౧. కీర్యతే లలాటోపరి క్షిప్యత ఇతి కిరీటం. కౄ
క్షేపే. నొసటిమీఁదఁ బెట్టఁబడునది. ౨. కిరీటముపేళ్లు.

చూడామణి శ్శిరోరత్నమ్-

చూడాయాం మణిః చూడామణిః. పు. శిరసి రత్నం శిరో
౦. శిరస్సున నుండురత్నము. ౧. ౨. తలమానికము పేళ్లు.

తరలో హారమధ్యగః. ౧౦౨

హారమధ్యగో విశిష్టమణి స్తరళ ఇత్యుచ్యతే. కంఠమాల
నుండునాయకమణి తరళమనంబడును. ప్రభయా తరతి తమ ఇతి
త్యా ప్లవనతరణయోః. కాంతిచేత అంధకారమును దరించునది
నాయకమణి.

* వాలపాశ్యా పారితథ్యా-

వాలపాశే కేశపాశే సాధ్వీ వాలపాశ్యా. కేశపాశమ
జక్కఁగా నుండునది. కేశపాశస్య పరిత స్సర్వత స్తథాభవతి
పారితథ్యా. కేశపాశమం దంతటఁ బ్రకాశించునది. ౨. కొప్పున
శారార్థమై పెట్టెడిసువర్ణముక్తాది రచితమైనవలయముపేళ్లు.
మొదలైనది.

* పత్త్రపాశ్యా లలాటికా,

పత్రవల్లలాటే పశ్యతే పత్రపాశ్యా. పశ బంధనే. పత్త్ర
నొసటియందుఁ గట్టఁబడునది. ౧. లలాటే భవా లలాటికా.
ఘందుండునది. ౨. నొసటఁ గట్టెడుముత్యపుబాసికముపేళ్లు.
బొట్టు.

* కర్ణికా తాళపత్త్రం స్యాత్ -

కర్ణయోః అలంకారః కర్ణికా. చెవులకు నలంకారమైన
తాళస్య పత్త్రం తాళపత్త్రం. తాటాకు. ౨. చెవులకమ్మలపేళ్లు.

* కుణ్డలం కర్ణవేష్టనమ్.

కుండవద్వృత్తత్వాత్ కుండలం. కుండమువలె వట్రువగా
డునది. ౧. కర్ణౌ వేష్టతే కర్ణవేష్టనం. వేష్ట వేష్టనే. కర్ణమును
ష్టించునది. ౨. స్త్రీపురుషులు పెట్టుకొను కర్ణభూషణము
పోఁగులు.

* గ్రైవేయకం కణ్ఠభూషా-

గ్రీవాయాం భవోఽలంకారో గ్రైవేయకం. పా. గ్రైవే
మెడయం దుండెడు అలంకారము. ౧. కంఠస్య భూషా కంఠభూషా.
ముయొక్కభూషణము. ౨. మెడయందు గుత్తమైన కంటె మొద

* లమ్బనం స్యా ల్లలన్తికా,

లంబతే లంబనం. పా. లంబమానం. లబి అవస్రంసనే.

...వని. ౧. లలతి విలసతి లలంతికా. లల విలాసే. ఒప్పునది. ౨.
...యందు కొంచెము వ్రేలుచున్న పేరులపేళ్లు.

స్వర్ణైః ప్రాలమ్బికా-

స్వర్ణైఃకృతా లలంతికా ప్రాలంబి కేత్యుచ్యతే. బంగారునాణెము
...చేయఁబడినయాహారము ప్రాలంబిక యనంబడును. ప్రకర్షేణ లం
ప్రాలంబికా. మిక్కిలి వ్రేలుచుండునది. ౧. కాసులపేరు, నవర
...ము) లదండ మొదలైనది.

అథోరస్సూత్రికా మౌక్తికైః కృతా. ౧౦౪

సీవ్యతే అనేనముక్తాదికమితి సూత్రికా. షివు తంతు సంతానే.
సూత్రికా ఉరస్సూత్రికా. ముత్యములచేఁ గూర్పఁబడునది గనుక
...త్రిక. ఉరస్సునందలి సూత్రిక ఉరస్సూత్రిక. ౧. ముత్యములచేఁ
...బడినమాలిక.

హారో ముక్తావళీ-

హ్రియతేచిత్తమనేన హారః. హృఞ్ హరణే. దీనిచేత మన
హరింపఁబడును. ౧. ముక్తానాం ఆవళీ ముక్తావళీ. ఈ. సీ. పా. ము
... ఇ. సీ. ముత్యములయొక్క పఙ్క్తి. ౨. ముత్యములదండపేళ్లు.

దేవచ్ఛన్దోఽసౌ శతయష్టికః,

అసౌ హారశ్శతయష్టికశ్శతసరశ్చేద్దేవచ్ఛంద ఇత్యుచ్యతే. ఈ
...మాల నూఱుసరములు గలదైనచో దేవచ్ఛంద మనంబడును.
...యష్టియుతో హారో దేవచ్ఛందో నిగద్యతే' ఇతి వరాహః. లతి
...ండికా యష్టికా సరికా ఇతి సమానార్థాః. నూటయెనిమిది సర
గలదండ యనికొందఱు. దేవా నపి చందయతి ఆహ్లాదయతి
...ఛందః. అ. పు. చది ఆహ్లాదనే. దేవతలను సైతమాహ్లాదపెట్టు
... నూఱుపేటలముత్యాలహారము.

హారభేదా యష్టిభేదా ద్గుచ్ఛగుచ్ఛార్ధగోస్తనాః ౧౦౫
అర్ధహారో మాణవక ఏకావళ్యేకయష్టికా,
సైవ నక్షత్రమాలా స్యాత్సప్తవింశతిమౌక్తికైః. ౧౦౬

యష్టిసంఖ్యాభేదాద్గుచ్ఛాదయోహారభేదా భవంతి. గుచ్ఛశబ్ద

ము మొదలు ౫ ప్ర త్యేకముగా సరములయెన్నికవలన నై నహారకే
పేర్లు. గూయతే సాధుభిరితి గుచ్ఛః. పా. గుత్సః. గు శబ్దే-మంచిదని
బడునది. ముప్పదిరెండు సరములముత్యములదండ. ౧. గుచ్ఛస్యా
ర్ధః. పా. గుత్సార్ధః. గుచ్ఛములో సగము. పదియాఱుసర
త్యాలదండ. ౧. గో స్తనవత్ నాభే రధో వర్తమానత్వాత్ గో
గోస్తనమువలె నాభియొక్క యధోభాగమం దుండునది.
ముల ముత్యాలదండ. ౧. దేవచ్ఛందస్యార్ధత్వాత్ అర్ధహారః. దే
దములో సగమైనహారము. ఏఁబదినాలుగుసరములముత్యాలద
మయాలత్వ్యాద్ నవకః అభినవః మాణవకః. ఒప్పిదముచేత
నది. ఇరువదినాలుగుసరముల ముత్యములదండ. ఏకయష్టికా ఏక
కావలీత్యుచ్యతే. ఒంటిసరముగల హారము ఏకావలియనంబడు
షణానాంమధ్యే ఏకైవ ఆవలతే ఏకావళీ. సీ. వల సంచలనే.
లలో ముఖ్యమై చలించుచుండునది. ౧. " ఏకావళీ నామ
సంఖ్యా హస్తప్రమాణా మణిభిః ప్రయుక్తా, సంయోజితా
నా తు మధ్యే యష్టీతి సా భూషణవిద్భి రుక్తే "తి వరాహః
ఏకావళీ సప్తవింశతిమౌక్తికా చేత్ నక్షత్రమాలేత్యుచ్యతే.
సరపుకంఠమాల యిరువదియేడుముత్యాలుగలదైనచో నక్ష
యనంబడును. నక్షత్రమాలేవ భాతీతి నక్షత్రమాలా. నక్ష
వలెఁ బ్రకాశించునది. "ద్వాత్రింశద్యష్టికో గుచ్ఛస్తదర్ధేనార్ధగు
చత్వారింశత్సరో౽స్త్రీస్యా ద్గోపుచ్ఛో గోస్తనో౽పిచ. అర్ధహా
జ్ఞేయ శ్చతుఃపంచాశతస్సరైః, వింశత్యా యష్టిభి ర్యుక్తో హా
ణవకః స్మృతిః" అని ప్రతాపుఁడు.

* ఆవాపకః పారిహార్యః కటకం వలయో౽స్త్రియామ్,

ఉప్యతే క్షిప్యతే మణిబంధోపరి ఆవాపకః. టు వప్ బీ
నే. ముంజేతియందుఁ బెట్టఁబడునది. పా. ఆవాయకః. ౧.
రం త్యనేనేతి పరిహారో హస్తః. తత్ర భవః పారిహార్యః. పరిహ
గా హస్తము. దానియం దుండునది. " పరిహారః పరిహృతౌ
చ " అని రభసుఁడు. ౨. కట త్యావృణోతి హస్తమితి కట
వర్షావరణయోః. హస్తమును జుట్టియుండునది. ౩. వలతే వల

వల సంవరణే. చుట్టుకొనియుండునది. ౪. కడియము పేళ్లు. ఆవా
పారిహార్యశబ్దములు సూడిగము పేళ్లు. కటకవలయశబ్దములు కడియ
పేళ్లని కొందఱు.

కేయూర మఙ్గదం తుల్యే-

కే భుజశిరసి యాతీతి కేయూరం. యు మిశ్రణే. భుజాగ్రమును
కూడియుండునది. ౧. అంగం దయతే అంగదం. దేఙ్ రక్షణే. అం
ము రక్షించునది. ౨. బాహుపురి పేళ్లు.

అఙ్గులీయక మూర్మికా. ౧౦౭

అంగులీషు భవం అంగులీయకం. వ్రేళ్ళయందుండునది. రూప
మున నపుంసకము. పుంలింగంబును గలదు. "అయం మైథిల్యాభి
౦ కాకుత్స్థస్యాఙ్గులీయకః" అని భట్టిప్రయోగము. ౧. అంగుళీ
ఊర్మివ ద్వర్తతే ఊర్మికా. వ్రేళ్ళమీఁద కరుడువలె నుండునది.
ఉంగరము పేళ్లు.

సాక్షరాఙ్గులిముద్రా సా-

మోదయతీతి ముద్రా. ముద హర్షే. అంగులిసంబంధినీ ము
అంగులిముద్రా. అంగులిసంబంధమైనముద్ర అంగులిముద్ర. ము
విశ్వాసస్థానం తద్యోగ్యాన్యక్షరాణ్యత్ర సంతీతి అంగులిముద్రా
ముద్రయనఁగా విశ్వాసస్థానము. దానికి యోగ్యమైనయక్షరములు
ది. ౧. అక్షరములు చెక్కినముద్దుటుంగరము.

కఙ్కణం కరభూషణమ్,

కమితి క్వణతి కంకణం. క్వణ శబ్దే. మ్రోయునది. హస్తమండన
సూత్రే౨ప్యయం. "కంకణో నా ప్రతిసర" ఇత్యక్షరమాలా. ౧.
యోర్నామ. కరభూషణం. హస్తములభూషణము. ౨. మాక్కి
ములతోఁ గూడిన కడియము పేళ్లు.

స్త్రీకట్యాం మేఖలా కాఞ్చీ సప్తకీ రశనా తథా. ౧౦౮

క్లీబే సారసనం చ-

మీయతే ప్రక్షిప్యతే కట్యామితి మేఖలా. డుమిఞ్ ప్రక్షేపణే.
మొలయందుంచఁబడునది. ఎనిమిదిసరములు గలది. ౧. కచ్యతే బధ్యతే
కాంచీ. నీ. కచ దీప్తిబంధనదేవనేషు. కట్టఁబడునది. ఒంటిసరముగలది.

౧. సపతి సముదైతి కట్యామితి సప్తకీ. సీ. షప సమవాయే. ఏడు
దుఃగూడియుండునది. ఏడుసరములు గలది. ౧. అశ్నోతి కట్
శనా. అశూవ్యాప్తౌ. స్త్రీలయొక్క మొలయందు వ్యాపించునది
రసనా. "క్షుభితసింధురశనైశ్శనైః" అని భారవియందు యను
సకారమధ్యమమునకు "రసనాబంధో రతికలహేషు" అని
దత్తయందు జిహ్వతోఁ గూడ శ్లేషగాఁ జెప్పఁబడియున్నది.
బు సరములుగలది. ౧. సారం సనోతి సారసనం. షణు దానే.
ర్షము నిచ్చునది. ౧. మూఁడుసరములుగలది. "ఏకయష్టిర్భవేత్కా
మేఖలా త్వష్టయష్టికా, రసనాషోడశసరా కలాపః పంచవింశకః
కీ సప్తయష్టిస్స్యాత్ త్రిభి స్సారసనం సరైః" రితి. స్త్రీలయొక్క
విధము లైన మొలనూళ్ల పేళ్లు.

* అథ పుంస్కట్యాం శృఙ్ఖలం త్రిషు,

శృంగైః ప్రధానమణిభిః ఖలతీతి శృంఖలం. త్రి. ఖల స
శృంగములనఁగాఁ బ్రధానమణులు. వానిచే జలించుచుండునది.
షుని మొలనూలు.

* పాదాఙ్గదం తులా కోటి ర్మఞ్జీరో నూపురోఽస్త్రియామ్.
హంసకః పాదకటకః-

పాదే అంగదమివ పాదాంగదం. పాదమందు బాహుప్ర
నుండునది. ౧. తులతి ఆకుటతీతి చ తులాకోటిః. ఇ. పు. తుల ఉన్మానే
కొటిల్యే. అధికమైనతూనికగలిగి వక్రమైయుండునది. ౨. మంజు మం
రం ఈరయతి ధ్వనతీతి మంజీరః. మనోహరముగా మ్రోయునది. ౩. ను
తే నూపురః. అ. ప్న. ణు స్తుతౌ. స్తోత్రముచేయఁబడునది. ౪.
వత్కాయతీతి హంసకః. కై శబ్దే. హంసవలెఁ బలుకునది. 'అస్త్రి
అనుదానికి దీనితోడను సంబంధముగలదు గనుక దీనికి పుల్లింగనపుం
ములు గలవు. 'హంసకం పాదకటకం' అని యమరమాలయందు
నక కాండమునందుఁ జెప్పియున్నాఁడు. ౫. పాదస్య కటకః పాద
పాదముయొక్క కటకము. ౬. అందెపేళ్లు. పాదాంగద తులా
శబ్దములు పెండెరముపేళ్లు. హంసకపాదకటకశబ్దములు కాలి
పేళ్లనికొందఱు.

కింకిణీ క్షుద్రఘణ్టికా,

కించిత్క్వణతి కింకిణీ. సీ. క్వణ శబ్దే. ఇంచుకంత పలుకునది.
క్షుద్రా అల్పా ఘంటా అస్యా ఇతి క్షుద్రఘంటికా. సన్నమైన
...గలది. ౨. చిఱుగంటలకును, గజ్జెలకును పేళ్లు.

...క్ఫల క్రిమి రోమాణి వస్త్రయోనాని-
త్వక్=నార, ఫల=కాయ, క్రిమిః=పురుగు, రోమ=వెండ్రుకలు,
...గును వస్త్రమున కుత్పత్తిస్థానములు.

దశ త్రిషు. ౧౧౦

వాల్కాదీని తన్త్రికాంతాని దశ త్రిషు. వాల్క శబ్దము మొదలు
...శబ్దమువఱకుగల ౧౦ శబ్దములు మూఁడులింగములయందును
...నును.

వాల్కం క్షౌమాది-

క్షుమాయాః అతస్యా వికారః క్షౌమం. క్షుమ యనఁగా నల్ల
... దానియొక్క నారచేతఁ జేయఁబడినది. ఇది మొదలైనది వా
...నఁబడును. వల్కస్య వికారః వాల్కం. వల్కమనఁగా నార. దాని
...జేయఁబడినది. నారచీర.

ఫాలం తు కార్పాసం బాదరం చ తత్,

కార్పాసీఫలతంతునిర్మితం వస్త్రం ఫలవికారత్వా త్ఫాలమిత్యు
... పత్తికాయదూదియొక్క నూలుచేతఁ జేయఁబడినదిగనుక కో...
...కారమవుటవలన ఫాలము. ౧. కార్పాసస్యాః ఫలం కార్పానం. బదరా
... ఫలం బాదరం. ఏతయోర్వికారః కార్పాసం. బాదరంచ. కార్పా
... బాదరము ననఁగా ప్రత్తి. దానిచేతఁ జేయఁబడినచీర కార్పాసము
...రము. ౨. 3. నూలుచీర పేళ్లు.

కౌశేయం క్రిమికోశోత్థమ్-

క్రిమికోశభవతంతునిర్మితం వస్త్రం కౌశేయ మిత్యుచ్యతే. పురు
...చేతఁ గలిగిన బుఱ్ఱలవలనఁ బుట్టినసూలుచేతనైన పట్టుచీర మొదలై
...కౌశేయమనంబడును. కోశనిర్మితత్వా త్కౌశేయం. కోశమనఁగా
...లచేతనైన బుఱ్ఱ. అందువలనఁ బుట్టిననూలుచేతనైన-చీర. ౧.

రాఙ్కవం మృగరోమజమ్. ౧౧౧

రంకాఖ్యమృగరోమవికారః రాంకవం. రంకువనఁగా మె
క్రి. దానిరోమములచేతఁ జేయఁబడినది. ౧. మృగరోమభిః జాతః
రోమజం. మృగరోమములచేతఁ బుట్టునది. ౨. మృగరోమములచే
యఁబడినశాలువ మొదలైనవి.

* అనాహతం నిష్ప్రవాణి త న్త్రకం చ నవామ్బరే,

ఆహతాః క్షాళనభోగచ్ఛేదాః. తద్రహితత్వాత్ అనా
ఉతుకుట, భోగించుట, చించుట ఇవిమూఁడును ఆహతములు. అ
యనాహతము. ౧. నిర్గతా ప్రవాణిః యస్యతత్ నిష్ప్రవాణి
యనఁగా సాలెవానినాడె మొదలైనది. నిర్గతమైన ప్రవాణిగలిగిన
తంత్రాత్ తంతువాయశలాకాదే రచిరా దపహృతం. తంత్రకం
మనఁగా నేసెడివాసికట్టె మొదలైనవి. అందువలన నప్పుడే తేఁ
3. నవం చ తదంబరం చ నవాంబరం. క్రొత్తచీర. 3. క్రొత్తచీరపే

* తత్స్యా దుద్గమనీయం య ద్ధౌతయో ర్వస్త్రయో ర్యుగమ్.
పత్త్రోర్ణం ధౌతకౌశేయం బహుమూల్యం మహాధనమ్,

ధౌతం ప్రక్షాళితం య ద్వస్త్రయుగ్మం తదుద్గమనీయ
చ్యతే. ఉతుకఁబడినవస్త్రములజోడు ఉద్గమనీయమనంబడును.
నార్థం ఉత్తరాసంగార్థం చ ఉద్గమ్యత ఇతి ఉద్గమనీయం. కట్టుకొను
మీఁద వేసికొనుటకు నెత్తఁబడునది. ౧. ధౌతకౌశేయం పత్త్రోర్ణ
చ్యతే. ఉదికినపట్టుచీర పట్టుచీర మొదలయినది పత్త్రోర్ణ మనం
పత్రైః పటాదిభిః ఊర్ణూయత ఇతి పత్త్రోర్ణం. ఊర్ణుఞ్ ఆచ్ఛాదనే
లు మొదలయినదానిచేఁ గప్పఁబడునది. ౧. బహుమూల్యం వస్త్ర
మహాధన మిత్యుచ్యతే. గొప్పవెలగలచీర మహాధనమనంబడును.
డ్డవెలగల వస్తువులును. ౧. మహాధన మత్రాస్తి మహాధనం, అధి
ధనము గలిగినది. "పురాధిరూఢశ్శయనం మహాధన" మితిభారవిః

* క్షౌమం దుకూలం స్యాత్ -

క్షూయతే శోభనమితి క్షౌమం. టు క్షు, శబ్దే. శుద్ధత్వా
మంచిదని పలుకఁబడునది. పా. క్షోమం. "క్షోమపట్టే దుకూలే
ఇతి మేదినీ. ౧. ప్రావారోత్తరాసంగరూపేణ ద్విధా కూల్యత ఇతి
లం. కూల ఆవరణే. కట్టుకొనుటకును మీఁద వేసికొనుటకును

గా గప్పఁబడునది. ౨. వెలిపట్టుచీర పేళ్లు. తెల్లనివలువయును.

వేతు నివీతం ప్రావృతం త్రిషు. ౧౧౩

నివీయత ఇతి నివీతం. త్రి. వ్యేఞ్ సంవరణే. ప్రావ్రియత ఇతి.
తం. త్రి. వృఞ్ ఆచ్ఛాదనే. కప్పుకొనఁబడునది. నివీతము ప్రావృ
ము. ౧. ౨. కప్పుకొనుకోక పేళ్లు.

స్త్రియాం బహుత్వే వస్త్రస్య దశా స్స్యు ర్వస్త్రయో ర్ద్వయోః;
దంశ్యంతే కంటకాదిభి రితి-దశాః. ముండ్లు మొదలైనవానిచేఁ
బడునది. స్త్రీలింగనిత్యబహువచనము. పుల్లింగ బహువచనంబును
"దశావర్తావవస్థాయాం వస్త్రాంతే భూమ్ని పుం స్త్రియోః" అని
ము. ౧. వస్యంతే శిష్టైరితి వస్తయః. ఇ. పు. వస ఆచ్ఛాదనే. బద్దె
కూడినకోక. కట్టయోగ్యముగనుక శిష్టులైనవారిచేత ధరింపఁబడు
నికి వచననియమము లేదు. ౨. వస్త్రములయొక్క కొనపేళ్లు. బద్దె.

ర్ఘ్యమాయామ ఆరోహః-

దీర్ఘస్య భావో దైర్ఘ్యం. దీర్ఘవస్తువుయొక్క భావము దైర్ఘ్యము.
యమ్యతే హస్తాదినా ఆయామః. యమ ఉపరమే. హస్తాదులచేత
ంపఁబడునది. ౧. ఆరుహ్యత ఇత్యారోహః. పొందఁబడునది.
నహ్యతేఽనేనేత్యానాహః. ణహ బంధనే. దీనిచేత బంధింపఁ
3. నిడుపుపేళ్లు.

పరిణాహో విశాలతా, ౧౧౪

పరితః నహ్యతే పరిణాహః. ణహ బంధనే. అంతట బంధింపఁబడు
. విశాలస్య భావః విశాలతా. విశాలముయొక్క భావము. ౨.
పుపేళ్లు.

చ్చరం జీర్ణవస్త్రమ్-

పటదితిచరతిస్ఫుటతీతి పటచ్చరం. పట్టనిచినుఁగునది. పూర్వంపట
పటచ్చరం. పూర్వము మంచికోకయై యుండినది. ౧. జీర్ణంచతత్
వజీర్ణవస్త్రం.చినిఁగినకోక. ౨. చినిఁగినచీరపేళ్లు. పాతవస్త్రము.

సమౌ నక్తక కర్పటౌ,

లజ్జతే లజ్జతే నక్తకః. ణజ వ్రీడే. మంచికోకలలో సిగ్గుపడునది.౧.
కల్పతే కర్పటః. కృపూ సామర్థ్యే. లజ్జకొఱకు సమర్థమైనది.

౨. "పటోఽ స్త్రీ కర్పటశ్శాటః సిచయః పోతన క్తకా" అని
డు. ఆపక్షమందు "నమూ న క్తక కర్పటా" అనుచోట సమశబ్ద
లింగవాచకము. చెమట మొదలైనది తుడుచుకొను చేలితుండుగు
జీర్ణమై మాసిన చెడుపేలిక యని కొందఱు. తడిని తుడుచు గు
కొందఱు.

* వ(స్త్ర) మాచ్ఛాదనం వాస శ్చేలం వసన మంశుకమ్.

వస్యతే అనేనాంగమితి వస్త్రం. వాసః.స.న. వసనం చ. వ
దనే.దీనిచేత అంగము కప్పఁబడును గనుక వస్త్రము,వాసస్సు,
౧. ౨. ౩, ఆచ్ఛాద్యతే అనేన ఆచ్ఛాదనం. ఛద అపవారణే
చేత కప్పఁబడును. ౪. చిల్యతే చేలం. చిల వసనే. కట్టుకొనఁ
౫. అంశుభి స్తంతుభిః కాయతి అంశుకం. కై శబ్దే. తంతువుల
చుకంత పలుకునది. ౬. కోకపేళ్లు. న క్తకాదిశబ్దములు ౮ కో
కొందఱు.

* సుచేలకః పటోఽ స్త్రీ స్యాత్ -

శోభనశ్చాసౌ చేలకశ్చ సుచేలకః. మంచివలువ. ౧.
వాయునా పటః. అ. ప్న. పట గతౌ. వాయువుచేత కదలున
యతి దేహం పటః. పట వట గ్రంథే. గ్రంథో వేష్టనం. దేహ
గప్పునది. ౨. మంచికోకపేళ్లు.

* వరాశిః స్థూలశాటకః,

వరం శ్రేష్ఠం వరణం వా అశ్నుతే వరాశిః. శ్రేష్ఠముని
నది. లేక వారిచేఁ గోరఁబడునది. పా. వరాసిః. "వరాసిరు త్త
వరాసిః స్థూలశాటక" ఇతి రత్నకోశః. ౧. స్థూలశ్చాసౌ శా
స్థూలశాటకః. ముదు గైనకోక. ౨. ముదుగుకోకపేళ్లు,

* నిచోళః ప్రచ్ఛదపటః-

నితరాం చుల్యతే ఆచ్ఛాద్యతే శయ్యాదికం నిచోళః.
పఱుపు మొదలైనవి కప్పఁబడును. ౧. ప్రచ్ఛాద్యతేఽనేనేతి ప్ర
సచాసౌ పటశ్చ ప్రచ్ఛదపటః. దీనిచేత కప్పఁబడును. ౨. పఱ
పేళ్లు. గవిసెన.

* నమూ రల్లక కమ్బళౌ.

రమంతే అస్మిన్నితి రల్లకః. రము క్రీడాయాం. దీనియందు క్రీ
డ. ౧. కామ్యతే శీతార్తైభిరితి కంబళః. కము కాంతౌ. చలిగల
చే కోరఁబడునది. ౨. కంబళి పేళ్లు.

స్త్రీ యోపసంవ్యాన పరిధానా న్యధోఽంశుకే,

నాభే రంతరే భవం అంతరీయం. నాభియొక్కయు పిక్కయొక్క
నడుమనుండునది. ౧. ఉపసంవీయతే అనేనేతి ఉపసంవ్యానం. వ్యే
సంవరణే. చుట్టఁబడునది. ౨. పరిధీయతే అనేనేతి పరిధానం. డు
ధారణపోషణయోః. ధరింపఁబడునది. 3. అధస్థితం అంశుకం
శుకం. క్రిందనుండుకోక. కట్టుచీర పేళ్లు.

ద్వౌ ప్రావారో త్తరాసఙ్గౌ సమౌ బృహతికా తథా. ౧౧౭
సంవ్యాన ముత్తరీయం చ-

ప్రవ్రియతే అనేనేతి ప్రావారః. వృఞ్ వరణే. దీనిచేత మిక్కిలి
బడును. ౧. ఉత్తరే ఊర్ధ్వాంగే ఆసజ్యత ఇతి ఉత్తరాసంగః. ష
గే. మీఁది యవయవమందు పొందఁబడునది. ౨. బర్హతీతి బృ
. బృహ వృద్ధౌ. వృద్ధిఁబొందునది. 3. సంవీయతే అనేనేతి సం
. వ్యేఞ్ సంవరణే. దీనిచేత కప్పఁబడును. ౪. ఉత్తరాంగే భ
త్తరీయం. ఊర్ధ్వాంగమునందుండునది. ౫. ఉత్తరీయము పేళ్లు.

చోళః కూర్పాసకోఽస్త్రియామ్,

చుల్యతే అనేన చోళః. చుల ఆచ్ఛాదనే. దీనిచేత దేహము
బడును. ౧. కూర్పరే కఫోణౌ అస్యతే కూర్పాసకః. అ. పుం. అ
పణే. మోఁచేతియందు పెట్టఁబడునది. ౨. స్త్రీపురుషుల కుబు
రవిక, చొక్కాయ. స్త్రీలయొక్క రవికెకు పేళ్లని కొందఱు.
మొదలు పాదములదాఁక వేసికొను చొక్కాయని కొందఱు.

నీశారస్స్యా త్ప్రావరణే హిమానిలనివారణే. ౧౧౮

హిమానిలనివారణే శీతవాయునివారకే ప్రావరణే నీశారశబ్దో
. మంచును గాలిని నివారించునట్టి చీర మొదలయినది నిశార
బడును. నిశీర్యతే శీతాదిక మనేనేతి నిశారః. శౄ హింసాయాం.
మొదలయినవి దీనిచేత పోఁగొట్టఁబడును. పచ్చడము. దుప్పటి.

అర్ధోరుకం వర స్త్రీణాం స్యా చ్చణ్డాతక మంశుకమ్,

వరస్త్రీణా మర్ధోరుకం ఊర్వోర్గర్ధాచ్ఛాదకం అంశుః
తక మిత్యుచ్యతే. వారవనితలయొక్క కాడలను సగము గప్పు
కోక చండాతక మనఁబడును. చల్లడము. చండం గుహ్యస్థా
చండాతకం. అత సాతత్యగమనే. గుహ్యస్థానము నెల్లప్పు
యుండునది. పుంలింగంబును గలదు. "అర్ధోరుకం వరస్త్రీ
శ్చండాతకః పుమాన్" అని యమరమాలః ౧.

* స్యాత్త్రిష్వాప్రపదీనం త త్ప్రాప్నోత్యాప్రపదం హి యత్

యద్వస్త్రం స్త్రీణాం ఆప్రపదం పాదాగ్రపర్యంతం వ్యా
తత్ ఆప్రపదీన మిత్యుచ్యతే. ఏకోక వనితలయొక్క మీఁగా
బడునో ఆకోక ఆప్రపదీన మనంబడును. పావడమొదలైనది.
ఆప్రపదం ప్రాప్నోతీ త్యాప్రపదీనం. త్రి. కాళ్లకొనదనుక
నది. ౧.

* అస్త్రీ వితాన ముల్లోచః.

ఊర్ధ్వదేశే వితన్యతే వితానం. అ. న్న. తను విస్తారే
దిప్రదేశమందు విస్తరింపఁబడునది. ౧. ఉపరి లోచ్యతే ఉల్లోచః
దర్శనే. మీఁదఁ గానఁబడునది. ఉల్లాభమని కొంద అందు
మేలుకట్టు పేల్లు. చందువ.

* దూష్యాద్యం వస్త్రవేశ్మని,

వస్త్రవేశ్మని దూష్యాద్యం వర్తతే. ఆద్యశబ్దేన పటః
గృహ్యంతే. దూష్యాదులయిన శబ్దములు గుడారమందు వ
దూష్యతే స్వతో బహిర్దేశోఽనేనేతి దూష్యం. దుష వైకృ
కంటె వెలుపలిప్రదేశము దీనిచేత దూషింపఁబడును. ఆద్యశ
పటకుటీరాది శబ్దములు చెప్పఁబడును. "స్థూలం పటగృహం
పటవాపటకుట్యపి, త్రిషు దూష్యం దూషణీయే క్లీబే వస్త్ర
తర" ఇతి రుద్రః.

* ప్రతిసీరా యవనికా స్యా త్తిరస్కరిణీ చ సా.

ప్రతిసీయతే ప్రతిబధ్యత ఇతి ప్రతిసీరా. షిఞ్ బంధనే.
గాఁ గట్టఁబడునది. ౧. యువంత్యత్ర జనా ఇతి యవనికా.
జే. జనులు దీనియందు కూడుదురు. స్త్రీ. జవనికా. ౨.

…ప్నవయతీతి తిరస్కరణీ. ఈ. సీ. కప్పునది. 3. తెరచీర పేళ్లు.

…పరిక్ర్మాఙ్గసంస్కారః-

మాలిన్యపరిమార్జనార్థం కర్మ పరికర్మ. న. న. మాలిన్యమును …గొట్టునట్టి క్రియ. ౧. అంగాని సంస్క్రియంతే అనేనేతి అంగసం…ం. దీనిచేత అంగములు లెస్సగాఁ జేయఁబడును. ౨. దేహమం…ముఱికిని బోఁగొట్టుట పేళ్లు.

స్యా న్మార్ష్టి ర్మార్జనా మృజా,

మృజ్యతే అనయా మార్ష్టిః. ఇం. సీ. మార్జనా. మృజా చ. మృ… శుద్ధౌ. దీనిచేత శుద్ధిచేయఁబడును. ౧. ౨. 3. చందనకుంకుమా…చేత దేహమునందలి ముఱికిని బోఁగొట్టుట పేళ్లు.

ఉద్వర్తనోత్సాదనే ద్వే సమే-

ఉద్వర్త్యతే అనేనాంగమితి ఉద్వర్తనం. వృతు వర్తనే. దీనిచేత …ము తోమఁబడును. ౧. ఉత్సాద్యతే అనేన శరీరమాలిన్యమితి ఉ…దనం. షద్ౢ విశరణగత్యవసాదనేషు. దీనిచేత శరీరమలము పోఁ…ఁబడును. ౨. నలుఁగు పేళ్లు.

ఆప్లావ ఆప్లవః. ౧౨౧

స్నానమ్-

ఆప్లవతి శరీరమల మనేనేతి ఆప్లావః, ఆప్లవశ్చ. ప్లుఙ్ గతౌ. శరీ…మలము దీనిచేతఁ బోవును. ౧. ౨. స్నాత్యనేన స్నానం. ష్ణా శౌచే. …చేత శుచియగును. 3. స్నానము పేళ్లు.

చర్చా తు చర్చిక్యం స్థాసకః-

చర్చనం చర్చా. చర్చ అధ్యయనే. పూయుట. ౧. చర్చికా…ం సాధు చర్చిక్యం. పూయుటయందు మంచిది. పా. చార్చిక్యం. …శరీరాదౌ తిష్ఠతీతి స్థాసకః. ష్ఠా గతినివృత్తౌ. శరీరాదులయం దుం…నది. 3. కుంకుమ మొదలగువానిపూఁత.

అథ ప్రబోధనమ్,

అనుబోధః-

ప్రబోధ్యతే కుంకుమాదిగంధోఽనేనేతి ప్రబోధనం. అనుబుధ్య…

తే అనేనేత్యనుబోధః. బుధ అవగమనే. దీనిచేతఁ గుంకుమాదుల
తెలుఁగఁబడును. ౧. ౨. సుగంధ ద్రవ్యములయందు నణఁగియు
మళమును బ్రకాశింపఁజేయు తైలాదిద్రవ్యముపేళ్లు.

* పత్త్రరేఖా పత్త్రాఙ్గుళి రిమే సమే. ౧

పత్త్రాకారా రేఖా పత్త్రరేఖా. పత్త్రరూపమైన రేఖ. ౧.
ద్యాకృతిలేఖనే అంగుళ్యాకృతిరపి కపోలాదా భవతీతి పత్త్రాంగుళిః
సీ. పత్త్రాదిరూపమును వ్రాయునపుడు కపోలాదులయందు వ్రేళ్ల
ము గలుగును గనుక పత్త్రాంగుళి. పా. పత్త్రాకారేణ వలతే
వళిః. వల సంవరణే. పత్త్రరూపముగా వ్యాపించియుండునది. స్త్రీ
దులందు కస్తూరికాదులచే వ్రాయఁబడుమకరికాపత్త్రాదుల పేళ్లు.

* తమాలపత్త్ర తిలక చిత్రకాణి విశేషకమ్.
ద్వితీయం చ తురీయం చ న స్త్రియామ్-

తమాలపత్త్రాకృతిత్వాత్ తమాలపత్త్రం. తమాలపత్త్రమ
నుండునది. ౧. తిలతి స్నిహ్యతీతి తిలకం. తిల స్నేహనే. మెఱుఁగై
డునది. ౨. చిత్రయతి చిత్రకం. చిత్రమైయుండునది. 3. విశినష్టి
నా విశేషకం. శిష్ఌ విశేషణే. ఒప్పిదములోఁగూడియుండునది.
ద్వితీయమనఁగా తిలకశబ్దము. తురీయమనఁగా విశేషకశబ్దము.
డును స్త్రీలింగమందు లేవు. పుం నపుంసకములయందుఁ గలవనుట.
నటిబొట్టుపేళ్లు.

* అథ కుఙ్కుమమ్. ౧

కాశ్మీరజ న్మాగ్నిశిఖం వరం బాహ్లీక పీతనమ్.
రక్తం సంకోచపిశునం ధీర లోహిత చన్దనమ్. ౧

కుష్కదశాయాం కుమితి కూయతే కుంకుమం. కు శబ్దే.
నప్పుడు కుమని పలుకునది. ౧. కాశ్మీరే జన్మాస్య కాశ్మీరజన్మ.
కాశ్మీరదేశమందుఁ బుట్టినది. ౨. అగ్నిరివ పింగళవర్ణాః శిఖాః కేస
అస్యేతి అగ్నిశిఖం. అగ్నివంటివర్ణము గలయాకరులుగలది. 3.
తే జనై రితి వరం. వృఞ్ సంభక్తౌ. జనులచేత ఆశ్రయింపఁబడునది.
బాహ్లీకదేశేభవత్వాత్ బాహ్లీకం. బాహ్లీకదేశమందుఁ బుట్టు
దీర్ఘమధ్యమని కొందఱు. ౫. పీతయతి వంధనాదికం పీతనం. చం

...ప్పగాఁజేయునది. ౬. రక్తవర్ణత్వాత్ రక్తం. ఎఱ్ఱనివన్నెగలది.
...స్నే సంకోచం పిశతి సూచయతి సంకోచపిశునం. తనయొక్కఅణఁ
...మూపించునది. సంకోచము. పిశునము. అని రెండుపేళ్లుగాఁ
...కుఁజెప్పుదురు. 'బాహ్లికం పీతనం కాంతం పిశునం రుధిరాహ్వ
... కాశ్మీరం చ గుడం రక్తం తథా కాలేయకం చ తత్' అని
...ఁడు. ౮. దధాతి ధీయతే వా ధీరం. ధరించునది. లేక ధరింపఁబడు
... ధాఞ్ ధారణాదౌ. ౯. లోహితవర్ణత్వాత్ లోహితం. ఎఱ్ఱ
...నెగలది. ౧౦. చందయత్యాహ్లాదయతీతి చందనం. చది ఆహ్లాద
...సంతోషమును జేయునది. ౧౧. లోహితచందనమని యొక్కపేరు
...కొందఱు. కుంకుమపువ్వుపేళ్లు.

లాక్షా రాక్షా జతు క్లీబే యావోఽలక్తో ద్రుమామయః,

లక్ష్యతే లాక్షా. లక్ష దర్శనాంకనయోః. కానఁబడియుండునది.
...క్షతి వ్రణీన మితి రాక్షా. రక్ష పాలనే. వ్రణము గలిగినవాని
...మునది. పా. రక్షా. 'రక్షా రక్షణలాక్షయోః' అని నానార్థము.
...జాయతే వృక్షే జతు. ఉ, న. జనీప్రాదుర్భావే. వృక్షములయందుఁ
...నది. 3. యాతి వస్త్రాదినా. యావః. యు మిశ్రణే. వస్త్రాదులతోఁ
...నది. ౪. అలతి పాదాదికం అలః. అనక్తి వస్త్రాదిక అక్తః. అల
...వక్తశ్చ అలక్తః. అల భూషణాదౌ. అంజూ వ్యక్తిశ్లేష్ణకాంతిగ
...పాదాదుల నలంకరించునది గనుకను, వస్త్రాదులఁ బ్రకాశింపఁజేయు
...గనుకను అలక్తము. ౫. నిర్యాసత్వాత్ ద్రుమాణాం ఆమయః ద్రు
...మయః. వృక్షములయొక్కబంక. ౬. లక్కపేళ్లు.

లవఙ్గం దేవకుసుమం శ్రీసంజ్ఞమ్-

లూయతే ఛిద్యతే లవంగః. లూఞ్ ఛేదనే. కోయఁబడున
... దేవానాం ప్రియం కుసుమం. దేవకుసుమం. దేవతలకుఁ బ్రియ
...సుమము. ౨. శ్రియ స్సంజ్ఞా అస్య శ్రీసంజ్ఞం శ్రీమహాలక్ష్మిపేళ్లు
... 3. కరాంబువుపేళ్లు. లవంగము.

అథ జాయకమ్. ౧౨౫

కాలేయకం చ కాలానుసార్యం చ-

జయతి గన్ధాన్తరమితి జాయకం. ఇతరవాసనలను జయించునది.

పా. జాప (ష) కం. ౧. కాలవర్ణ సారత్వాత్కాలేయకం. నల్లవన్నె గలది. ౨. పా. కాలీయకం. కాలవర్ణేనానుసార్యం కాలానుసార్యం. నల్లనివన్నెచేత ననుసరింపఁదగినది. 3. పచ్చవంటిగంధము పేళ్లు. గంధద్రవ్యమని కొందఱు.

* అథ సమార్థకమ్,

వంశ కాగురు రాజార్హ లోహ క్రిమిజ జోఙ్గకమ్. ౧

వన్యతే యాచ్యతే వంశకం. వసు యాచనే. ప్రార్థింపఁబడు... వశ్యతే కామ్యత ఇతి వా వంశకం. వశ కాంతౌ. కామింపఁబడునది వంశికం. ౧. న గురు అగురు. చులకనై యుండునది. పుంలింగము గలదు. 'శీతకృత్తేఽగురోర్మదః' ఇతి ప్రయోగః. ౨. రాజ్ఞాం అర్హః జార్హం. రాజులకు యోగ్యమైనది. 3. దృఢసారత్వాత్ లోహం. ... మైనచేవగలది. లోహవర్ణత్వాల్లోహం. లోహమువలె నుండునది. క్రిమిభి ర్జన్యతే క్రిమిజం. జము అదనే. క్రిములచేఁ దినఁబడునది. జోంగకాఖ్యగిరిభవం జోంగకం. జోంగక మనెడుపర్వతమందుఁ ... నది. ౬. వంశకశబ్దము మొదలు ఈశబ్దపర్యంతము సమాహా... ద్వము. అన్నియు నపుంసకములు. అగురుపేళ్లు.

* కాలాగు ర్వగురుః-

కాలం చ తత్ అగురు చ కాలాగురు. ఉ. న. నల్లని అ... పు. ౧. కాలాగుర్వేవ అగురు. ఉ. పు. ఆ కాలాగురువే అగు... ౨. నల్లని యగురుపేళ్లు.

స్యా త్తన్మంగళ్యం మల్లిగన్ధి యత్,

యత్ కాలాగురుమల్లికాగంధి తన్మంగళ్యమిత్యుచ్యతే. ఏ... గురువు మల్లెపువ్వులపరిమళముగలిగియుండునో అది మంగళ్యమన... ను. మంగళే సాధు మంగళ్యం. న. ప. సీ. శుభమందు మంచిది. మల్లె... పులవాసన గల కృష్ణాగురు.

* యక్షధూప స్సర్జరసోఽరాళ సర్వరసావపి. ౧

బహురూపోఽపి-

యక్షప్రియో ధూపః యక్షధూపః. యక్షులకుఁ బ్రియమైన ధూపము. ౧. సర్వవృక్షస్య రసః సర్జరసః. సర్జమను వృక్షము...

౨. అర్యతే ప్రీత్యా అరాళః. ఋ గతౌ. ప్రీతితోఁ గూడియుం
పా. రాతి ప్రీతిం రాళః. ప్రీతి నిచ్చునది. ౩. సర్వో రసో
త్ర సర్వరసః. రసమనఁగాఁ బరిమళము. సర్వమైనపరిమళము
౪. బహువిధం రూపం స్వభావోఽస్య బహురూపః. బహువి
రూపము గలది. ౫. సజ్జరసము పేళ్లు.

అథ వృకధూప కృత్రిమధూపకౌ,

వృణోతి విశ్వమితి వృకస్సూర్యః తత్ప్రియో ధూపః వృకధూ
శ్వమును వ్యాపించువాఁడు గనుక వృకుఁ డనఁగా సూర్యుఁడు,
కుఁ బ్రియమైన ధూపము. ౧. కరణేన నిర్వృత్తః కృత్రిమః స
ధూపశ్చ కృత్రిమధూపకః. పాకాదిక్రియలవలన నైన ధూప
౨. అనేకపరిమళవస్తువులఁ గూర్చిచేయఁబడిన ధూపద్రవ్యముపేళ్లు.

తురుష్కః పిణ్డక స్సిల్హో యావనోఽపి-

తురుష్కదేశే భవః తురుష్కః. తురుష్కదేశమందుఁ బుట్టిన
. పిండాకారత్వాత్పిండకః. ముద్దగా నుండునది. ౨. సిల్యతే ఉ
తే సిల్హః. షిల ఉంఛే. ఉంఛ ఉచ్ఛయనం. అందుగుమ్మౌఁకు
గూర్పఁబడునది. ౩. యవనదేశే భవః యావనః. తురుష్కదే
దుఁ బుట్టినది. తురుష్కదేశమందుఁ బుట్టినయందుగుబంకతోఁ
ధూపద్రవ్యము పేళ్లు.

అథ పాయసః. ౧౨౭

శ్రీవాసో వృకధూపోఽపి శ్రీవేష్ట సరళద్రవౌ,

సరళదేవదారు పయోవికారా త్పాయసః. సరళదేవదారువుల
పాలవలనఁ బుట్టినది. ౧. సౌభాగ్యహేతుత్వేన శ్రియః వాసః
సః. సౌభాగ్యకారణ మగుటచేత లక్ష్మికి స్థానమైనది. ౨. వృ
తో ధూపః వృక్షధూపః. వృక్షమువలనఁ బుట్టినధూపము. ౩.
వేష్ట్యతే శ్రీవేష్టః. వేష్ట వేష్టనే. శ్రీమహాలక్ష్మిచేత చుట్టఁబడు
౪. సరళవృక్షస్య ద్రవో నిర్యాసః సరళద్రవః. సరళవృక్షముయొ
క. ౫. దేవదారుబంకతోఁజేసిన ధూపద్రవ్యముపేళ్లు.

మృగనాభి ర్మృగమదః కస్తూరీ చ-

మృగనాభిభవత్వా న్మృగనాభిః. ఇ. పు. మృగముయొక్క నాభి

వలనఁ బుట్టునది. "ముఖ్యరాట్ క్షత్రయోః పుంసి నాభిః స్త్రీ
గ కేద్వయోః" అను త్రికాండశేషవచనమువలన స్త్రీలింగంబు
లదు. ౨. మృగస్య మదో మృగమదః. మృగముయొక్క మద
కే స్త్రాయతే కస్తూరీ. సీ. ష్టుఞ్ స్తుతౌ. శిరస్సునందు స్తో
చేయఁబడునది. 3. కస్తూరిపేళ్లు.

* అథ కోలకమ్.

కక్కోలకం కోశఫలమ్-

కోలం బదరీఫలం. తత్సదృశత్వా త్కోలకం. కోల
రేఁగుపండు. అట్టియాకారము గలది. ౧. కక స్తైఽత్రేఽతి కక్కో
దీనియందు దాశతోనుందురు. కక లౌల్యే. పా. కర్కోలకం. తక్కో
గింజను బుట్టియుండునది. ౨. కోశే శింబ్యాం ఫలాని బీజా న్యస్య
ఫలం. కోశమనఁగా విత్తులకు ఆధారము. అందు విత్తులు గల
తక్కోలపుచెట్టుపేళ్లు. దానిఫలమని కొందఱు.

* అథ కర్పూర మస్త్రియామ్,

ఘనసార శ్చన్ద్రసంజ్ఞ స్సితాభ్రో హిమవాలుకా.

కల్పతే సుఖాయ కర్పూరం. అ. న్న. కృపూ సామర్థ్యే. సు
కలుగచేయుటకొఱకు సమర్థమైనది. శీతలత్వేన ఘనతుల్యసా
ద్ఘనసారః. శీతలమౌటచేత ఘనమువంటిసారముగలది. ౨. ఆహ్లా
త్వేన చంద్రస్య సంజ్ఞా యస్య సః చంద్రసంజ్ఞః, ఆహ్లాదకర మౌ
చంద్రునియొక్క పేళ్లు తనకు పేళ్లుగాఁగలది. 3. సితాభ్రసదృశత్వా
తాభ్రః. తెల్లనిమేఘమువలె నుండునది. పా. సితాభ్రః. ర. వాలుకా
శత్వాద్వాలుకా. హిమా చ సా వాలుకా చ హిమవాలుకా. మం
లెఁ జల్లనై యిసుకవంటి యాకారముగలది. ౫. కర్పూరముపేళ్లు.

* గన్ధసారో మలయజో భద్రశ్రీ శ్చన్దనోఽస్త్రియామ్.

గంధేన సారః గంధసారః. పరిమళముచేత నుత్కృష్టమైనది.
మలయశైలే జాతః మలయజః. జనీ ప్రాదుర్భావే. మలయపర్వ
నందుఁ బుట్టినది. ౨. భద్రా శ్రీ శ్శోభాఽస్య భద్రశ్రీః. ఈ. పు
స్వరూపమైనయొప్పిదము గలది. 3. చందయతీతి చందనః. న్న.
ఆహ్లాదనే. ఆహ్లాదమును జేయునది. ర. చందనముపేళ్లు.

తైలపర్ణిక గోశీర్షే హరిచన్దన మస్త్రియామ్. ౧౩౧

మలయైకదేశే తైలపర్ణాఖ్యగిరౌ భవం తైలపర్ణికం. మలయమున ...న మైనతైలపర్ణమను పర్వతమందుఁ బుట్టినది. మిక్కిలిచల్లనైన ...దనము. ౧. గోశీర్షాకారే మలయశృంగేభవం గోశీర్షం. గోవుశిర ...తె మలయశృంగమందుఁబుట్టినది. మిక్కిలి వాసనగల చందనము. ...వర్ణం చందనం హరిచందనం. ఆ. న్న. కపిలవర్ణము గలచందనము. ...మందువాసన గల పసుపుపన్నె గలచందనము. ఈ 3 ను పసపు ...గల శ్రీగంధము పేళ్ళని కొందఱు.

...లపర్ణీతు పత్త్రాఙ్గం రఞ్జనం రక్తచన్దనమ్,
...చందనం చ-

తిలస్యేవ పర్ణాన్యస్యా స్తిలపర్ణీ. ఈ. సీ. నకారాంతపుల్లింగమని ...ము. నువ్వులవంటి యాకులుగలది. ౧. పత్త్రే మకరికాపత్త్రే అంగతి ...గం. మకరికాపత్త్రాదులను బొందునది. ౨. రంజయతీతి రం ...రంజ రాగే. రక్తిమను జేయునది. 3. రక్తంచ తచ్చందనంచ రక్త ...ం. ఎఱ్ఱనిచందనము. ౪. నిర్గంధత్వేన కుత్సితం చందనం కుచం ...నిర్గంధమౌటచేత కుత్సితమైనచందనము. కౌ భువి జాతం చం ...వా కుచందనమ్. భూమియందుఁ బుట్టినచందనము. ౫. ఎఱ్ఱని ...ము పేళ్లు.

అథ జాతీకోశ జాజీఫలే సమే. ౧౩౨

జాత్యాః లతావిశేషస్య కోశం జాతీకోశం. జాత్యాః ఫలం ...ం. జాతీలతయొక్క ఫలము ౧. ౨. జాజికాయపేళ్లు.

...ర్పూ రాగరు కస్తూరీ తక్కోలై ర్యక్షకర్దమః,

కర్పూరాగరుకస్తూరీ తక్కోలైః కృతః యక్షకర్దమ ఇత్యుచ్యతే. ...రము, అగరువు, కస్తూరి, తక్కోలము, వీనితోడఁగూడిన గంధ ...రుక్షకర్దమమనంబడును. యక్షప్రియత్వా దార్ద్రత్వేన కర్దమతు ...ల్యచ్చ యక్షకర్దమః. యక్షప్రియమై ఆర్ద్రత్వముచేత పంకతుల్య ...బడునది. "కర్పూ రాగరు కస్తూరీ తక్కోల ఘుసృణాని చ, ...మిదం సర్వం యక్షకర్దమ ఉచ్యతే."

...గాత్రానులేపనీ వర్తిః-

గాత్రమనులిప్యతే అనయా గాత్రానులేపనీ. ఈ.సీ. లి
హే. దీనిచేత పూయఁబడును. ౧. వ ర్త్య తేఽల్ల క్ష్ణీక్రియతే శరీర
వ ర్తిః. ఇ.సీ. వృతు వ ర్తనే. దీనిచేత శరీరము నునుపుగాఁ జేయ
౨. కలుపఁబడిన చాల సుగంధద్రవ్యములముద్ద (వడియము) పే

* వర్ణకం స్యా ద్విలేపనమ్.

వర్ణాంతరం కరోతీతి వర్ణకం. వర్ణాంతరమును జేయు
విలిప్యతే గాత్రమనేనేతి విలేపనం. లిప ఉపదేహే. దీనిచే
పూయఁబడును. ౨. మైపూఁతకొఱకు మెదిపినగంధాదులపేళ్ల
ను మైపూఁతపే ళ్లని కొందఱు.

* చూర్ణాని వాసయోగా స్స్యుః-

చూర్ణ్యంత ఇతిచూర్ణాని.అ.న. చూర్ణ పేషణే. నూఱఁ
౧. వాసాయ సురభీకరణాయ యుజ్యంత ఇతి వాసయోగాః. అ.
జిర్ యోగే. వాసనకొఱకుఁ గూర్పఁబడునది. ౨. గందపుఁబొడి

* భావితం వాసితం త్రిషు,

భావ్యతే సురభిద్రవ్యైరితి భావితం. భు వో అవకల్కనే.
ద్రవ్యములచేతఁ జేయఁబడినది. ౧. వాస్యతే గంధద్రవ్యైరితి
గంధద్రవ్యములచేత వాసింపఁబడునది. ౨. ఈ ౨ ను త్రి.
కట్టినవస్తువు.

* సంస్కారో గన్ధమాల్యాద్యై ర్యః స్యా త్త దధివాసనమ్.

గంధమాల్యధూపాద్యైః వస్త్రతాంబూలాదీనాం యస్స
రః. తత్ అధివాసనమిత్యుచ్యతే. గంధమాల్యాదులచేత వస్త్ర
బూలాదులయొక్కసంస్కారము అధివాసన మనంబడును. అధి
ఇత్యధివాసనం.

* మాల్యం మాలా స్రజౌ మూర్ధ్ని-

మల్యతే ధార్యత ఇతి మాల్యం. మల మల్ల ధారణే.
బడునది. ౧. మాం లక్ష్మీం లాతీతి మాలా. లా దానే. ఒప్పిదము
నది. 3. సృజ్యతే స్రక్. జ. సీ. సృజ విసర్గే. విడువఁబడునది. 3.
నందలి పువ్వులదండపేళ్లు. కంఠాదులయందలి పువ్వులదండయు

* ... గర్భకః॥

కేశమధ్యే ప్రచ్ఛన్నత్వేన స్థాపితం మాల్యం గర్భక ఇత్యు
...వెండ్రుకలయందు కానరాకుండునట్లు ముడిచినదండ గర్భక మ
...ను. గర్భేక్రియత ఇతి గర్భకః. వెండ్రుకలలోపల చేయఁబడునది.

ప్రభ్రష్టకం శిఖాలమ్బి-

శిఖాలంబి మాల్యం ప్రభ్రష్టక మిత్యుచ్యతే. జుట్టున వ్రేలాడెడు
...ప్రభ్రష్టక మనంబడును. కేశమధ్యాత్ ప్రభ్రష్టం ప్రభ్రష్టకం.
...కలవలన జాఱినది.

పురో న్యస్తం లలామకమ్. ౧౩౫

పురో న్యస్తం లలాటోపరి గతం మాల్యం లలామక మిత్యు
...నొసటిమీఁదఁ బడునట్లు ముందరిభాగమునఁ గట్టఁబడినదండ
...మక మనంబడును, బాసికము. లలం విలాస మమతి లలామకం.
...గత్యాదిషు. విలాసమును బొందియుండునది.

ప్రాలమ్బ మృజులమ్బి స్యాత్కణ్ఠాత్-

కంఠాదార్జవేనోరసి లంబమానం మాల్యం ప్రాలంబ మిత్యుచ్య
...మెడనుండి చక్కఁగా నురస్సునందు వ్రేలుచుండు దండ ప్రాలంబ
...బడును. ప్రలంబతే. ప్రాలంబం. లబి లంబనే. మిక్కిలి వ్రేలాడునది.

వైకక్షకం తు తత్,

య త్తిర్యక్ క్షిప్త మురసి-

ఉరసి యజ్ఞోపవీతాకారేణ య త్తిర్యక్ క్షిప్తంతన్మాల్యం వైకక్ష
...త్యుచ్యతే. ఉరస్సునందు జన్నిదమువలె నడ్డముగా వేసుకొన్నదండ
...క్షక మనంబడును. కక్షా ద్విగతం వికక్షం వక్షః పృష్ఠభాగం చ. తత్ర
... వైకక్షకం. కక్షమువలనఁ బాసినది గనుక వికక్ష మనఁగా ఱొ
...వీఁపును. అం దుండునది. పా. వైకక్ష్యకమ్.

శిఖా స్వాపీడ శేఖరౌ. ౧౩౬

ఆపీడ్యతే దృఢం బంధే నేత్యాపీడః. పీడ అవగాహనే. లెస్సగాఁ
...టచేఁ బీడింపఁబడునది. శిఖరం శిరోఽగ్రం తస్యాయమితి శేఖరః.
...మీఁద నుండునది. శిఖమీఁదఁ జుట్టఁబడినదండపేళ్లు.

రచనా స్యా త్పరిస్పన్దః-

రచ్యతే రచనా, రచ ప్రయత్నే. మునుపటిశ్శృంగారమందు

యత్నముచేయఁబడినది. పరితఃస్పందః శరీరవ్యాపారః. పరిస్పంద కించిచ్చలనే. అంతట ఇంచుకంత శరీరచలనము పరిస్పందము. వ బ్యాదులచేత నైనశృంగారమునందు విశేషమును బుట్టించుటపేర్ల

* ఆభోగః పరిపూర్ణతా,

వస్తునః గుణాదేర్వా పరిపూర్ణతా సమగ్రత్వం ఆభోగ చ్యతే. వస్తువులయొక్కగాని గుణాదులయొక్కగాని నిండు డుట ఆభోగమనంబడును. ఆభుజ్యతే అనేన ఆభోగః. భుజ పా వహారయోః. దీనిచేత భుజింపఁబడును.

* ఉపధానం తూపబర్హః.

ఉపధీయతే శిరోఽత్రేతి ఉపధానం. డు ధాఞ్ ధా యోః. దీనియందు శిరస్సు పెట్టఁబడును. ఉపబృహ్యతే ఉ శిరోఽత్రేతి ఉపబర్హః. బృహ వృద్ధౌ. దీనియందు శిరస్సు డును. తలగడపేర్లు.

* శయ్యాయాం శయనీయవత్.

* శయనమ్-

శేతే అస్యామితి శయ్యా. శయనీయం శయనం చ. పేర్లు. యథా శయ్యాయాం శయనీయశబ్దః. తథా శయనశ వతి ప్రత్యయార్థః. దీనియందు నిద్రింతురు. పానుపుపేర్లు. పఱుపు

* మఞ్చ పర్యఙ్క పల్యఙ్కాః ఖట్వయా సమాః,

మఞ్చ్యతే నరోఽనేన మఞ్చః. మచి ధారణోచ్ఛ్రా నేషు. దీనిచేత నరుఁడు ధరింపఁబడును. పరితః అఙ్క్యతే ఉప నా లక్ష్యత ఇతి పర్యంకః. పల్యంకశ్చ. అకి లక్షణే. దీనియందు గాదులచేత నరుఁడు [illegible]బడును. ఖట్వా కాంక్ష్యతే ఖట్వా. కాంక్షాయాం. కాంక్షింపఁబడునది. ౪. మంచముపేర్లు.

* గేన్దుకః కన్దుకః.

గాతే గేందుకః. గాఙ్ గతౌ. రివ్వున బోవునది. గే గగ దుకివ గేందుకః. గగనమందు చంద్రునివలె నుండును. ౧. స్క పీడ్యత ఇతి కందుకః. పా. కందుకః. స్కందిర్ గతిశోషణయోః. పఁబడునది. చెండుపేర్లు. బంతి.

దీపః ప్రదీపః-

దీప్యతే అనేన దీపః, ప్రదీపశ్చ. దీపీ దీప్తౌ. దీనిచేఁ బ్రకాశింపఁబడును. ౧. ౨. దీపము పేళ్ళు.

పీఠ మాసనమ్. ౧౩౮

పీఠ్యతే సంశ్లిష్యతే పీఠం. పీఠ సంశ్లేషణే. పొందఁబడునది. ౧. ...త్యాసనం. ఆస ఉపవేశనే. దీనియందుఁ గూర్చుండురు. ౨. ...ళ్ళు.

సముద్గక స్సంపుటకః-

సమ్య గుద్గచ్ఛతీతి సముద్గకః. గమ్ఌ గతౌ. లెస్సగా నున్నతత్వ... బొందునది. ౧. సంపుట్యతే సంశ్లిష్యతే పిధానేనేతి సంపుటకః. ...సంశ్లేషణే. మూఁతతోఁడఁ గూడియుండునది. ౨. కరాటము పేళ్లు.

ప్రతిగ్రాహః పతద్గ్రహః,

చర్వితం తాంబూలాదికం ప్రతిగృహ్ణాతీతి ప్రతిగ్రాహః. భక్షిత తాంబూలాదులను గ్రహించునది. పతత్తాంబూలరసాదికం గృహ్ణాతీతి పతద్గ్రహః. గ్రహ ఉపాదానే. పడుచుండెడు తాంబూలరసాదుల ...ంచునది. తమ్మపడిగెము పేళ్లు.

ప్రసాధనీ కఙ్కతికా-

ప్రసాధ్యంతే కేశాః అనయేతి ప్రసాధనీ. ఈ.సీ. రాధ సాధ సంసి...దీనిచేత వెండ్రుకలు లెస్సగాఁ జేయఁబడును. ౧. కఙ్కతే కేశాన్ కంక ...కతిగతౌ. కేశములనుబొందునది. ౨. దువ్వెన పేళ్లు. చిక్కంటియును.

పిష్టాతః పటవాసకః. ౧౩౯

పిష్టం పిష్టత్వం అతతి పిష్టాతః. అత సాతత్యగమనే. చూర్ణరూ...ము బొందియుండునది. ౧. పటాః వాస్యంతే అనేన పటవాసకః. కో... దీనిచేత వాసన కట్టఁబడును. ౨. వస్త్రములకు వాసనకట్టు వస్తువు.

దర్పణే ముకు రాదర్శౌ-

దృప్యతే అనేన సువేషాభిమానా దితి దర్పణః. దృప దృప్తౌ. దీని... మంచివేషాభిమానమువలన గర్వింతురు. ముకురసాహచర్యముచేత ...గము. ౧. మంక్యతే అనేన ముకురః. ముకి మండనే. దీనిచేత నలంకరిం...దురు. పా. మకురః. ౨. ఆదృశ్యతేఽస్మి న్నాత్మనః ప్రతిబింబమితి

ఆదర్శః. దృశిర్ ప్రేక్షణే. దీనియందు తననీడ కానఁబడును.3.అద్ద

* వ్యజనం తాళవృన్తకమ్,

వ్యజ్యతేఽ శ్రమోఽపనీయతే అనేనేతి వ్యజనం. అజ గ
యోః. దీనిచేత బడలిక పోఁగొట్టఁబడును. ౧. తాళవృంతవద్వృం
తి తాళవృన్తకం.తాటితోడిమెనంటి తొడిమగలది. ౨. విసనక

---

## బ్ర హ్మ వ ర్గ ము.

* సంతతి ర్గోత్ర జనన కులా న్యభిజ నాన్వయౌ,
వంశోఽన్వవాయ స్సంతానః-

సంతన్యతేఽ అనయాసంతతిః. సీ. తను విస్తారే.దీనిచేతవి
డును.౧.శూయతే శబ్ద్యతేగార్గ్యోవసిష్ఠ ఇతిగోత్రం. గుజ్ శబ్దే.
డు వసిష్ఠుఁడు అని పలుకఁబడునది. ౨. జన్యతే ఉత్తరోత్తర
జననం. జనీ ప్రాదుర్భావే. ఉత్తరోత్తరము దీనివలనఁ బుట్టుదు
కుల్యతేబంధువర్గోఽనేనేతి కులం. కులసంస్త్యానే. బంధువర్గము
గూర్చఁబడును. ౪. అభిజన్యతే అనేనేతి అభిజనః. దీనిచే బుట్ట
౫. అన్వీయతే అనేనేతి అన్వయః. ఇణ్ గతౌ. దీనిచేత సంబ
బడును. ౬. వన్యతే యాచ్యతే వంశః. వను యాచనే. అడు
నది. ౭. అన్వీయతే పూర్వః పరశ్చేతి అన్వవాయః. ఇణ్ గతౌ.
ర్వము పరము. అని అన్వయింపఁబడునది. ౮. సంతన్యతే స
తను విస్తారే. విస్తరింపఁబడునది. ౯. వంశముపేళ్లు.

* వర్ణా స్స్యు ర్బ్రాహ్మణాదయః.

వర్ణ్యంతే కపిలారుణపీతకృష్ణవర్ణైః నిరూప్యన్త ఇతి వర్ణా
సుతౌ. కపిలారుణ పీతనీలవర్ణములచేత స్తోత్రముచేయఁబడునవి.
లా శ్చారుణాః పీతాః కృష్ణా శ్చేతి పృథక్పృథక్, బ్రాహ్మణా
యా వైశ్యా శ్శూద్రా శ్చేతి వివక్షితాః" ఇతి శ్రీవిష్ణుపురాణే.
హ్మణక్షత్రియవైశ్యశూద్రజాతులు.

* (విప్ర క్షత్రియ విట్ఛూద్రా శ్చాతుర్వర్ణ్య మితి స్మృతమ్)
(బ్రాహ్మణ క్షత్రియ ... చాతుర్వర్ణ్యమ

...చత్వారో వర్ణాః చాతుర్వర్ణ్యం. నాలుగు జాతులు గనుక చా...
...(ర్ణ్యము).
...రాజబీజీ రాజవంశ్యః-
...రాజ్ఞాం బీజమస్యేతి రాజబీజీ. న. పు. రాజవీర్యముగలవాఁడు.
...వంశే భవో రాజవంశ్యః. రాజవంశమందుఁ బుట్టినవాఁడు. ౨.
...వంశమునఁ బుట్టినవాని పేళ్లు.

బీజ్యస్తు కులసమ్భవః. ౨

బీజే కులే జాతో బీజ్యః. కులే సంభవోఽస్య కులసంభవః.
...మందుఁ బుట్టినవాఁడు గనుక బీజ్యుఁడు, కులసంభవుఁడు. ౧. ౨.
...నొకకులమందుఁ బుట్టినవాని పేళ్లు.
మాహాకుల కులీ నార్య సభ్య సజ్జన సాధవః,
మహాకులే జాతో మాహాకులః. మహాకులమందుఁ బుట్టినవాఁ...
...పా, మహాకులః. ౧. కులస్యాపత్యం కులీనః. మంచికులమందుఁ
...వాఁడు. ౨. పాపకర్మభ్యః ఆరాద్దూరాద్యాతః ఆర్యః. పాప
...ములనుండి దూరముగాఁ బోవువాఁడు. అరణీయః అభిగమ్యోవా
... ఋ గతౌ. పొందఁదగినవాఁడు. ౩. సభాయాం సాధుః సభ్యః.
...మందు మంచివాఁడు. ౪. సంశ్చాసౌ జనశ్చ సజ్జనః. మంచిజనుఁ
.... సాధ్నోతి పరకార్యం సాధుః, ఉ. పు. రాధ సాధ సంసిద్ధౌ.
...కార్యమును సాధించువాఁడు. ౬. మంచికులమందుఁ బుట్టినవాని
...

బ్రహ్మచారీ గృహీ వానప్రస్థో భిక్షు శ్చతుష్టయే. ౩
ఆశ్రమోఽస్త్రీ-
బ్రహ్మ వేదః తదధ్యయనార్థం వ్రతమపి బ్రహ్మ. తచ్చరతీతి
...చారీ. న. పు. బ్రహ్మ మనఁగా వేదము. తదధ్యయనార్థమైన
...ంబును బ్రహ్మము. దాని నాచరించువాఁడు. ఆబ్రహ్మచారి నాలు
...ములుగలవాఁడు. గాయత్రీబ్రహ్మచారి. ప్రాజాపత్యబ్రహ్మచారి.
...కబ్రహ్మచారి. నైష్ఠికబ్రహ్మచారి. గృహం భార్యా నాస్యాస్తీతి
.... న. పు. గృహమనఁగా భార్య; అది గలవాఁడు. ఆగృహస్థుఁడు.
...వృత్తి. శాలీనవృత్తి. యాయావరుఁడు. ఘోరసన్యాసి. అని ౪

తెఱఁగులు. వనప్రస్థే వనైకదేశే భవో వానప్రస్థః - వనైక
దుండువాఁడు. ఆవానప్రస్థుఁడు ఔదుంబరుఁడు, ఖేనసుఁడు, సంప్ర
పౌర్ణముఁడును అని నాలుగుభేదములు గలవాఁడు. భిక్షతే య
భిక్షుః. ఉ. పు. భిక్ష భిక్షాయాం. యాచించువాఁడు. సన్న్యా
సన్న్యాసి కుటీచకుఁడు, బహూదకుఁడు, హంసకుఁడు, పరమహం
డు అని నాలుగు తెఱఁగులు గలవాఁడు. ఇట్టీనాలుగుశబ్దములున
ముగా బ్రహ్మచారికి, గృహస్థునికి, తపస్వికి, సన్న్యాసికిని పేళ్లు.
హ్మచర్యాదులు ౪ ఆశ్రమము లందురు. ఆశ్రామ్యన్త్యస్మిన్నితి ఆ
అ. పు. శ్రమ తపసి ఖేదే చ. దీనియందుఁ దపోయుక్తు లగుదుర

* ద్విజాత్యగ్రజన్మభూదేవబాడబాః,
విప్రశ్చ బ్రాహ్మణః-

దేహోత్పత్త్యుపనయనాది లక్షణే ద్వే జాతీ జన్మనీ అస్యే
జాతిః. ఇ. పు. దేహోత్పత్త్యుపనయనాది సంస్కారము లనెడు
జన్మములు గలవాఁడు. ౧. బ్రహ్మణో ముఖే అగ్రే జన్మాస్యేతి అగ్ర
న. పు. బ్రహ్మయొక్క ముఖమందు మొదటజన్మము గలవాఁడు. ౨.
వ్యతి బ్రహ్మవర్చసా భూదేవః. దివు క్రీడాదౌ. బ్రహ్మవర్చస్సుచేత
యందుఁ బ్రకాశించువాఁడు. ౩. బాడబాగ్నిరివాతృప్తో బాడబః
బాగ్నివలెఁ దృప్తిలేనివాఁడు. బడబా బ్రాహ్మణీ. తస్యా అపత్యమి
బాడబః. బడబయనఁగా బ్రాహ్మణస్త్రీ, దానివలనఁ బుట్టినవాఁడు.
బా కుంభదాస్యశ్వా స్త్రీవిశేషా ద్విజాంగనా" అని రభసుఁడు.
విశేషేణ పాపేభ్యః ఆత్మానం పరం చ పాతీతి విప్రః. పా రక్ష
తన్నును పరునిని విశేషముగాఁ బాపమునుండి రక్షించువాఁడు.
బ్రహ్మణి పరబ్రహ్మణి నిష్ఠావత్త్వాత్ బ్రాహ్మణః. పరబ్రహ్మయం
నిష్ఠగలవాఁడు. బ్రహ్మణః కులే భవత్వాద్వా బ్రాహ్మణః, బ్రహ్మ
మందుఁ బుట్టినవాఁడు. ౬ బ్రాహ్మణుని పేళ్లు.

* అసౌ షట్కర్మా యాగాదిభి ర్యుతః.

అసౌ బ్రాహ్మణః యాగాదిభిర్యుతశ్చేత్ షట్కర్మేత్యుచ్యతే
ఈబ్రాహ్మణుఁడు యాగాదు లైనయాఱుకర్మలతోఁ గూడినవాఁ డగు
షట్కర్మ యనంబడును. షట్ కర్మాణ్యస్యేతి షట్కర్మా. న. పు.

...జనాధ్యయనాధ్యాపకదాన ప్రతిగ్రహములనెడి షట్కర్మములు
...డు. ౧. "యజనం యాజనం దానం విశిష్టాచ్చప్రతిగ్రహః,అధ్యా
...పాధ్యయనం విప్రకర్మ ప్రకీర్తిత" మితి స్మృతిః.

...ద్వాన్ విపశ్చి ద్దోషజ్ఞ స్సం త్సుధీః కోవిదో బుధః,
...రో మనీషీ జ్ఞః ప్రాజ్ఞ స్సంఖ్యావాన్ పణ్డితః కవిః. ౫
...మాం త్సూరిః కృతీ కృష్టి ర్లబ్ధవర్ణో విచక్షణః,

వేత్తి సర్వం విద్వాన్. స. పు. సర్వము నెఱింగినవాఁడు. ౧.
...ణ పశ్యన్ చేతతీతి విపశ్చిత్. త. పు. చితీ సంజ్ఞానే. విశేషము
...గాముగ నెఱుంగువాఁడు. ౨. దోషం జానాతీతి దోషజ్ఞః, జ్ఞా
...బోధనే. దోషము నెఱింగినవాఁడు. ౩. పాపం శ్యతీతి సన్. త. పు.
...న్తకర్మణి. పాపమును జెఱుచువాఁడు. ౪. శోభనం ధ్యాయతీతి
... ఈ. పు. ధ్యై చింతాయాం. లెస్సగా విచారించువాఁడు. ౫.
...మ న వేత్తీతి కోవిదః. విద జ్ఞానే. ఇది అది యనునియమములేక
...ము నెఱింగినవాఁడు.౬. సర్వం బుధ్యతే బుధః బుధ అవగమనే. అన్ని
...ఁగినవాఁడు. ౭. ప్రశస్తాం ధియం రాతీతి ధీరః. రా ఆదానే. మంచి
...గ్రహించువాఁడు ౮. మనీషా ఒస్యాస్తీతి మనీషీ. న. పు. బుద్ధి
...వాఁడు. ౯. జానాతీతి జ్ఞః. ఎఱుఁగువాఁడు. ౧౦. ప్రకర్షేణ జానాతీతి
ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః జ్ఞా అవబోధనే. మిగుల నెఱుఁగువాఁడు. ౧౧.
...స్త సంఖ్యా విచారణా౽స్యాస్తీతి సంఖ్యావాన్. త. పు. మంచి
...రముగలవాఁడు. ౧౨. పండతే జానాతి పండితః. పడి గతౌ.
...గువాఁడు. సర్వే గత్యర్థాః జ్ఞానార్థాః పండా ధీ రస్య సంజాతా
...ండితః పండ యనఁగా బుద్ధి; అది గలవాఁడు. ౧౩. కవతే చాతు
కవిః కబృ వర్ణే. వబయో రభేదః. చాతుర్యముచేత వర్ణించు
... ౧౪. ధీ రస్యాస్తీతి ధీమాన్. త. పు. బుద్ధిగలవాఁడు. ౧౫.
ప్రేరయతి సత్కర్మణీతి సూరిః. ఇ. పు. షూ ప్రేరణే. సత్కర్మ
...దు ప్రేరేపించువాఁడు. పా. సూరీ. న. పు. "సూరీ విచక్షణః.
అభిధానమాలయందు నకారాంతము. ౧౬. కృతం జ్ఞాన మనేన
న. పు. జ్ఞానము ఏనిచేతఁ జేయఁబడును. ౧౭. కర్షతి నిష్కర్షతి
. ఇ. పు. కృష విలేఖనే. సర్వమైనయర్థమును నిష్కర్షించువాఁ

డు. ౧౮. లబ్ధః వర్ణః స్తుతి ర్యేన లబ్ధవర్ణః. వర్ణ స్తుతౌ. పొందఁబడి
గలవాఁడు.౧౯.విశేషేణ చష్టే విచక్షణః. చక్షిఙ్ వ్యక్తాయాం
విశేషముగాఁ బలుకువాఁడు. ౨౦. విద్వాంసుని పేళ్లు.

* దూరదర్శీ దీర్ఘదర్శీ-

అప్రత్యక్ష మపి ఊహేన పశ్యతీతి దూరదర్శీ. న. పు. దీర్ఘ
తీతి దీర్ఘదర్శీ. న.పు. ప్రత్యక్షము గాని దూరమైన యర్థములను బుద్ధి
జూచువాఁడు. ౧. ౨. దేశకాలవ్యవహితము లైన యర్థములను బుద్ధి
జూచువాని పేళ్లు. ఇవియును విద్వాంసుని పేళ్లే యని కొందఱు.

* శ్రోత్రియ చ్ఛాన్దసౌ సమౌ.

శ్రుతిం అధీతే శ్రోత్రియః. ౧. ఛందోఽధీతే ఛాందసః. వేద
యనము చేసినవాఁడు. ౨. వేదముఁ జదివినవాని పేళ్లు.

* ఉపాధ్యాయోఽధ్యాపకః-

ఉపేత్యాధీయతే అస్మాదితి ఉపాధ్యాయః. సమీపమును
యాతనివలన నధ్యయనము చేయుదురు. ౧. అధ్యాపయతి అధ్యా
ఇఙ్, అధ్యయనే. అధ్యయనము చేయించువాఁడు. ౨. వేదముఁ
చువాని పేళ్లు.

* అథ స్యా న్నిషేకాదికృ ద్గురుః,

నిషేక మనఁగా గర్భాధానము. అది మొదలగుకర్మ
జేయు తండ్రి గురు వనంబడును. ఆదిశబ్దము చేత సీమంతోపనయనా
గ్రహింపఁబడుచున్నవి. గృణాతి ఉపదిశతి గాయత్ర్యాదికం గురు
పు. గౄశబ్దే. గాయత్ర్యాదుల నుపదేశించువాఁడు.

* మన్త్రవ్యాఖ్యాకృ దాచార్యః-

మంత్ర మనఁగా కల్పసూత్రాదిసహిత మైన వేదము. దా
ధ్యయనము చేయించి యర్థమును దెలియఁజెప్పువాఁడు ఆచార్యుఁ
బడును. ఆచారం గ్రాహయతీతి ఆచార్యః. సంప్రదాయమును గ్ర
పఁజేయువాఁడు. "ఉపనీయ తు యః పూర్వం వేద మధ్యాపయే
జః, సాఙ్గం చ సరహస్యం చ త మాచార్యం విదుర్బుధాః" ఇతి

* ఆదేష్టా త్వధ్వరే వ్రతీ.

అధ్వరమనఁగా యజ్ఞము. తద్విషయ మైనయుపదేశముచేయు
ను ఆదేష్ట యనంబడును. ఆదిశ త్యాదేష్టా. ఋ. పు. దిశ అతి
. అధ్వరవిషయ మైనప్రక్రియను బోధించువాఁడు.౧. బ్రహ్మచారిణః
మస్యా స్తీతి వ్రతీ. న. పు. బ్రహ్మచారివ్రతముగలవాఁడు. ౨. య
యష్టా. ఋ. పు. యజమానశ్చ. యజ దేవపూజాసంగతికరణదా
. యాగముచేయువాఁడు. 3. ర. యజ్ఞకర్తపేళ్లు. ర యజ్ఞకర్తపే
ిందఱు. అప్పుడు ఆదిశ త్యృత్విజో యాగే స్వేష్టసంపాదనాయ
మతి ఆదేష్టా. దిశ అతిసర్జనే. తన యాగకార్యములలో ఋత్విజు
నియమించువాఁడు అని వ్యుత్పత్తి.

స సోమవతి దీక్షితః,

దీక్షాఽస్య సంజాతా దీక్షితః. దీక్షగలిగినవాఁడు. ౧. సోమము
యజ్ఞమందు కర్తయైనవాఁడు.

ఇజ్యాశీలో యాయజూకః-

యజన మిజ్యా తదేవ శీలం యస్య సః ఇజ్యాశీలః. ౧. పునః
యాగకరణశీలో యాయజూక ఇత్యుచ్యతే. ౨. ఇజ్యయనఁగా
ము. పలుమాఱు యజ్ఞము సేయుటయే స్వభావముగాఁ గలవాఁడు
యజూకుఁ డనంబడును. పౌనః పున్యేన యజతే యాయజూకః.
దేవపూజాదా. పలుమాఱు యాగము సేయువాఁడు. ౧, ౨.

యజ్వా తు విధి నేష్టవాన్. ౮

విధినా యథాశాస్త్రం నివర్తితయాగో యజ్వేత్యుచ్యతే. శా
స్త్రప్రకారముగా యజ్ఞము చేసినవాఁడు యజ్వ యనంబడును. యజ
. యజ్వా. న. పు. యాగముచేసినవాఁడు.

స గీష్పతీష్ట్యా స్థపతిః-

బృహస్పతి సవనామ్నా యాగేన ఇష్టవాన్ స్థపతి రి త్యుచ్యతే.
స్పతిసవ మనుపేరు గలఇష్టిచేత యజ్ఞము చేసినవాఁడు స్థపతి య
డును. బృహస్పతిమేధేన సమాపకాంగేన యాగం స్థాపయతి స్థప
. పు. స్థా గతినివృత్తౌ. సమాపక మైనబృహస్పతీష్టిచేత యజ్ఞ
. స్థాపించువాఁడు. ౧.

సోమపీథీ తు సోమపాః,

సోమపీథ స్సోమపాన మస్యాస్తీతి సోమపీథీ. న. పు. సోమ
ము గలవాఁడు. పా. సోమం పీతవానేనేతి సోమపీతీ. న. పు. పీ
సోమపానము చేయఁబడును. సోమం పిబతీతి సోమపాః. ఆ. పు
పానే. సోమమును విధిచేత పానము చేసినవాఁడు. ౧, ౨. య
చేసి యవశిష్టమైనసోమమును పానము చేసినవానిపేళ్లు.

* సర్వవేదా స్స యే నేష్టో యాగ స్సర్వస్వదక్షిణః.

యేన సర్వస్వదక్షిణో యాగో విశ్వజిదాది రిష్ట స్స సర్వ
ఇత్యుచ్యతే. సర్వము దక్షిణగాఁగల విశ్వజిదాదియాగము ఎవ
జేయఁబడునో వాఁడు సర్వవేదస్సు అనంబడును. సర్వస్వం వే
లంభయతి ఋత్విజ ఇతి సర్వవేదాః. స. పు. విద్ ౨ లాభే. సర్వ
ను ఋత్విజులఁ బొందించువాఁడు.

* అనూచానః ప్రవచనే సాఙ్గేఽధీతీ-

సాంగే శిక్షాద్యంగషట్కే ప్రవచనే వేదే గురో స్సకా
అధీతీ కృతాధ్యయనో యః సః అనూచాన ఇత్యుచ్యతే. అధీ
నాంతః. గురువువలన శిక్షాదిషడంగయుక్తమైనవేదమందలి
యనము ఎవనికిఁగలదో వాఁడు అనూచానుఁ డనంబడును. సాంగ
మధీత్య తమేవ అను పశ్చా దుక్తవాన్ అనూచానః. వచ ప
జే. అంగయుక్తమైనవేదమును అధ్యయనముచేసి, వెనుకను
పఠించువాఁడు. ౧.

* గురో స్తు యః,

లబ్ధానుజ్ఞ స్సమావృత్తః-

వ్రత మాచరితం ఇదానీం గృహీ భవేతి గురో ర్లబ్ధాను
మావృత్త ఇత్యుచ్యతే. 'నీచేత వ్రతంబాచరింపఁబడెను. ఇంక
స్థుఁడవుగ' మ్మని వేదాధ్యయనానంతరమందు గురువువలనఁ బొం
యనుజ్ఞగలవాఁడు సమావృత్తుఁ డనంబడును. గురుకులాద్గృహం
సమావర్తతే స్మ సమావృత్తః. వృతు వర్తనే. గురుగృహము
తనగృహమును గూర్చి మరల వచ్చినవాఁడు. ౧.

* సుత్వా త్వభిషవే కృతే.

అభిషవః స్నానం ప్రస్తావా ద్యాగసంబంధిస్నానం యః

పః సుత్వేత్యుచ్యతే. అభిషవ మనఁగా యజ్ఞసంబంధ మైనస్నా
; అది చేసినవాఁడు సుత్వ యనంబడును. సునోతి సోమమితి సు
. న. పు. షుఞ్ అభిషవే. సోమలతను గొట్టి పిడిచినవాఁడు. ౧.
ఛాత్త్రాన్తేవాసినౌ శిష్యే-
గురోరసచ్చరిత్రం ఛాదయతీతి ఛాత్త్రః. ఛద అపవారణే. గురు
కు- అసచ్చరిత్రమును గప్పువాఁడు. ౧. గురోరన్తే నికటే వసతీ
న్తేవాసీ. న.పు. వస నివాసే. గురువుయొక్క సమీపమందుండెడు
. ౨. శాసనీయః శిష్యః. శాసు అనుశిష్టౌ. శిక్షింపఁదగినవాఁ
. శిష్యునిపేళ్లు.

శైక్షాః ప్రాథమకల్పికాః,

శిక్షా మధీయతే శైక్షాః. శిక్షాగ్రంథము నధ్యయనముచేయు
. శిక్షాయోగ్యా వా శైక్షాః. శిక్షింప యోగ్యమైనవారు. ౧. ప్ర
కల్పః ఆద్యారంభః ప్రయోజనం యేషాం తే ప్రాథమకల్పికాః.
మారంభము ప్రయోజనముగాఁ గలవారు. ౨. అప్పుడు వేదాధ్య
ముచేయ నారంభించిన శిష్యులపేళ్లు.

కబ్రహ్మవ్రతాచారా మిథ స్సబ్రహ్మచారిణః. ౧౧

ఏకస్మాద్గురో రేకం వేద మధ్యేతుం బ్రహ్మ వ్రత మాచరంతిః అ
న్యం సబ్రహ్మచారిణ ఉచ్యంతే. ఒకగురునొద్ద నొకవేదము నధ్య
ముచేయుటకొఱకు నొకవ్రతమునే ఆచరించువారు అన్యోన్యము
హ్మచారు లనంబడుదురు. ఏకం సమానం బ్రహ్మవ్రతం చరంతీతి
హ్మచారిణః. న.పు. చర గతిభక్షణయోః. బ్రహ్మవ్రత మనఁగా వేద
ము. సమానమయిన వేదాధ్యయనవ్రతము నాచరించువారు ౧.

సతీర్థ్యా స్త్వేకగురవః

పావనహేతుత్వా త్తీర్థమివ తీర్థం గురుః. సమానే తీర్థే భవా వర్త
ః సతీర్థ్యాః. పావనహేతువైనవాఁడుగనుక తీర్థమనఁగా గురువు;
నగురువునందు వర్తించువారు. ౧. ఏకోగురుర్యేషాం తే ఏకగుర
. పు. ఒకగురువుగలవారు. ౨. ఒకగురువునొద్ద వేదముగాని మఱి
విద్యగాని యధ్యయనము చేయువారు.

చితవా నగ్ని మగ్నిచిత్,

అగ్నిం చితవాం అగ్నిచిత్. త. పు. చిఞ్ చయనే. అగ్ని
నముచేసినవాఁడు. ౧. అగ్నిచయనముచేసినవానిపేరు. ఆహితాగ్ని.

* పారమ్పర్యోపదేశే స్యా దైతిహ్య మితి హావ్యయమ్.

ఇత్యేవం కిము పారంపర్యము స్తీతి ఇతిహ. అవ్యయము. ఇతి
ఐతిహ్యం. అ. న. ఇట్లని గదా పారంపర్యము గల వనుట ఇతిహ
ర్థము. ఆయర్థముగలదే ఐతిహ్యము. ౧. పారంపర్యముచేత
యుపదేశముపేళ్లు.

* ఉపజ్ఞా జ్ఞాన మాద్యం స్యాత్.

ఉప జ్ఞాయత ఇత్యుపజ్ఞా. జ్ఞా అవబోధనే. మొదట నెఱు
డుట ఉపజ్ఞ. ౧. ఉపదేశము లేక తనంతటనే మొదటఁ బుట్టినజ్ఞా
వాల్మీకిశ్లోకజ్ఞానమువంటిది.

* జ్ఞా త్వారమ్భ ఉపక్రమః,

ఇది యీప్రకారముగా సిద్ధించు నని యుపాయము
ప్రారంభించుట ఉపక్రమ మనంబడును, ఉపక్రమణం ఉపక్రమః. ౧

* యజ్ఞస్సవోఽధ్వరో యాగ స్స ప్తతన్తుర్మఖః క్రతుః.

యజ్యతే యజ్ఞః. యజ దేవపూజాసంగతికరణదానేషు. పూ
చుట.౧.సూయతే సోమోఽస్మిన్నితి సవః. షుఞ్ అభిషవే. దీని
సోమము తడవఁబడును. ౨. అధ్వానం వైదికమార్గం రాతి అ
రా దానే. వైదికమార్గము నిచ్చునది. ౩. యజనం యాగః, య
పూజాదౌ. పూజించుట. ౪. స ప్తభిశ్ఛందోభి స్తన్యత ఇతి స ప్త
ఉ. పు. తను విస్తారే. ఏడుఛందస్సులచేత వి స్తరింపఁబడునది. ౫
న్తి దేవా అత్రేతి మఖః. మఖ గతౌ-దీనికి దేవతలు వత్తురు. ౬.
తే బ్రాహ్మణాదిభిరితి క్రతుః. ఉ. పు. డుకృఞ్ కరణే. బ్రా
క్షత్రియ వైశ్యులచేతఁ జేయఁబడునది. ౭. యజ్ఞముపేళ్లు.

* పాఠో హోమ శ్చాతిథీనాం సపర్యా తర్పణం బలిః,
ఏతే పఞ్చ మహాయజ్ఞా బ్రహ్మయజ్ఞాదినామకాః.

పాఠాదయః బ్రహ్మయజ్ఞాదినామకాః పంచ మహాయజ్ఞాః
వేదపాఠము, వైశ్వదేవాదిహోమము, అతిథిపూజ, పితృతర్పణము
తబలి అను ... మ పంచమహాయజ్ఞము లనఁబడును. మహా

...హాయజ్ఞాః. పంచచ తే మహాయజ్ఞాశ్చ పంచమహాయజ్ఞాః. ఐదువ్వ
...ములుగలవి పంచమహాయజ్ఞములు 'పూజా, సపర్యాధ్యయనం, బ్రహ్మా,
...జ్ఞస్తు, తర్పణమ్, హోమో, దైవో బలి, ర్భౌతో, నృయజ్ఞో౽
...పూజన' మితి స్మృతిః. ఇవి పంచమహాయజ్ఞములు. వేదపాఠము,
బ్రహ్మయజ్ఞము, హోమము, దేవయజ్ఞము, అతిథిపూజనము, మనుష్య
యజ్ఞము, పితృతర్పణము, పితృయజ్ఞము, భూతబలి, భూతయజ్ఞము. ఇవి.

సమజ్యా పరిష ద్గోష్ఠీ సభా సమితి సంసదః,
ఆస్థానీ క్లీబ మాస్థానం స్త్రీనపుంసకయో స్సదః. ౧౫

సమజ న్తి మిళ న్త్యత్ర సమజ్యా. అజ గతిక్షేపణయోః. లెస్సగా
...యందు కూడుదురు. ౨. పరిత స్సీదంత్యత్ర పరిషద్. ద. సీ. షద్ ౢ వి
...ణగత్యవసాదనేషు. అంతట దీనియందుఁ బొందియుందురు. ౩. గావో
నానావిధా వాచ స్తిష్ఠ న్త్యత్రేతి గోష్ఠీ. ఈ. సీ. ష్ఠాగతినివృత్తౌ. నానావిధ
...లయినవాక్కులు దీనియం దుండును. ౪. సహ భా న్తి అత్రేతి సభా. భా
...ప్తౌ. కూడుకొని దీనియందుఁ బ్రకాశింతురు. ౫. సంయ న్తి మిళ న్త్య
...మితి సమితిః. ఇ. సీ. ఇణ్ గతౌ. దీనియందు లెస్సగాఁ బొందియుం
...రు. ౬. సీద న్త్యస్యాం సంసత్. ద. సీ. షద్ ౢ విశరణగత్యవసాదనేషు
...యం దుందురు. ౭. ఆసమన్తా త్తిష్ఠంత్యత్ర ఆస్థానీ. ఈ. సీ. ఆస్థానం
... ష్ఠా గతినివృత్తౌ. అంతట దీనియం దుందురు. ౭, ౮. సీద న్త్యస్యాం
...ః. స, స్న. షద్ ౢ విశరణాదౌ. దీనియం దుందురు. ౯. సభపేళ్లు.
...స్థానీశబ్దము మొదలు ఈ౩ను దొరలున్న సభపేళ్లని కొందఱు.

ప్రాగ్వంశః ప్రా గ్ఘవి ర్గేహాత్ -

యత్ర గృహే హవ్యాదికం స్థాప్యతే తతః పూర్వం యజమాన
...స్యాదీనాం వాసాయ కల్పితం గృహం ప్రాగ్వంశ ఇత్యుచ్యతే. ఏగృ
...మందు హవిరాదులు నియమముచేత నుంచఁబడునో ఆగృహము
...కు పూర్వభాగమునందు యజమానులు సదస్యులు మొదలైనవా
...కుటకొఱకు నిర్మింపఁబడిన గృహము ప్రాగ్వంశ మనంబడును. వన్య
...తే ఆశ్రియత ఇతి వంశః. ప్రా గగ్రే వంశః ప్రాగ్వంశః. వన షణ సంభ
...ః ప్రాగ్భాగమందు యజమానాదులచేత నాశ్రయింపఁబడునది. ౧.

సదస్యా విధిదర్శినః,

సదసి సాధవః సదస్యాః. సభయందు మంచివారు. ౧. విధిం
విహితం పశ్య న్తీతి విధిదర్శినః. న. పు. దృశిర్ ప్రేక్షణే. విధివిహి
మును జూచువారు. ౨. యాగవిధియందు న్యూనాతిరిక్తములు
కుండఁ జూచుటయందు తత్పరులయినఋత్విజులపేళ్లు.

* సభాసద స్సభాస్తారా స్సభ్యా స్సామాజికా శ్చ తే. ౧

సభాయాం సీద న్తీతి సభాసదః. ద. పు. సభయందుండువా
౧. సభాం స్తృణ న్తి ఆచ్ఛాదయ న్తీతి సభాస్తారాః. అ. పు. స్తృ
ఆచ్ఛాదనే. సభను గప్పియుండువారు. ౨. సభాయాం సాధవః సభ్యా
అ. పు. సభయందు మంచివారు. ౩. సమాజం సమూహం సమవయ
తీతి సామాజికాః. సమూహమును బొందియుండువారు. ౪. సభయ
దుండు వారిపేళ్లు.

* అధ్వ ర్యూద్గాతృ హోతారో యజు స్సా మర్గ్విదః క్రమాత్,

అధ్వరం యాతి అధ్వర్యుః. ఉ. పు. యా ప్రాపణే. యజ్ఞమ
బొందువాఁడు. ౧. ఉద్గాయతి దేవాదీ న్స్తౌతి ఉద్గాతా. ఋ.
గై గానే. దేవతలను బెట్టుగా స్తోత్రము చేయువాఁడు. ౧. జుహో
హోతా. ఋ. పు. హు దానాదనయోః. హోమముచేయువాఁ
౧. వరుసగా, యజుర్వేదమును, సామవేదమును, ఋగ్వేదము
నెఱిఁగినవానిపేళ్లు.

* అగ్నీధ్రాద్యా ధనై ర్వార్యా ఋత్విజో యాజకా శ్చ తే. ౧

యజ్ఞస్వామినా ధనై ర్వార్యాః ఆగ్నీధ్రాదయష్షోడశ యాజక
త్విక్ఛబ్దవాచ్యాః. తే చ బ్రహ్మా, ఉద్గాతా, హోతా, అధ్వర్యు
బ్రాహ్మణాచ్ఛంసీ, ప్రస్తోతా, మైత్రావరుణః, ప్రతిప్రస్థాతా, పో
ప్రతిహర్తా, అచ్ఛావాకః, నేష్టా, అగ్నీధ్రః, సుబ్రహ్మణ్యః, గ్రావ
త్, ఉన్నేతా చేతి. యజ్ఞకర్తచేత ధనములచే వరింపఁదగిన ఆగ్నీ
డు మొదలయినపదియార్వురు ఋత్విజులు యాజకులు ననంబడు
ఆదృశబ్దముచేత బ్రహ్మ ఉద్గాత, హోత మొదలయినవారు. అగ్నీ
ఆగ్నీధ్రః. ఞి ఇన్ధీ దీప్తౌ. అగ్నిని బ్రకాశింపఁజేయువాఁడు. ఋతౌ
తాదా యాజయ న్తి ఋత్విజః. జ. పు. యాజకాశ్చ యజ దేవపూ
జా. పరం[illegible] ఋత్విజులు[illegible] యాగము చేయించువారు. ౧.

వేదిః పరిష్కృతా భూమిః-

పూజాదికం విన్దతీతి వేదిః. ఇ.సీ. విద్ౢ లాభే. పూజాదికమును
పొందునది. ఈకారాంతముం గలదు. ౧. యాగార్థమై చతురశ్రముగా
పరిష్కరింపఁబడినభూమి.

సమే స్థణ్డిల చత్వరే,

తిష్ఠన్త్యగ్నయోఽస్మిన్నితి స్థండిలం. ష్ఠా గతినివృత్తౌ. అగ్నులు
నియం దుండును. ౧. చతన్తే యాగఫలమత్రేతి చత్వరం. చతే
యాచనే. దీనియందు యాగఫలము నడుగుదురు. ౨. అగ్నిహోత్ర
ము నుంచుటకై సంస్కరింపఁ బడినస్థానము పేళ్లు.

చషాలో యూపకటకః-

కటకాకృతిత్వేన చష్యతే చషాలః. చష భక్షణే. వలయాకా
రముగాఁ జెక్కఁబడునది. యూపస్తంభాగ్రమున వేయఁబడు దారు
మయ మైనకడియము.

కుమ్బా సుగహనా వృతిః. ౧౬

కుంబయతి ఆచ్ఛాదయతి కుంబా. కుబి ఆచ్ఛాదనే. యజ్ఞశాల
గప్పుకొనియుండునది. ౧౧. యజ్ఞశాలకుఁ జుట్టుపెట్టఁబడిన అతిగ
హనమైనవెలుఁగు.

యూపాగ్రం తర్మ-

తరతి చషాలమితి తర్మ. న. న. తౄ ప్లవనతరణయోః. యూప
మయమును తరించునది. ౧. యూపముకొన.

నిర్మన్థ్యదారుణి త్వరణి ర్ద్వయోః,

అగ్న్యుత్పాదనార్థం నిర్మన్థ్యదారుణి అరణిశబ్దో వర్తతే. అ
గ్నిఁ బుట్టించుటకొఱకు కాష్ఠాంతరముచేత మథింప యోగ్యమైనదారు
వందు అరణిశబ్దము వర్తించును. ఇయర్తి అగ్నిరస్యామి త్యరణిః.
పుం. ఋ గతౌ. దీనియం దగ్నిపుట్టును. ౧.

దక్షిణాగ్ని ర్గార్హపత్యాహవనీయా త్రయోఽగ్నయః. ౧౯

దక్షిణాగ్న్యాదిత్రయం పృథక్ స్వనామప్రసిద్ధే అగ్నిత్రయే వ
ర్తతే. దక్షిణాగ్నిశబ్దము మొదలైన 3 శబ్దములు ప్రత్యేకముగాఁ ద
మ నామములచేతఁ బ్రసిద్ధములైనమూఁ డగ్నులపేళ్లు. వేదాద్య ద

క్షిణోఽగ్నిః దక్షిణాగ్నిః. పు. వేదికి దక్షిణ మైనయగ్ని దక్షి
గ్ని. ౧. గృహపతినా ఇతరాగ్నిభ్యాం పూర్వం సంస్కృతోఽగ్నిః
ర్హాపత్యః. యజమానునిచే నితరాగ్నులకంటెఁ బూర్వమందు సం
రింపఁబడిన యగ్ని గార్హాపత్యము. ౧. ఆ కర్మసమాప్తేః హోత
ఆహావనీయః. హు దానాదనయోః. క్రియాపరిసమాప్తిపర్యంత
హోమము చేయఁదగినదిగనుక ఆహావనీయము. ౧.

* అగ్నిత్రయ మిదం త్రేతా-

ఇదం శ్రౌతాగ్నిత్రయం ఏకోక్త్యా త్రేతే త్యుచ్యతే. ఈము
డు నొకవాక్యముచేత త్రేత యని చెప్పఁబడును. త్రాణం త్రా;
త్రాం రక్షణం ఇతా ప్రాప్తా. త్రేతా. ఆ. సీ. త్రైఙ్ పాలనే. ఇ
గతౌ. సదా రక్షణమును బొందియుండునది. ౧. అగ్నిత్రయము.

* ప్రణీత స్సంస్కృతోఽనలః,

మన్త్రేణ సంస్కృతోఽగ్నిః ప్రణీతః. మంత్రముచేత సంస్కృ
పఁబడిన యగ్ని ప్రణీత మనంబడును. ప్రణీయతే సంస్క్రియతే ప్ర
తః. ణీఞ్ ప్రాపణే. సంస్కరింపఁబడునది. ౧. సంస్కృతమైన య

* సమూహ్యః పరిచా య్యోపచాయ్యా వగ్నౌ ప్రయోగిణః.

సమూహ్యాదయ స్త్రియః అగ్నౌ యాగవహ్నౌ ప్రయోగిణః
యో క్తవ్యా ఇత్యర్థః. సమూహ్యాదులైన ౩ శబ్దములు యాగాగ్ని
దుఁ బ్రయోగింపఁదగిన నామధేయములు. సమూహ్యతే సమూహ్య
ఊహ వితర్కే. సమముగా నూహింపఁదగినది.౧. పరి చీయతే పరి
య్యః. ఉప చీయతే ఉపచాయ్యః. చిఞ్ చయనే. కూల్పఁబడునది.

* యో గార్హపత్యా దానీయ దక్షిణాగ్నౌ ప్రణీయతే,
తస్మి న్నానాయ్యః-

గార్హపత్యాదానీయ యః దక్షిణాగ్నౌ ప్రణీయతే తస్మిన్ ఆ
య్యశబ్దో వర్తతే. గార్హపత్యముననుండి దక్షిణాగ్నియందుఁ
బడిన యగ్నియం దానాయ్యశబ్దము వర్తించును. గార్హపత్యాదగ్నే
యత ఇతి ఆనాయ్యః. ణీఞ్ ప్రాపణే. గార్హపత్యమునుండి తేఁబడిన

* అ థాగ్నాయీ స్వాహా చ హుతభుక్ప్రియా.

అగ్నేః స్త్రీ ... అగ్నియొక్క పెండ్లాము. ౧.

హూయంతే దేవాః అనయేతి స్వాహా. లెస్సగా దీనిచేత దేవ
లునఁబడుదురు. ౨. హుతభుజః ప్రియా హుతభుక్ప్రియా. అగ్ని
. పెండ్లాము. 3. అగ్నిహోత్రునిపెండ్లాముపేళ్లు.

ఋ క్సామిధేనీ ధాయ్యా చ యా స్యా దగ్నిసమిన్ధనే,

అగ్నిసమింధనే అగ్నిప్రజ్వలనే యా ఋక్ తస్యాం సామిధే
ను వర్తతే. అగ్నిని ప్రజ్వలింపఁజేయుఋక్కు సామిధేని, ధా
అనంబడును. సమిధామియం మాధానీ సామిధేనీ. సమిధలను బె
డి. ౧. ధీయతే సమి దనయేతి ధాయ్యా. డు ధాఞ్ ధారణపో
షా॥. దీనిచేత సమిత్తు ధరింపఁబడును. ౨. అగ్నిప్రజ్వలనము
ఋక్కు.

గాయత్రీప్రముఖం ఛన్దః-

గాయత్రీప్రముఖం గాయత్ర్యాద్యం ఛన్ద ఇత్యుచ్యతే. ఆది
ష్ణిక్, అనుష్టుప్ బృహత్యాదీనాం గ్రహణం. గాయత్రి, ఉష్ణిక్కు,
ప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి,
అత్యష్టి, ధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, ఉద్ధృతి
లైన యిరువదియాఱును ఛందస్సు లనంబడును. అందు గా
ఆఱక్షరములపాదముగలది. కడమఛందస్సులు ఆమీఁద నొ
క్షరము అధికముగాఁ గలపాదములు గలవి. గాయతం త్రాయ
గాయత్రీ. త్రైఙ్ పాలనే. తనను జపించువానిని రక్షించునది.
త్యాహ్లాదయతీతి ఛందః. స. న. ౧. చది ఆహ్లాదనే. సంతో
టునది. గాయత్ర్యాది ౨౬ ఛందస్సులపేళ్లు.

హవ్యపాకే చరుః పుమాన్. ౨౨

హవ్యపాకే అగ్నియందు వేల్వఁదగినపక్వాన్నమందు చరుశబ్ద
వర్తించును. దాని కాధార మైనపాత్రంబును చరు వనంబడును.
న్తి దేవా ఇమ మితి చరుః. ఉ. పు. చర గతిభక్షణయోః. దేవతలు
భక్షింతురు. ౧. అగ్నిలో వేల్వఁదగిన పక్వాన్నము.

ఆమిక్షా సా శృతోష్ణే యా క్షీరే స్యా ద్దధియోగతః,

శృతోష్ణే తప్తేఉష్ణేచ క్షీరేపయసి దధియోగతః దధిసంబంధా
యా వికృతిః సా ఆమిక్షేత్యుచ్యతే. కాఁచఁబడి వేఁడి యైనపాల

లో పెరుఁగు పోయుటవలన నైనవికారము ఆమిక్షయనంబడును. యతే క్షిప్యతే దధ్యత్రేతి ఆమిక్షా. డు మిక్ష్ ప్రక్షేపణే. దీని పెరుఁగుపోయఁబడును. పా. ఆమీక్షా. ౧.

* ధవిత్రం వ్యజనం తద్యద్రచితం మృగచర్మణా.

యాగే అగ్నిప్రజ్వలనాయ మృగచర్మణా రచితం యద్ నం తత్ ధవిత్ర మిత్యుచ్యతే. యాగమందు అగ్నిని ప్రజ్వలిం యుటకొఱకు మృగచర్మముచేఁ జేయఁబడిన విసనకఱ్ఱ ధవిత్ర బడును. ధూయతే అగ్ని రనేన ధవిత్రం. ధూఞ్ కమ్పనే. దీ అగ్ని కంపింపఁ జేయఁబడును. ౧.

* పృషదాజ్యం సదధ్యాజ్యే-

సదధ్యాజ్యే దధిసహితాజ్యే పృషదాజ్యశబ్దో వర్తతే. పె తోఁ గూడిననెయ్యి పృషదాజ్య మనంబడును. పృషద్భిః దధిబి అన్విత మాజ్యం పృషదాజ్యం. దధిబిందువులతోఁగూడినయాజ్యమ

* పరమాన్నం తు పాయసమ్,

పరమ మన్నం పరమాన్నం. శ్రేష్ఠమైనయన్నము .౧. పయసా స్కృతం పాయసం.పాలచేతఁబక్వముచేయఁబడినది.౨. పాయసము

* హవ్య కవ్యే దైవ పైత్రే అన్నే-

దేవయోగ్యము హవ్యము పితృయోగ్యము కవ్యము. హూ తే హవ్యం. హుదానాదనయోః వేల్వఁబడునది. ౧. కూయతే స్తూయత ఇతి కవ్యం. కు శబ్దే. పితృదేవతలచేత స్తోత్రముచేయఁబ ౧. వరుసగా దేవతలకును బితృదేవతలకును యోగ్యమైన అన్నము

* పాత్రం స్రువాదికమ్.

పాతీతి పాత్రం. పా రక్షణే. రక్షించునది. ౧. స్రువము లైన యజ్ఞపాత్రలపేళ్లు.

* ధ్రు వోపభృ జ్జుహూ ర్నాతు స్రువో భేదా స్స్రుచః స్త్రియః

ధ్రువాదయః స్రుచో భేదాః. తే చ స్త్రియః స్త్రీలింగాః. స్రు నా. పుల్లింగః. ధ్రువాదిశబ్దములు ౪ స్రుక్కుయొక్క భేదముల ధ్రువతీతి ధ్రువా. ధ్రువ స్థైర్యే. స్థిరమైయుండునది. ౧. ఉపభ్రి హోమార్థమిత్యుపభృత్, త. సీ. భృఞ్ భరణే. హోమార్థమై

నది. ౧. హూయతే అనయా జుహూః. ఊ. సీ. హు దానాదన
. దీనిచేత వేల్వఁబడును. ౧. స్రవ త్యాజ్యమస్మాదితి స్రువః.అ.పు.
వణే. దీనివలన నాజ్యము స్రవించును. ౧.
పాకృతః పశు రసౌ యోఽభిమ న్త్ర్య క్రతౌ హతః. ౨౭
క్రతౌ యః పశుః అభిమంత్ర్య హతః స పశుః ఉపాకృత ఇత్యుచ్య
జ్ఞమందు అభిమంత్రించి యేపశువు హింసింపఁబడునో, ఆపశువు
త మనంబడును. ఉపాహంత్ర్య క్రియతే ఇతి ఉపాకృతః. కృఞ్
యాం. అభిమంత్రించి హింసింపఁబడునది. ౧.
మ్పరాకం శసనం ప్రోక్షణం చ వధార్థకమ్,
పరంపరాం ప్రాణానాం అకతీతి పరంపరాకం. అక కుటిలాయాం
ప్రాణపరంపరను కుటిలముగాఁబొందునది. ౧. శస్య తే శసనం.శసు
యాం. హింసించుట శసనము. పా. శమనం. ౨. ప్రోక్ష్య తే
ణం. ప్రోక్షించుట ప్రోక్షణము. వధకంబైఁ బూర్వము ప్రోక్షింపఁ
. 3. యజ్ఞమందలి పశువధ పేళ్లు.
వాచ్యలిఙ్గాః ప్రమీతోపసంపన్న ప్రోక్షితా హతే. ౨౮
ప్రమియత ఇతి ప్రమీతః. మీఙ్ హింసాయాం. హింసింపఁ బడు
. ఉపసంపద్య తే హననార్థ ముపసంపన్నః. పద్ గతౌ. హింసార్థ
పొందఁబడునది. ౨. ప్రోక్షణ మితః ప్రోక్షితః. ప్రోక్షణమును పొం
. ఈ 3 ను విశేష్యలింగములు. యాగార్థమై హింసింపఁబడిన పశు
దలైనదాని పేళ్లు.
సాంనాయ్యం హవిః-
సన్నీయతే సాంనాయ్యం. ణీఞ్ ప్రాపణే. లెస్సగా నగ్నియం
పొందింపఁబడునది. ౧. హూయత ఇతి హవిః. స. న. హు దానాదన
. అగ్నియందు వేల్వఁబడునది. ౨. హవిస్సు పేళ్లు. దధిపయోరూ
హవిస్సని కొందఱు.
అగ్నౌ తు హుతం త్రిషు వషట్కృతమ్,
అగ్నౌ హుతం వషట్కృత మిత్యుచ్య తే. అగ్నియందు వేల్వఁ
వషట్కృత మనంబడును. వషట్ క్రియతే ఇతి వషట్కృతం.
వషట్కారయు క్తముగాఁ జేయఁబడునది. ౧.

* దీక్షాన్తోఽవభృథో య(జ్ఞః)జ్ఞే-

దీక్షాఖ్యస్యకర్మణః అన్తో దీక్షాన్తః. యజ్ఞదీక్షయొక్క
ము దీక్షాంతము.౧. అవభ్రీయతే దీక్షావ్రతం పూర్యతే అనేనే
థః. భృఞ్ భరణే. దీనిచేత దీక్షావ్రతము నిర్వహింపఁబడును.
యజ్ఞాంతమందలి న్యూనాతిరిక్తదోషపరిహారముకొఱకుఁ చేయు
పేళ్ళు. అవభృథస్నానము.

* తత్కర్మార్హం తు యజ్ఞియమ్.

త్రిషు-

యజ్ఞార్హం యజ్ఞియం.త్రి.౧.యజ్ఞమునకు సర్హమైనవస్తు

* అథ క్రతుకర్మేష్టమ్-

క్రతుకర్మయత్ తదిష్ట మిత్యుచ్యతే. యజ్ఞమందలి హో
నాదిక్రియ ఇష్టమనంబడును. "ఏకాగ్నికర్మహవనం త్రేత్రాయా
చ్చ హూయతే, అంత ర్వేద్యాం చ యద్దాన మిష్టం త దభిధీయతే
స్మృతిః. ఇజ్యతే స్మఇష్టం. యజ దేవపూజాదౌ. వేల్వఁబడునది. (
బడునది) ఇష్టము. ౧.

* పూర్తం ఖాతాదికర్మ యత్,

ఖాతాదికర్మయ త్తత్పూర్త మిత్యుచ్యతే. ఖాతమనఁగా
ము. ఆదిశబ్దముచేత దేవాలయారామాదులును పూర్తమని
డును. "పుష్కరిణ్య స్సభా వాపీ దేవ స్యాయతనాని చ, ఆరా
విశేషేణ పూర్తం కర్మ వినిర్దిశే" దితి స్మృతిః. పిపర్తి పాలయతి
దేవ బ్రాహ్మణాదీ నితి పూర్తం. పౄ పాలనపూరణయోః.
బ్రాహ్మణాదుల రక్షించునది. ౧.

* అమృతం విఘసో యజ్ఞశేష భోజనశేషయోః.

న మ్రియంతే అనేనే త్యమృతం. మృఙ్ ప్రాణత్యాగే.
జెడరు. ౧. విఘస్యతే విఘసః. ఘస్లృ అదనే. విశేషముగా భక్షి
బడునది ౧. ఈ ౨ వరుసగా యజ్ఞమందు వేల్వఁగా మిగిలినయా
మొదలయినవానికిని, దేవతలును, అతిథులును భుజింపఁగా
యున్నాదులకును పేళ్లు.

* త్యాగో విహాపితం దాన ముత్సర్జన విసర్జనే,

[శ్రా]ణనం వితరణం స్పర్శనం ప్రతిపాదనమ్. ౨౯
[ప్ర]దేశనం నిర్వపణ మపవర్జన మంహతిః,

త్యజ్యతే త్యాగః. త్యజ హానౌ. ఇచ్చుట. ౧. విహీయతే వి
.. ఓ హాక్ త్యాగే. విడువఁబడునది. పా. విహాయితం. ౨. దీ
దానం. దాఞ్ దానే. ఇచ్చుట. ౩. ఉత్సృజ్యతే ఉత్సర్జనం.
[జ్య]తే విసర్జనం. సృజ విసర్గే. ధనాదుల విడుచుట. ౪. ౫. విశ్రా
విశ్రాణనం. శ్రణ దానే. ఇచ్చుట. ౬. వితరంత్యనేన వితరణం.
[ప్ల]వనతరణయోః. దీనిచేత నరకమును తరింతురు. ౭. స్పృశ్యతేఽ
[స్ప]ర్శనం. స్పృశ స్పర్శే. దానమందు వస్తువు స్పృశింపఁబడును గ
[ను]పచారమున దానమును స్పర్శనము. ౮. ప్రతిపాద్యతే అనేన
[పా]దనం. పద్ గతౌ. దీనిచేత పుణ్యము ప్రతిపాదింపఁబడును. ౯.
[శ్య]తే ప్రదేశనం. దిశ అతిసర్జనే. ఇచ్చుట. ౧౦. నిర్వాప్యతే నిర్వ
టు వప్ బీజసంతానే. మీఁదిజన్మమునకు మొలవఁబెట్టఁబడునది.
అపవర్జ్యతే పాప మనేనే త్యపవర్జనం. వృజీ వర్జనే. దీనిచేతఁ
[ము] వర్జింపఁబడును. పా. అపసర్జనం. ౧౨. హంతి పాపమి త్యంహతిః.
హన హింసాగత్యోః. పాపమును జెఱుచునది. ౧౩. దానము

[మృ]తార్థం తదహర్దానం త్రిషు స్యా దౌర్ధ్వదైహికమ్. ౩౦
మృతార్థం తదహర్దానం మృతాహే పిండాదిదానం ఔర్ధ్వ
[దైహిక] మిత్యుచ్యతే. మృతులైనవారికొఱకు మృతాహస్సులయందుఁ
[పి]ండదానాదులు ఔర్ధ్వదైహిక మనంబడును. దేహాదూర్ధ్వ
[మౌ]ర్ధ్వదైహికం. దేహమునకంటె మీఁదఁ గలుగునది. ఊర్ధ్వ
[దేహే] భవ మౌర్ధ్వదైహికం. ఊర్ధ్వదేహమందుఁ గలుగునది. ౧.

[పి]తృదానం నివాప స్స్యాత్ -
నివాప్యతే నివాపః. టు వప్ బీజసంతానే. పితృదేవతలనుగూ
[ర్చి చే]యఁబడునది. ఉపసర్గవశమున నీధాతువు పితృదానార్థకము. ౧.
[దేహ]మును విడిచి పితృత్వమును బొందినవారినిఁగూర్చి చేయుజలాం
[జలి]దానము.

శ్రాద్ధం తత్కర్మ శాస్త్రతః,

శ్రద్ధయా దీయతే శ్రాద్ధం. శ్రద్ధచేత నియ్యఁబడునది. ౧.
క్తమైన దేశ కాలపాత్రాదినియమముచేత నాపితృదేవతలనుగూ
యఁబడు బ్రాహ్మణభోజనాదికము. తద్దినము.

* అన్వాహార్యం మాసికః-

పితృయజ్ఞా దన్వాహార్యత ఇతి అన్వాహార్యం. పితృయజ్ఞ
వెనుక చేయఁబడునది. ౧. మాసే మాసే క్రియత ఇతి మాసిక
నెలకు చేయఁబడునది. ౨. నెలనెలకు చేయుపిండపితృయజ్ఞ
దర్శశ్రాద్ధము.

* అంశోఽష్టమోఽహ్నః కుతపోఽస్త్రియామ్

పంచదశాంశీకృతస్య అహ్నః ద్విఘటికాత్మకః అష్టమో
కుతప ఇత్యుచ్యతే. తథా చ స్మృతిః—"రౌద్ర శ్శ్వేతశ్చ మైత్ర
థా శారభటః స్మృతః, సావిత్రో విజయశ్చైవ గాన్ధర్వః కుతప
రౌహిణేయో విరించశ్చ సోమోఽథ నిర్ఋతి స్తథా, మాహేన్ద్ర
ణశ్చైవ భటః పంచదశః స్మృత" ఇతి. పగటిని పదునేను
అం దేడుపాళ్లు పోఁగా నెనిమిదవపాలు కుతపమనంబడును.
స్మిన్ కుం భువం తపతీతి కుతపః. అ. ప్న. తపసంతాపే. సూర్యు
యందు భూమిని దపింపఁజేయును. "కుం యత్ర గోపతి ర్గోభిః కా
న తపతి క్షణే, స కాలః కుతపో నామ శ్రాద్ధం తత్ర ప్రదీయతే"

* పర్యేషణా పరీష్టి శ్చాన్వేషణా చ గవేషణా,

పర్యేష్యతేఽనయా పర్యేషణా, పరీష్టిశ్చ. ఇష గతౌ. దీనిచే
తట తిరుగఁబడును. ౧. ౨. అన్విష్యతే అనయా అన్వేషణా.
వెంటఁ దిరుగఁబడును. 3. గవేషణం గవేషణా గవేష మార్గణే.
కుట. శ్రాద్ధాదులయందు బ్రాహ్మణుని వెదుకుటపేళ్లు.

* సని స్త్వధ్యేషణా-

సన్యతేఽస్మి న్నితి సనిః. ఇ. సీ. షణు దానే. దీనిచేత
డును. ౧. అధ్యేష్యతే అధ్యేషణా. ఇష గతౌ. పూజ్యులను
చుట అధ్యేషణ. ౨. గురువులు మొదలైనపూజ్యులను సత్కా
ర్వకముగా నొకప్రయోజనమందు నియోగించుటపేళ్లు.

* యాచ్ఞాభిశస్తి ర్యాచనార్థనా.

యాచనం యాచ్ఞా, యాచనా. టు యాచృ యాచ్ఞాయాం.
౦. ౧. ౩. అభిశంసనం అభిశస్తిః. ఇ. సీ. శంసు. స్తుతౌ. స్తోత్రము
౨. అర్థన మర్థనా. అర్థ ఉపయాచ్ఞాయాం. అడుగుట. ౪.
పేళ్లు.

స్తు త్రిషు-

ఇకమీఁద నాగంతుశబ్దముదాఁక ౬ శబ్దములు త్రిలింగములు.

అర్ఘ్య మర్ఘార్థే పాద్యం పాదాయ వారిణి,

అర్ఘార్థం వారి అర్ఘ్యం పూజకొఱకైనజలము. ౧. అర్ఘమనఁ
౨. తదర్థమైనజలాదులు అర్ఘ్యమనంబడును.

క్రమా దాతి థ్యాతిథేయే అతిథ్యర్థేఽత్ర, సాధుని. 33

అతిథ్యర్థేఽత్ర సాధుని కర్మాదౌ: యథాక్రమం ఆతి
థేయశబ్దౌ వర్తేతే. ఆతిథ్యాతిథేయశబ్దములు వరుసగా నతిథుల
న యన్నాదులయందును, అతిథులయందు యుక్తమైన యాహ్వా
నములయందును వర్తించును. అతిథిభ్యః పరికల్పిత మాతిథ్యం.
కొఱకు చేయఁబడినది. ౧. అతిథీషు సాధు ఆతిథేయం. అతిథు
కుఁ దగినది. ౧.

దావేశిక ఆగన్తు రతిథి ర్నా గృహాగతే,

ఆవేశాత్ స్వగృహాత్ ఆగతః అవేశికః. తనయింటనుండి వచ్చి
౧. ఆగచ్ఛతీత్యాగన్తుః. ఉ. పు. వచ్చినవాఁడు. ౨. అతతి
గచ్ఛతీ త్యతిథిః. ఇ. పు. అత సాతత్యగమనే. ఎప్పుడు తిరుగు
౩. అతిథులపేళ్లు.

పూజా నమ స్యాపచితి స్సప ర్యా ర్చార్హణా స్సమాః. 3౪

పూజనం పూజా. పూజ పూజాయాం. పూజించుట. ౧. నమ
స్యా. నమస్కరించుట. ౨. అపచాయనం అపచితిః. ఇ. సీ.
పూజానిశామనయోః. పూజించుట. ౩. పరేణసహ వర్తతే
పరే సాధ్వీ సపర్యా. ఉత్తమగుణసహితునియందు మంచిది.
న మర్చా. అర్చ పూజాయాం. అర్చించుట. ౫. అర్హణం
అర్హ పూజాయాం. పూజించుట. ౬. పూజించుటపేళ్లు.

వస్యా తు శుశ్రూషా పరిచర్యా ప్యుపాసనా,

పరివసనం పరివస్యా. పరిచర్య సేయుట. ౧. శ్రోతు మిచ్ఛా శుశ్రూషా. శ్రు శ్రవణే. విన నిచ్ఛయించుట. ౨. పరిచరణం పరి చర గతిభక్షణయోః. సమీపమందు చరించుట. ౩. ఉప సమీ నం ఉపాసనా. ఆస ఉపవేశనే. సమీపమం దుండుట ఉపాసన శుశ్రూష పేళ్లు. చెప్పినట్లు మెలఁగుట.

* వ్రజ్యాటాట్యా పర్యటనమ్-

వ్రజనం వ్రజ్యా. వ్రజ గతౌ. తిరుగుట. ౧. పునఃపు అటాట్యా. పలుమాఱుఁ దిరుగుట. ౨. పరితః అటనం పర్యట గతౌ. అంతటఁ దిరుగుట. ౩. భిక్షాద్యర్థమై పలుమాఱు తిరుగు

* చర్యా త్వీర్యాపథస్థితిః.

చరణం చర్యా చర గతిభక్షణయోః. చరించుట. ౧. జ్ఞాయతే ఈర్యా. ఈర గతౌ. ఈర్యాయాః పన్థాః ఈర్యాపథః ద్యుపాయః; తస్మిన్ స్థితిః ఈర్యాపథస్థితిః . ధ్యానమౌనాదివ్రతము దు చాంచల్యము లేక స్థిరముగా నుండుటపేళ్లు. యతులు నిలుచుట కూర్చుండుట పరుండుట మొదలగునవి యీర్యలు. ర్గమం దుండుట యని కొందఱు.

* ఉపస్పర్శ స్త్వాచమనమ్-

ఉపస్పృశ్యంతే అఙ్గాన్యత్రేతి ఉపస్పర్శః. స్పృశ సంస్ప నియం దంగములు స్పృశింపఁబడును. ౧. ఆచమ్యతే ఉదక మ మనం. చము అదనే. ఉదకము దీనియందు పానము చేయఁబ శుద్ధాచమనము పేళ్లు.

* అథ మౌన మభాషణమ్,

మునేర్భావో మౌనం. మునియొక్క భావము మౌనము భాషణం=వ్రతములయందు మాటలాడక యుండుట.

* ఆనుపూర్వీ స్త్రియాం వావృత్పరిపాటీ అనుక్రమః. పర్యాయశ్చ

పూర్వమనుక్రమ్య తిష్ఠత్యనుపూర్వం. తస్య భావః ఆను ష్ఞ. పూర్వమును తప్పక అనుసరించియుండుట అనుపూర్వము భావము ఆనుపూర్వీ. ౧. అవ వృణమావృత్. త్రి. సీ. వృతు వ

నం పరిపాటీ. సీ. అట పట గతౌ. క్రమము. ఉపసర్గవశమున
ర్యనకు క్రమార్థత్వము. 3. అనుక్రమణ మనుక్రమః. క్రము పాద
పూర్వము ననుసరించిపోవుట. ౪. పర్యయనం పర్యాయః. ఇణ్
. స్వాధ్యాయక్రమము పేళ్లు.

అతిపాతస్తు స్యా త్పర్యయ ఉపాత్యయః,

అతిక్రమ్య పతనం అతిపాతః. పత్ ౯ గతౌ. అతిక్రమించిపోవుట
ము. ౧. ప్రాప్తం పరిత్యజ్య అయనం పర్యయః. ఇణ్ గతౌ. ప్రా
పరిత్యజించి పోవుట పర్యయము. ౨. ఉప సమీపస్థ మతిక్రమ్య
ఉపాత్యయః. ఇణ్ గతౌ. సమీపమం దుండుదాని నతిక్రమించి
ఉపాత్యయము. 3 క్రమముతప్పుట. విడిపడుట.

యమో వ్రత మస్త్రీ త చ్చోపవాసాది పుణ్యకమ్. 32

నియమ్యత ఇతి నియమః. యము ఉపరమే. శాస్త్రముచేత ని
పఁబడునది. ౧. వ్రత్యతే అన్నాదిక మనేనేతి వ్రతం.అ.న్న. వ్రతీ
అన్నాదులు దీనిచేత విడువఁబడును. ౨. పుణ్యహేతుత్వాత్ పు
పుణ్యహేతువు. 3. శాస్త్రవిహిత మైననియమము వ్రతమనఁ
. ఉపవాసాదిరూపమైనయీ వ్రతము పుణ్యక మనంబడును.

పవస్తం తూపవాసః-

ఉప సమీపే వసనం ఉపవస్తం. ఉపవాసశ్చ. అగ్నిసమీపమం
ట ఉపవస్తము. ఉపవాసము. పా. ఔపవస్తం. ౧. ౨. యజమా
గ్నిసమీపమం దాచరించు ననశనవ్రతముపేళ్లు. ఉపవాసమాత్ర
ను పేళ్లు.

వివేకః పృథగాత్మతా,

పృథగాత్మతా ప్రకృతిపురుషయోర్విభాగేన జ్ఞానం వివేక ఇత్యు
ప్రకృతిపురుషులు వేఱని యెఱుఁగుట. వివేచనం వివేకః. విచిర్
గ్భావే. ప్రకృతిపురుషుల నేర్పఱచుట.

స్యా ద్బ్రహ్మవర్చసం వృత్తాధ్యయనర్ధిః-

౧. వృత్తాధ్యయనర్ధిః. వృత్త=మంచియనుష్ఠానముయొక్కయు,
యనః=వేదపాఠముయొక్కయు, ఋద్ధిః=సమృద్ధి బ్రహ్మవర్చస మ
ను. బ్రహ్మణః తపస్స్వాధ్యాయాదే ర్వర్చః తేజో బ్రహ్మవర్చసం.

బ్రహ్మ మనఁగా అనుష్ఠానము, స్వాధ్యాయంబును. అందువల్ల
జన్ను బ్రహ్మవర్చనము.

* అథాఙ్జలిః.

పాఠే బ్రహ్మాఞ్జలిః-

బ్రహ్మణే వేదా యాంజలిః బ్రహ్మాఞ్జలిః. బ్రహ్మమనఁగా
ము. దానికొఱకుఁ జేసినయంజలి. ౧. వేదపాఠమందు మ్రొక్క
మోడ్చినయంజలి.

* పాఠే విప్రుషో బ్రహ్మబిన్దవః,

బ్రహ్మణి వేదపాఠే బిందవః బ్రహ్మబిందవః. ఉ. పు.
మందలి తుంపురులు. ౧. వేదము చదువునప్పుడు నోట వెడల
పురులు.

* ధ్యానయోగాసనే బ్రహ్మాసనమ్-

బ్రహ్మణే ఆసనం బ్రహ్మాసనం. బ్రహ్మకొఱకైనయాసనమ
ధ్యానమందును యోగమందును జేయఁబడు స్వస్తికము, ప
మొదలైనయాసనముల పేళ్లు.

* కల్పే విధి క్రమౌ,

కల్ప్యతేఽనేన కల్పః. క్లృపక్లృప్తౌ. దీనిచేత విధింపఁబడును.
యతే అనేన విధిః. ఇ.పు. విధ విధానే. దీనిచేత విధింపఁబడును.
మ్యతేఽనేనేతి క్రమః. దీనిచేత ప్రక్రమింపఁబడును. 3. ఇది యీ
ముగాఁ జేయవలె ననువేదోక్తవిధానముపేళ్లు.

* ముఖ్య స్స్యా త్ప్రథమః కల్పః-

ముఖమివ ప్రధానత్వాత్ ముఖ్యః. ప్రధానమైనవిధి. ప్ర
ఆద్యః కల్పః విధిః. 'వడ్లతో వేల్పుము' ఈ మొదలగువిధముగా
టఁ జెప్పిన విధిపేరు.

* అనుకల్ప స్తతోఽధమః,

అను పశ్చా త్కల్ప్యత ఇతి అనుకల్పః. వెనుక విధింపఁబ
తతః=ఆ మొదటిదానికంటె, అధమః=తక్కువైనది. 'వడ్లు దొ
నీవారాదులైనఁజాలును' అనునట్లు వెనుకఁజెప్పిన విధిపేరు.

* సంస్కారపూర్వం గ్రహణం స్యా దుపాకరణం శ్రుతేః,

సంస్కారః ఉపనయః తత్పూర్వకం శ్రుతే ర్వేదస్య గ్రిహణం ఉ
మిత్యుచ్యతే. సంస్కారమనఁగా నుపనయనము. అది మొదలు
కము. జదువదొరకొనుట ఉపాకరణమనంబడును. ఉపాక్రియతే
తే శ్రుతి రనే నే త్యుపాకరణం. డుకృఞ్ కరణే. వేదము దీని
కరింపఁబడును. ౧. సంస్కారపూర్వక మైనవేదగ్రహణము.
మే తు పాదగ్రహణ మభివాదన మి త్యుభే,
పాదయోర్గ్రిహణం పాదగ్రహణం. గ్రహ ఉపాదానే. పాదము
కొనుట. ౧. అభివాద్యతే ఆశీర్వాదః క్రియతే అనేనే త్యభివా
నది అభివాదనము త్సోక్తః. దీనిచేత ఆశీర్వదింపఁబడును. ౨. గోత్ర
ములఁ జెప్పి మ్రొక్కుటపేళ్లు.
క్షుః పరివ్రాట్ కర్మన్దీ పారాశర్యపి మస్కరీ. ౪౧
భిక్షతే భిక్షుః ఉ. పు. భిక్ష భిక్షాయాం. అడుగువాఁడు. ౧. పరి
సర్వం వ్రజతీతి పరివ్రాట్. జ. పు. వ్రజ గతౌ. అన్నిటిని బరిత్యజిం
వాఁడు. ౨. కర్మందఋషి ప్రోక్తసూత్ర మధీత ఇతి కర్మందీ. న.
ర్మందుఁ డనుఋషి. చెప్పినసూత్రముల నధ్యయనము చేయువాఁ
. పారాశర్యప్రోక్తసూత్ర మధీతే పారాశరీ. న. పు. వేదవ్యాసులు
సూత్రముల నధ్యయనము సేయువాఁడు. ౪. మస్కరో వేణు
. సోఽస్యాస్తీతి మస్కరీ. న. పు. మస్కరమనఁగా వెదురుగడ.
వాఁడు. మా కరణశీలః కామ్యకర్మప్రతిషేధపరోవా మస్కరీ. కా
ర్మములను బ్రతిషేధించుస్వభావముగలవాఁడు. ౫. సంన్యాసిపేళ్లు.
పస్వీ తాపసః పారికాఙ్క్షీ -
తపోఽస్యాస్తీతి తపస్వీ. న. పు. తాపసశ్చ. తపస్సుగలవాఁడు.
పరం బ్రహ్మజ్ఞానం కాంక్షత ఇతి పారికాంక్షీ. న. పు. పరమనఁగా
జ్ఞానము. దానిని గోరువాఁడు. 3. తపస్సుగలవాఁడు.
వాచంయమో మునిః,
వాచం నియచ్ఛతీతి వాచంయమః. యమ ఉపరమే. వాక్కును
వాఁడు. ౧. మన్యతే మునిః. ఇ. పు. మన జ్ఞానే. జ్ఞానముగలవాఁడు.
మౌనవ్రతముగలవానిపేళ్లు. ఈ ౧౦ యు సన్న్యాసిపేళ్లని కొందఱు.
తపఃక్లేశసహో దాన్తః-

దామ్యతి ఇంద్రియేభ్య ఇతి దాంతః. దము ఉపశమే. ఇ
ములవలన నుపశమించువాఁడు. తపమువలనికష్టము నోర్చువాఁడు

* వర్ణినో బ్రహ్మచారిణః.

వర్ణా ఏషాం సంతీతి వర్ణినః. న. పు. స్తుతులు (బ్రాహ్మ
ర్ణములు) గలవారు. ౧. బ్రహ్మ వేదాధ్యయనవ్రతం చరంతీతి
చారిణః. న. పు. చర గతిభక్షణయోః. బ్రహ్మమనఁగా వేదా
వ్రతము. దాని నాచరించువారు. ౨. బ్రహ్మచారిపేళ్లు.

* ఋషయ స్సత్యవచసః-

జ్ఞానస్య పారగమాత్ ఋషిః. ఇ.పు. ఋ గతౌ. జ్ఞాన
కు పారమునుబొందినవాఁడు. ౧. సత్య వచో యేషాం తే సత్య
స. పు. సత్యమైనవాక్కులు గలవారు. ౨. ఋషులపేళ్లు.

* స్నాతక స్త్వాప్లుతో వ్రతీ,

వ్రతార్థం స్నాతీతి స్నాతకః. ష్ణా శౌచే. వ్రతముకొఱకు స్నా
చేయువాఁడు. ౧. గంగాదిపుణ్యతీర్థేషు ఆప్లవతే ఆప్లుతః. ప్లు
గంగాదిపుణ్యతీర్థములయందు స్నానముచేయువాఁడు. ౨. వేదా
ముచేసినపిమ్మట ఆశ్రమాంతరమునకుఁ బోక వ్రతయుక్తుఁడై
శీలుఁడై యుండు బ్రహ్మచారిపేళ్లు.

* యేనిర్జితేన్ద్రియగ్రామా యతినో యతయశ్చ తే.

యతం ఇంద్రియసంయమః ఏషా మ స్తీతి యతినః. న. పు.
యనియమముగలవారు. ౧. యచ్ఛంతి ఇంద్రియేభ్య ఇతి యతయః.
యమ ఉపరమే. ఇంద్రియములవలనఁ జాలించినవారు. ౨.జయిం
యింద్రియసమూహముగలవారిపేళ్లు.

* యః స్థణ్డిలే వ్రతవశా చ్ఛేతే స్థణ్డిలశా య్యసౌ,
స్థాణ్డిలశ్చ-

స్థండిలే శేతే స్థండిలశాయీ. న. పు. స్థాండిలశ్చ. స్థండిల
తృణాదులచేఁ గప్పఁబడినభూమి, దానియందుఁ బరుండువాఁడు. ౧.
వ్రతవశమున భూమియందుఁ బరుండువానిపేళ్లు.

* అథ విరజ స్తమస స్స్యు ర్ద్వయాతిగాః.

రజ స్తమోగుణములు లేక కేవలసా త్త్వికులయినవారు ద్వ

నబడుదురు.ద్వయం రజ స్తమోగుణా వతీత్య గచ్ఛంతీతి ద్వయా
అ. పు. రజ స్తమోగుణములు రెంటి నతిక్రమించినవారు. ౧.
విత్రః ప్రయతః పూతః-
పూయ తేఽనేన పవిత్రః. పూతశ్చ. పూఞ్ పవనే.వీనిచేతఃబవిత్ర
యఃబడును. ౧.౩. ప్రయచ్ఛతి ఉపరమతీంద్రియేభ్య ఇతి ప్రయతః.
ఉపరమే. ఇంద్రియములవలన మరలినవాఁడు. ౨. ఈ౩ను శుచి
నిపేళ్లు.

పాషణ్డా స్సర్వలిఙ్గినః,
కౌపీనం ఖణ్డితం వాస స్త్రిషు కక్ష్యా పుటీ తథా,
ప్రజ్యా తు పరివ్రజ్యా తపస్వీ తు తపస్వినః.)
పాశాః సంసృతిబంధహేతుభూతాని అసచ్ఛాస్త్రాణి అణంతి
పామండాః. అ.వ్న.అణ శబ్దే. సంసారబంధహేతుభూతములైన
శాస్త్రములను బలుకువారు.౧. సర్వేషా మాశ్రమాణాం లింగాని
ఇతి సర్వలింగినః. న. పు. సర్వాశ్రమ చిహ్నములు గలవారు.
దబాహ్యులైనబౌద్ధకాపాలికక్షపణకాదులపేళ్లు.
పాలాశో దణ్డ ఆషాఢో వ్రతే.
అషాఢాసు జాతః ఆషాఢః. పూర్వాషాఢాది నక్షత్రములయం
పుడి. ౧. పాలాశః. దణ్డః. బ్రహ్మచర్యాదివ్రతమందుఁ బట్టుమో
కోల.

రామ్భ స్తు వైణవః. ౮౫

రంభాశబ్దేన వంశోఽభిధీయతే రంభాయావికారో రాంభః.రంభయ
వెదురు. దానిచేతనైనది రాంభము. వ్రతమందలి వెదురుకోల.
స్త్రీ) కమణ్డలుః కుణ్డీ-
కం జలం అండే మధ్యే లాతీతి కమండలుః. ఉ. వ్న. లా ఆదానే.
జను మధ్యమందు గ్రహించునది. ౧. కుండవద్వృత్తత్వాత్
ఈ. సీ. కుండవలె వట్రువగానుండునది. ౨. కమండలువుపేళ్లు.

వ్రతినా మాసనం బృసీ,
బ్రువంతోఽస్యాం సీదంతీతి బృసీ. ఈ. సీ. బ్రూఞ్ వ్యక్తాయాం
షద్౯ విశరణగత్యవసాదనేషు. చదువుచు దీనియందుఁ గూర్చుం

దురు. పా. బ్రషీ. "వసా తసీ బ్రసీమాంసీ" అని దంత్యాంతము
దు చంద్రగోమి. "గండూషా మంజుషా బ్రషీ" అని మూర్ధ
ములయందు కారిక. ౧. వ్రతస్థులు కూర్చుండుదర్భాద్యాసనము

* అజినం చర్మ కృత్తిః స్త్రీ-

అజ్యతే క్షిప్యత ఇతి అజినం. అజ గతిక్షేపణయోః. వే
నది. ౧. చరతి కటిప్రదేశమితి చర్మ. న.న. చరగతిభక్షణయోః.
శమును బొందునది. ౨. కృత్యతే కృత్తిః. ఇ. సీ. కృతీ ఛేద
యఁబడునది. ౩. మృగచర్మ మొదలగుదానిపేళ్లు.

* భైక్షం భిక్షాకదమ్బకమ్.

భిక్షాణాం సమూహో భైక్షం. భిక్ష. మెత్తినపదార్థము
భైక్షము. ౧. భిక్షాద్రవ్యముపేరు.

* స్వాధ్యాయ స్స్యాజ్జపః-

స్వవేదాధ్యయనం స్వాధ్యాయః. తమవేదము నధ్య
యుట స్వాధ్యాయము.౧. జపనం జపః. జప వ్యక్తాయాం వాచి.
ట. పా. జాపః. ౨. తా నేశాఖలోనివాఁడో ఆవేదముయొక్క
యనముపేరు. పలుమాఱు వేదముఁ జదువుట యని కొందఱు.

* సుత్యాభిషవ స్సవనం చ సా,

సున్వన్త్యస్యాం సోమలతా మితి సుత్యా, అభిషవః,
చ. షుఞ్ అభిషవే. దీనియందు సోమలతను బిండుదురు. ౧.
స్నానమునకును, సోమలతను దంచుటకును పేళ్లు.

* సర్వైనసా మపధ్వంసి జప్యం త్రి ష్వఘమర్షణమ్.

అఘం మృష్యతే అనేన అఘమర్షణం. త్రి. మృష
యాం. దీనిచేత పాపము చెఱుపఁబడును. అఘమర్షణీ ఋక్.
ర్షణో మంత్రః. ౧. సర్వపాపములను బోఁగొట్టుటకు జపించుమంత్ర

* దర్శశ్చ పౌర్ణమాసశ్చ యాగౌ పక్షాన్తయోః పృథక్,

పక్షాంతయోః= పక్షాంతము లైనయమావాస్యాపూర్ణిమల
దుఁ జేయఁబడుయాగములు. పృథక్ =వేఱుగా- దర్శము, పౌర్ణమా
అనంబడును. దర్శే విహితో యాగః దర్శః. అమావాస్యయు
యఁబడుయాగము దర్శము. ౧. పౌర్ణమాస్యాం విహితో యా

...  పూర్ణిమయందు విహితమైనయాగము పౌర్ణమాసము. ౧.
...సాధనాపేక్షం నిత్యం య త్కర్మ తదృమః. ౪౮
...యమ్యతే చిత్త మనేన యమః. యమ ఉపరమే. దీనిచేత మన
...బడును. ౧. శరీరమాత్రమునే సాధనముగా నపేక్షించుచు
...నము చేయఁదగిన సత్యాహింసా సంధ్యాదులు.
నియమస్తు స యత్కర్మా నిత్య మాగ న్తు సాధనమ్,
నియమ్యతే పురుషోఽనే నేతి నియమః. యమ ఉపరమే. పురుషుఁ
...చేత నియమింపఁబడును. ౧. శరీరముకంటె బాహ్యము లైనమృ
...లు సాధనముగా గలిగి నిత్యము సేయవలయు నను నిర్బంధములే
...తపస్స్వాధ్యాయదేవతా నమస్కారాదులు. (కొందఱిచట "ష్ణా
...శ ద్రాకరణం ముండనం వపనం తథా" అనుదానిం జదివెదరు. ఇది
...ట్టీయటీకాసర్వస్వాదులయం దెచ్చటను వ్యాఖ్యాతము కాకుం
... బ్రక్షిప్తమని తోఁచుచున్నది.)
ఉపవీతం యజ్ఞసూత్రం ప్రోద్ధృతే దక్షిణే కరే. ౪౯
ఉపవీయతే వామస్కంధోఽనేనేతి ఉపవీతం. వ్యేఞ్ సంవరణే.
...జము దీనిచేతఁ గప్పఁబడును. ౧. కుడిచేయి తొడఁగఁబడుచుం
...డమభుజముమీఁద నుండు జన్నిదము.
ప్రాచీనావీత మన్యస్మిన్-
ఆవీయతే ఆవీతం. ప్రాచీనం చ త దావీతం చ ప్రాచీనావీతం.
సంవరణే. ప్రాచీనమై దక్షిణభుజమందుఁ గప్పఁబడునది.౧.ఎడమ
తొడఁగఁబడుచుండఁగా కుడిభుజముమీఁద నుండు జన్నిదము.
నివీతం కణ్ఠలమ్బితమ్,
నియతం వీయతేస్మ నివీతం. నియతముగాఁ గప్పఁబడునది.౧.కణ్ఠే
౦. మెడలోఁ బూసలదండవలె వ్రేలాడుజన్నిదము.
...గుళ్యగ్రే దైవం తీర్థమ్-
వ్రేళ్లకొనల యందు దేవసంబంధ మైనతీర్థ ముండును. దానిచే
...ణము సేయవలె ననుట. తీర్యతే పాప మనేనేతి తీర్థం. తౄ ప్లవ
...రణయోః. దీనిచేఁ బాపము తరింపఁబడును. దేవానా మిదం దై
...దేవతలసంబంధ మైనతీర్థము.

* స్వల్పాఙ్గుళ్యో ర్మూలే కాయమ్.

స్వల్పాంగుళ్యోర్మూలే = చిటికెనవ్రేలు దర్భవ్రేలు వీని
కాయం=ఋషితీర్థ ముండును. కః ప్రజాపతిర్దేవతాఽస్యకాయం
స్త్యాదిప్రజాపతులు దేవతలుగాఁగలిగినది. పులస్త్యాదిప్రజాప
షులుగనుక ఆప్రదేశములవలననే ఋషితర్పణము సేయవలెనను

* మధ్యేఽఙ్గుష్ఠాఙ్గుళ్యోః పైత్రమ్-

అంగుష్ఠాంగుళ్యోర్మధ్యే= పెద్దవ్రేలు జుట్టనవ్రేళ్లనడుమ,
=పిత్ర్యమైనతీర్థముండును. దానిచేత పితృతర్పణము సేయవలె న
తౄణా మిదం పైత్రం. పితృసంబంధమైనది పైత్రము. ౧.

* మూలే త్వఙ్గుష్ఠస్య బ్రా

అంగుష్ఠస్యమూలే = పెద్దవ్రేలిమొదట, బ్రాహ్మం = బ్ర
ధమైన తీర్థముండును. బ్రహ్మణఇదం బ్రాహ్మం. బ్రహ్మసంబం
దానిచేతనే బ్రహ్మతర్పణము సేయవలె ననుట. ౧.

* స్యాద్బ్రహ్మభూయం బ్రహ్మత్వం బ్రహ్మసాయుజ్య మిత్యపి.

బ్రహ్మణో భావః బ్రహ్మభూయం, బ్రహ్మత్వం చ. బ్ర
బ్రహ్మభూయము, బ్రహ్మత్వము. ౧. ౨. సయుక్ సంబంధీ తస్య
సాయుజ్యం. బ్రహ్మణః సాయుజ్యం బ్రహ్మసాయుజ్యం. బ్రహ్మము
యుట బ్రహ్మసాయుజ్యము. ౩. బ్రహ్మభావము నొందుటపేళ్లు.

* దేవభూయాదికం తద్వత్ -

ఈప్రకారముగానే దేవభూయము, దేవత్వము, దేవసా
ము. దేవతలయందుఁ గలియుట పేళ్లు. ఆదిశబ్దముచేత రా
రాజత్వ, రాజసాయుజ్యాదులు గ్రహింపఁబడుచున్నవి.

* కృచ్ఛ్రం సాంతపనాదికమ్,

"త్ర్యహం ప్రాతస్త్ర్యహం సాయంత్ర్యహ మద్యాదయా
త్ర్యహం పరం చ నాశ్నీయాత్ కృచ్ఛ్రం సాంతపనంస్మృతం" మ
దినములు పగలు భోజనముచేసి మూఁడుదినములు రాత్రులయం
జనముచేసి మూఁడుదినములు అడుగకవచ్చినపదార్థమును
మూఁడుదినములు కేవలము ఉపవాస ముండిన నావ్రతము సా
మనంబడును. అది మొదలగు చాంద్రాయణ ప్రాజాపత్యాదు

ంబుకృచ్ఛ్రి మనంబడును. సంతపనే భవం సాంతపనం. సంతాపము
నైనది గనుక సాంతపనము. కృన్తతి పాప మితి కృచ్ఛ్రం. కృతీ
. పాపమును బోఁగొట్టునది. ౧.

ంన్యాసవ త్యనశనే పుమాన్ప్రాయః-
ప్రకృష్ట మేతి పుణ్యలోక మనేనేతి ప్రాయః. అ. పు. ఇణ్ గతౌ
ప్రకృష్టముగాఁ బుణ్యలోకమును బొందుదురు. ౧. 'ప్రాయః'అని
ంతనపుంసక మనునం దేహము గలుగకుండుటకై 'పుమాన్' అను
ప్రాయోపవేశనమలి ర్న్నృపతి ర్బభూవ" అని రఘువంశమందు అ
క్తప్రయోగము. ౧. సంగపరిత్యాగము చేసి ప్రాణపరిత్యాగ
మము ఆహారము లేకుండ నుండుట.

అథ వీరహా. ౫౨

ష్టాగ్నిః-
వీర మగ్నిం హతవాన్ వీరహా. న. పు. హన హింసాగత్యోః.
నఁగా నగ్ని, అగ్నిని విడిచినవాఁడు. ౧. నష్టోఽగ్నిర్యస్యసః నష్టాగ్నిః.
నష్ట మైనయగ్నిగలవాఁడు. ౨. ప్రమాదాదులచే నశించినయగ్ని
నిపేరు. ఉత్సన్నేష్టిఁ జేసి గార్హపత్యాగ్నిని విడిచినవాఁ డనికొందఱు.

కుహనా లోభా న్మిథ్యేర్యాపథకల్పనా,

లోభాత్=అన్నాదికాంక్షవలన, మిథ్యేర్యాపథకల్పనా. అసత్య
యీర్యయనెడు భిక్షుధర్మముయొక్క మార్గమును కల్పించుకొను
హన యనంబడును. కుహతీతి కుహనా. కుహ విస్మాపనే. మోస
నది. ౧. అన్నాదులకొఱకై డంబముగా ధ్యానమౌనవ్రతాదుల
వేసముతో దిరుగు టక్కరిసన్న్యాసి.

వ్రాత్య స్సంస్కారహీన స్స్యాత్ -
వ్రాతం స్తోమమర్హతీతి వ్రాత్యః. ప్రాయశ్చిత్తార్థమై సమూహ
గూర్ప నర్హమైనవాఁడు. వ్రతం ప్రాయశ్చిత్త మర్హతీతి వ్రాత్యః.
మనఁగాఁ బ్రాయశ్చిత్తము. దాని కర్హుఁడైనవాఁడు. ౧. ఉపన
దిసంస్కారహీనుఁడైనవాఁడు.

అస్వాధ్యాయో నిరాకృతిః. ౫౩

న విద్యతే స్వాధ్యాయో యస్య సః అస్వాధ్యాయః. వేదాధ్య

యనము లేనివాఁడు. ౧. నిరాక్రియత ఇతి నిరాకృతిః. ఇ. శ
శూన్యుఁడని నిరాకరింపఁబడువాఁడు. ౨. వేదము చదువనివాని
* ధర్మధ్వజే లిఙ్గవృత్తిః-
ధర్మస్య ధ్వజ శ్చిహ్నం మస్యేతి ధర్మధ్వజీ. న. పు. ధర్మ
క్కుచిహ్నముగలవాఁడు. ౧. లింగం చిహ్నం వృత్తిర్జీవనమస్యే
వృత్తిః. ఇ. పు. చిహ్నమే జీవనముగాఁ గలవాఁడు. ౨. దం
జటాదిచిహ్నములు ధరించుకొని దానివలన బ్రతుకువానిపేళ్లు.
* అవకీర్ణీ క్షతవ్రతః,
అవకీర్ణం వ్రత మస్యాస్తీతి అవకీర్ణీ. న. పు. కృా విశే పే.
తముగలవాఁడు. ౧. పరస్త్రీగమనాదులచేత నష్ట మైనబ్రహ్మ
వ్రతము గలవాఁడు.
* సుప్తే యస్మి న్నస్త మేతి సుప్తే యస్మి న్నుదేతి చ.
అంశుమా నభినిర్ముక్తాభ్యుదితౌ తౌ యథాక్రమమ్,
యస్మిఁ ద్విజే సుప్తే సతి అంశుమా న స్త మేతి. యస్మి
జే సుప్తే సతి అంశుమా నుదేతి చ, తౌ యథాక్రమం అభిని
దితనామానౌ భవతః. ఏద్విజుఁడు నిద్రపోవుచుండఁగా సూర్యు
మించునో ఆద్విజుఁడు 'అభినిర్ముక్తుఁ' డనంబడును. ఏద్విజుఁడు
వుచుండఁగా సూర్యుఁ డుదయించునో వాఁడు 'అభ్యుదితుఁ' డ
ను. యం సుప్త మభిభూయ నిర్మఇచ్ఛతి సూర్య స్సోఽభినిర్ముక్త
ద్రించువాని తిరస్కరించి సూర్యుఁ డస్తమించునోవాఁడు అభిని
౧. యంసుప్తమభిభూయ ఉదేతి సూర్యః సోఽభ్యుదితః. ఎవ్వా
స్కరించి సూర్యుఁ డుదయించునో వాఁ డభ్యుదితుఁడు.
* పరివేత్తానుజోఽనూఢే జ్యేష్ఠే దారపరిగ్రహాత్.
జ్యేష్ఠ అనూఢే = తోడఁబుట్టినయన్న పెండ్లాడకుండఁగా,
జః=తమ్ముఁడు, దారపరిగ్రహాత్ =పెండ్లాడుటవలన, పరివేత్తా=
యనంబడును. పరిత్యజ్య జ్యేష్ఠం వధూం విందతీతి పరివేత్తా.
విద్ ళు లాభే. అన్నను విడచి అనఁగా అన్నకంటె ముందుగా పె
వాఁడు. ౧.
* పరివి త్తి స్తు తజ్జ్యాయాన్,

…మిదేసియిండ్లు (గడులు) గలది. ౧. శారీణాం ఫలం శారిఫలం.
…రె లుండు పలక. ౨. నెత్త (జూద) మాడుపలకపేళ్లు.

ప్రాణిద్యూతం సమాహ్వయః,

…ప్రాణీనాం ద్యూతం ప్రాణిద్యూతం. ప్రాణులయొక్క ద్యూతము. …మాహూయంతే స్పర్ధయా జనా అత్రేతి సమాహ్వయః. హ్వే …స్పర్ధాయాం శబ్దే చ. స్పర్ధచేత జనులు దీనియందు పిలువఁబడు …౧. కోడిపందెము మొదలయినదాని పేళ్లు.

…క్తా భూరిప్రయోగత్వా దేకస్మి న్యేఽత్ర యౌగికాః. ౮౬
…ద్ధర్మ్యా దన్యతో వృత్తా వూహ్యా లిఙ్గాన్తరేఽపి తే,

టీక. అత్ర=ఈశూద్రవర్గమందు, యే=ఏ, యౌగికాః=యౌగిక …మాలాకార మార్దంగిక వైణవిక కర్మకర నియోజ్య చౌరా…దిశబ్దములు, భూరిప్రయోగత్వాత్=ప్రయోగబాహుళ్యము గల …వలన, ఏకస్మిన్ = ఒకపుంలింగమందే, ఉక్తాః=చెప్పఁబడినవో, …శబ్దములు, తాద్ధర్మ్యాత్ = ఆయాక్రియాయోగమువలన, అన్య…త్ర=స్త్ర్యాదులయందు వర్తించునప్పుడు, లింగాంతరేఽపి=స్త్రీ …నపుంసకలింగములయందు, ఊహ్యాః=ఊహింపఁదగినది. మా…రీ స్త్రీ, మాయాకారం కులం ఇత్యాదులు. అయౌగికములై …వాచకములైన కరణ మాలిక కుంభకారాదిశబ్దములును శూద్రాది…లవలె పుంలింగ స్త్రీలింగములయందును వర్తించునని ఫలితార్థము.

శూద్రవర్గము సమాప్తము.

…త్యమరసింహకృతౌ నామలిఙ్గానుశాసనే,
…భూమ్యాదికాణ్డో ద్వితీయ స్సాఙ్గ ఏవ సమర్థితః.

… అమరసింహకృతౌ=అమరసింహునికృతియగు, నామలింగానుశా…నామలింగానుశాసనమను నీకోశమందు, ఇతి=ఇట్లు, అయమ్=ఈ, …యః = రెండవదియైన, భూమ్యాదికాణ్డః=భూమిమొదలగువానివర్గ…కాండ (సమూహ) ము, సాఙ్గ ఏవ=సమగ్రముగానే, సమర్థితః=…ఁబడినది.

ద్వితీయకాండము.

---

శ్రీ ర స్తు.

నామలింగానుశాసన మను శ్రీ మదమరసింహవిరచితం శైవ

# అ మ ర కో శ ము

సంస్కృతాంధ్ర వ్యాఖ్యానసహితము.

తృ తీ య కా ం డ ము.

---

## విశేష్యనిఘ్న వర్గము.

అవ.—ఏవం కాణ్డద్వయేన తత్తల్లోక ప్రతినియతార్థాని న్యనుశిష్య, సంప్రతి సాధారణం కాణ్డాన్తర మారభమాణః, వత్ప్రివృత్తిసిద్ధయే వక్ష్యమాణవర్గాణ తేషాం పూర్వకాణ్డో స్సంబంధం చ దర్శయతి విశేష్యనిఘ్నై. రిత్యాదినా—ఇట్లు రెం డములచేత నాయాలోకములయందలి ప్రసిద్ధము లైననామములు యిప్పుడు వాని కన్నిటికి సాధారణ మైనమఱియొక కాండమును భించువాఁడై చదువుకొను వారలకు సుఖముగాఁ దెలియుటకొఱకు డమునందుఁ జెప్పఁగలవర్గములను, ఈవర్గములకుఁ బూర్వకాం యందలివర్గములతోఁ గలసంబంధమును 'విశేష్యనిఘ్నైః' అ మొదలగువానిచేఁ జక్కఁగాఁ జెప్పుచున్నాఁడు—

విశేష్యనిఘ్నై స్సంకీర్ణై ర్నానార్థై రవ్యయై రపి,
లిఙ్గాదిసంగ్రహై ర్వర్గా స్సామాన్యే వర్గసంశ్రయాః.

సామాన్యే = పూర్వకాండలకు సాధారణ మైనయీము కాండమునందు, విశేష్యనిఘ్నైః = విశేష్యాధీనము లైనసుకృతి త్ప్రభృతిశబ్దములచేతను, సంకీర్ణైః=పరస్పరవిరుద్ధము లైనకర్మ ణపరస్పర ప్రభృతిశబ్దములచేతను, నానార్థైః = అనేకార్థములైన దిశబ్దములచేతను, అవ్యయైరపి = అవ్యయము, లైన ఆజాదుల

గ్రహైః='స్త్రీభూమిూదూద్వేరామైకాచ్'అనునది మొదలైన
గ్రహములచేతను, ఆదిశబ్దముచేత, లంకా, శేఫాలికా, టీకా,
మొదలైననామసంగ్రహములచేతను, వర్గాః=(చెప్పఁబడు) వి
న్నాదివర్గములు, వర్గసంశ్రయాః = పూర్వకాండోక్తవర్గములనే
యించినవి. ఎట్లనఁగా—సుకృతి ప్రభృతిశబ్దములు స్వర్గాదివి
లొాటచేతను, కర్మాదులు తద్వ్యాపారములొాటచేతను, నాకా
చ్యాచకములొాటచేతను, అజాదులు తదపథ్యవధిమద్భావాదిదో
లొాటచేతను, స్త్రీయా మీ. మూ దిత్యాదులు తల్లింగప్రతిపాదక
టచేతను, నీకాండము సామాన్యకాండ మనఁబడును. టీకాస
రః.—వర్గసంశ్రయా ఇత్యత్ర అర్థాన్తరం. వర్గసంశ్రయాః, వర్గా
ంతరవర్గాణాం సంశ్రయా ఆశ్రయభూతాః. తథాహి—నా
కాంతాదయో బహవో వర్గాః. అవ్యయవర్గే చ నానార్థప
భేదేన ద్వౌ వర్గౌ. లింగాదిసంగ్రహే చ స్త్రీలింగాదివర్గా ఇతి.
ప్రథమద్వితీయవర్గయోః అవాంతరవర్గసంశ్రయత్వాభావేఽపి.
ల్యేన వ్యపదేశా భవంతీతి న్యాయేన తథా త్వవ్యపదేశ ఉపపన్న
ర్యం. 'వర్గసంశ్రయాః' అనుచోట తమలో నవాంతరవర్గలుగలవి
ర్థాంతరము. ఎట్లనిన—నానార్థవర్గయందు కాంతాదివర్గలును,
వర్గయందు అవ్యయవర్గావ్యయనానార్థవర్గలును, లింగాదిసం
గ్రయందు స్త్రీలింగవర్గాదులు నని తెలియఁదగినది. మొదటి
ర్గలయందు నవాంతరవర్గములు లేకున్నను 'బాహుళ్యేన వ్యప
భవంతి' యనున్యాయముచేతఁ జెప్పినాఁడు.

టీ. స. అత్రేద మనుసంధేయం. ఇహ సామాన్యకాండే భూయ
పః లుప్తసుపశ్చేతి ద్వివిధా శ్శబ్దాః ప్రతిపాదయిష్యంతే అత్ర
దనన్తరం ఆదౌ సుబంతా ఏవవక్తవ్యాః. తే చ పర్యాయరూపా
ర్థాశ్చేతి ద్విప్రకారాః. కాణ్డద్వయేపర్యాయనిరూపణప్రస్తావా
ర్థ్యాః ప్రాక్ పర్యాయా ఏవ వక్తవ్యాః. తత్రాపి విశేష్యనిఘ్న
పసంగ్రాహక క్రోడీకృతత్వాత్ విశేష్యనిఘ్నపదానా మతథా
ర్యః ప్రాజ్ఞ్నిరూపణం. తదనంతరం విప్రకీర్ణార్థపర్యాయజాతస్య
నా. తతః భూయమాణసుబంతత్వసాధర్మ్యాత్ నానార్థశబ్దా

నా మతథాభూతేభ్యః అవ్యయేభ్యః ప్రజ్ఞిరూపణం. తతః
నాం. తత స్సర్వశేషత్వా ల్లింగసంగ్రహా స్యేతి వర్గనిర్దేశక్రమ

అవ.—అస్మిన్వర్గే లిఙ్గజ్ఞానోపాయ మాహ.—"ప్రాయ
భేదేన" యను పూర్వవిధిచే నిచట లింగ మెఱుఁగ వీలు లేదు
నీవర్గమున లింగమును తెలిసికొను నుపాయమును జెప్పుచున్నా

* స్త్రీదారాద్యై ర్యద్విశేష్యం యాదృశైః ప్రస్తుతం పదైః
గుణద్రవ్యక్రియాశబ్దా స్తథా స్యు స్తస్య భేదకాః.

యాదృశైః=ఏలింగము గలవైన, స్త్రీదారాద్యైః ప
దారకళత్రాది పదములచేత, యద్విశేష్యం=ఏవిశేష్యమైన
ప్రస్తుతం=ఉపక్రమింపఁబడెనో, తస్య=ఆవిశేష్యమునకు, భేదకా
ణములైన,గుణద్రవ్యక్రియాశబ్దాః=గుణవాచకద్రవ్యవాచకక్రి
కశబ్దములు, తథా స్యుః=ఆవిశేష్యలింగము గలవే యగును. అ
శేష్య మేలింగముగలదై ప్రక్రమింపఁబడునో, గుణద్రవ్యక్రియా
లైనసుకృత్యాదివిశేషణములును, ఆలింగము గలవే యగు నని
ము. "ప్రవీణా స్త్రీ, ప్రవీణా దారాః, ప్రవీణం కళత్రం" అని గు
ములకును, "ధనినీ స్త్రీ, ధనినో దారాః, ధని కళత్రం" అని ద్ర
విశేషణములకును, "క్షేమంకరా స్త్రీ, క్షేమంకరాః దారాః, క్షే
కళత్రం" అని క్రియావాచకవిశేషణములకును నుదాహరణము

టీ. స. అత్ర ప్రథమోద్దిష్టానాం విశేష్యనిఘ్నశబ్దానా
రూపం దర్శయన్ తేషా మౌత్సర్గికం లింగమనుశాస్తి స్త్రీదా
రితి శ్లోకేన—ఇహ స్త్రీశబ్దేన యోషా నదీ బలాకాదయస్స్త్రీ
లింగశబ్దావివక్షితాః. పుంలింగేన దారశబ్దేన వృక్షప్లక్షాదయ
పుంలింగశబ్దాః. ఆద్యశబ్దేనచ కళత్రచ్ఛత్రాదయోనపుంసకలింగాః
చాయమర్థః - యాదృశైః=యాదృగ్రూపలింగవచనవిభక్తియుక్తైః
దారాద్యైః పదైః- స్త్రీదారకళత్రాదిభి స్సుబంతశబ్దైః, యద్వి
ర్తృత్వకరణత్వాద్యర్థవిశేషసంఖ్యావచ్ఛిన్నం అర్థస్వరూపం
దికం ప్రస్తుత ముపస్థాపితం తస్య తాదృశపదోపస్థాపితస్య తథా
శేష్యరూపార్థస్య భేదకాః గుణద్రవ్యక్రియాయోగోపాధిలక్ష
రేణవ్యవచ్ఛేదకా శబ్దాః. తథా స్యుః విశేష్యవాచక స్త్రీదారా

స్త్యై పాధికరూపవిశేషభాజో భవంతి. ఇహ గుణద్రవ్యక్రియాశ
ద్వేన జాతిసంజ్ఞావ్యతిరిక్తా శ్శబ్దా వివక్షితాః. తేన అభావవిశిష్ట
గననిర్గుణకాణమూకాదిశబ్దాశ్చ లిఙ్గత్రయేఽప్యుదాహార్యాః.
"స్త్రీ దారాద్య" మితి ప్రథమాన్తం పఠంతి. తత్ర స్త్రీదా
స్థరూపం యాదృశైః పదైః ప్రస్తుతమితి వ్యాఖ్యేయమ్.
యం కరోఽరిష్టతాతి శ్శివతాతి శ్శివంకరః,
క్షేమం కరోతీతి క్షేమంకరః. డుకృఞ్ కరణే. క్షేమమును జేయు
.రిష్టం హింసన మశుభం, రిష హింసాయాం. రిష్టం న భవతీత్య
శ్భం, తత్కరోతీ త్యరిష్టతాతిః. రిష్ట మనఁగా నశుభము, అది
మరిష్టము-శుభము, దానిఁ జేయువాఁడు, ౨. శివంకరోతీతి శివ
ంకరశ్చ. డుకృఞ్ కరణే. శుభమును జేయువాఁడు. ౩,ర. శుభ
యువాని పేళ్లు. (ఈయర్ధశ్లోకము ప్రక్షిప్తమని కొందఱు.)
ృతీ పుణ్యవా న్ధన్యః-
సుకృత మస్యాస్తీతి సుకృతీ. నాంతః. సుకృతము గలవాఁడు.
ణ్య మస్యాస్తీతి పుణ్యవాన్. త. పుణ్యము గలవాఁడు. ౨. ధనం
లబ్ధో ధన్యః. ధన మనఁగాఁ బుణ్యము. దానిఁ బొందినవాఁ
పుణ్యముగలవాని పేళ్లు.

మహేచ్ఛస్తు మహాశయః.   3

మహతీ ఇచ్ఛా యస్య మహేచ్ఛః. ఘనమైనయిచ్ఛగలవాఁడు.
ఆశయో మనో యస్య స మహాశయః. ఘనమైన మనస్సుగల
౨. గొప్పమనస్సుగలవాని పేళ్లు.
ృదయాళు స్సుహృదయః-
ప్రకృష్టం హృదయ మస్య హృదయాళుః. శ్రేష్ఠమైన హృద
గలవాఁడు. ౧. శోభనం హృదయమస్య హృదయాళుః. మంచి
యము గలవాఁడు. ౨. మంచిమనస్సుగలవాని పేళ్లు.

మహోత్సాహో మహోద్యమః,

మహా నుత్సాహో యస్య మహోత్సాహః. ఎక్కువవేడుక గల
౧. మహా నుద్యమో యస్య మహోద్యమః. ఘనమైనయుద్యో
వాఁడు. ౨. ఉద్యోగము గలవాని పేళ్లు.

* ప్రవీణే నిపు ణాభిజ్ఞ విజ్ఞ నిష్ణాత శిక్షితాః.
వైజ్ఞానికః కృతముఖః కృతీ కుశల ఇత్యపి,

ప్రకృష్టా వీణా యస్యేతి ప్రవీణః. ప్రకృష్టమైన వీణ ప్రవీణుఁడు. రూఢిలక్షణచేత నేర్పరియందు వర్తించును. ప్రకృ అస్యేతి యోగవశాత్ ప్రవీణశబ్దోయద్యపి వీణావాదకే వర్తి తి తథాపి రూఢి ర్యోగ మపహరతీతి న్యాయా దుద్గాతృశబ్ద ఛందోగే ఋత్విజి వర్తతే నతు యస్మిం కస్మింశ్చి దుదై తథా బుద్ధివైశద్యసా ధర్మ్యాత్ ప్రవీణశబ్దోఽపి నిపుణపర్యా నుశిష్టః. తదుక్తం—"నిరూఢలక్షణాః కాశ్చిత్ సామర్థ్యా త్, క్రియంతేఽద్యతనైః కాశ్చిత్ కాశ్చినైవత్వశక్తితఇతి" రాంపుణాతి శుభకర్మ కరోతీతి నిపుణః. పుణ శుభకర్మణి. శుభకర్మమును జేయువాఁడు. ౨.అభితస్సర్వతో వస్తుతత్త్వం జా భిజ్ఞః. జ్ఞా అవబోధనే. అంతటవస్తుతత్త్వము నెఱుఁగువాఁడు. షేణ జానాతీతి విజ్ఞః. అధికముగా నెఱిఁగినవాఁడు. ౪. నిత తో నిష్ణాతః, ష్ణా శౌచే. ఏప్రయోజనమందును మిక్కిలి ప్రవే వాఁడు. ౫. శిక్షాఽస్య సంజాతేతిశిక్షితః. శిక్ష గలవాఁడు. నం శిల్పం, తేన చరతీతి వైజ్ఞానికః. నేర్పుచేత సంచరించువా విజ్ఞానికః. ౭. కృత మభ్యస్తం ముఖ ముపాయోఽనేన కృతము భ్యసింపఁబడిన యుపాయముగలవాఁడు. ౮. ప్రశస్తం కృతం కృ స్యాస్తీతి కృతీ. నాంతః. మంచికృత్యము గలవాఁడు. ౯. కుశా కుశలః, లా ఆదానే. తనబుద్ధిసూక్ష్మతకు కుశాగ్రమును పో గ్రహించువాఁడు. ౧౦ నేర్పరిపేళ్లు.

* పూజ్యః ప్రతీక్ష్యః.

పూజితుం యోగ్యః పూజ్యః. పూజింపఁదగినవాఁడు. ౨. హాయజ్ఞాదిషు సన్నిధానార్థం ప్రతీక్షితు మర్హతీతి ప్రతీక్ష్యః దర్శనే. వివాహాయజ్ఞాదులయందు సన్నిధానముకొఱకు నిరీక్ష దగినవాఁడు. "భక్తిః ప్రతీక్ష్యేషు కులోచితా తే" ఇతి రఘు పంచమసర్గే. ౨. (గురువు మొదలయిన) పూజ్యులపేళ్లు.

* సాంశయిక స్సంశయాపన్నమానసః.

...శయ మాపన్న స్సాంశయికః. సందేహమును బొందినవాఁడు.
...మ మాపన్నం "సంశయాపన్నం" సంశయాపన్నం మానసం
సంశయాపన్నమానసః. సందేహమును బొందినమనస్సుగలవాఁ
సందేహించువాని పేళ్లు. సంశయమాపన్నః. అనుసూత్రమందు
...శబ్దము సంశయింపఁబడిన స్థాణ్వాదివస్తువులయందే వర్తించును
...యించుపురుషునియందు వర్తించ దని న్యాసకారుఁడు జెప్పె
...నుక సాంశయికశబ్దము స్థాణ్వాదివస్తుపరమని కొంద ఱందురు.
...శయాపన్నమానసః అనుశబ్దమును సంశయాపన్నం మాన
...ర విషయ ఇతి సంశయాపన్నమానసః. అని వస్తుపరముగానే
...రు. 'అనభ్యాసదశాయాం తస్య సాంశయికత్వాత్' అని
...నాచార్యుఁడు. కొందఱు "దృష్టం సాంశయికైః క్రమాంక
" అనునిది మొద లైనప్రయోగములవలన "సంశయాపన్న
" అని స్వరసముగా పురుషపరమై తోఁచుచున్నది గనుక సంశ
...ట్టి పురుషునియందే వర్తించు ననియుఁ జెప్పుదురు.

...ణేయో దక్షిణార్హ స్తత్ర దాక్షిణ్య ఇత్యపి,
...యాగాదౌ ఋత్విగాదీనాం ఆనతిద్వారా కర్తృసాద్గుణ్యార్థం తే
...యమానం గోహిరణ్యాదికం దక్షిణా; తాం అర్హతీతి దక్షిణేయః,
...ః, దాక్షిణ్యశ్చ. దక్షిణఁబుచ్చుకొన నర్హుఁడు గనుక దక్షిణే
దక్షిణార్హుఁడు, దాక్షిణ్యుఁడు. పా. దక్షిణ్యుఁడు. ౧, ౨, 3.
యోగ్యమైనవాని పేళ్లు.

...ర్వదాన్య స్థూలలక్ష దానశౌణ్డా బహుప్రదే. ౬
...ద్యతే స్తూయత ఇతి వదాన్యః. వద వ్యక్తాయాం వాచి. కొని
...డువాఁడు. అర్థిభ్యః మదీయ మిదం ధనం పర్యాప్తం దీయతా
...తి వదాన్యః, యాచకులకొఱకు నాధనము సంపూర్ణముగా ని
...పువాఁడు. ౧. అర్థిభ్యో దాతుం స్థూలం బహుళం లక్షయతీతి
...ః. లక్ష దర్శనాంకనయోః. పా. స్థూలలక్ష్యః. అర్థుల కిచ్చుకొ
...ద్దపదార్థమును వెదకువాఁడు. ౨. దానే శౌణ్డ స్సక్తఇతి దాన
దానమం దాసక్తుఁడై నవాఁడు. 3. బహుప్రదదాతీతిబహుప్రదః.
... దానే. మెండుగా నిచ్చువాఁడు. ర మిగుల నిచ్చువానిపేళ్లు.

* జైవాతృక స్స్యా దాయుష్మాన్-

జీవతి చిరకాల మితి జైవాతృకః. జీవ ప్రాణధారణే. ము బ్రతుకువాఁడు. ౧. అధిక మాయు రస్యాస్తీ త్యాయుష్మా అధికమైన ఆయుస్సు గలవాఁడు. ౨ దీర్ఘాయుష్మంతునిపేళ్లు.

* అన్తర్వాణి స్తు శాస్త్రవిత్,

అంత రంతశ్శరీరే శాస్త్రరూపా వాణీ యస్యేతి అం శరీరములో శాస్త్రరూపమైన సరస్వతి గలవాఁడు. అంత ప్రసరన్తీ వాణీ యస్యే త్యంతర్వాణిః. నభయందు వ్యాపిం గలవాఁడు. ౧. శాస్త్రం వేత్తీతి శాస్త్రవిత్. ద. విద జ్ఞానే. నెఱిఁగినవాఁడు. ౨. శాస్త్రము నెఱింగినవానిపేళ్లు.

* పరీక్షకః కారణికః-

పరీక్షతే అవధారయతి ప్రమాణై రర్థమితి పరీక్షకః. నే. ప్రమాణములచేత నర్థమును నిర్ణయించువాఁడు. త కారణానివే త్తీతి కారణికః. యాథార్థ్యనిర్ణయమందుఁ గారణ ఱిఁగినవాఁడు. కారణేన పరీక్షాదిహేతునా వ్యవహరతీతి కారణి క్షాదికారణములచేత వ్యవహరించువాఁడు. ౨. దానాదులయం క్ష చేయువానిపేళ్లు.

* వరద స్తు సమర్ధకః.

వరం వాంఛితం పశుపుత్రాదికం దదాతీతి వరదః. డు దా నే. కోరఁబడిన పశుపుత్త్రాదుల నిచ్చువాఁడు. ౧. సమ్య గర్ధ యత్యభీష్టదానేనేతి సమర్ధకః. ఋధు వృద్ధౌ. అభీష్టము నిచ్చి జేయువాఁడు. ౨. అడిగినవస్తువుల నిచ్చు దేవతాదులపేళ్లు.

* హర్షమాణో వికుర్వాణః ప్రమనా హృష్టమానసః,

హృష్యతి తాచ్ఛీల్యే నేతి హర్షమాణః. హృష తుష్టౌ. చుస్వభావము గలవాఁడు. ౧. వికురుతే సుఖావేశా దితి ణః. డు కృఞ్ కరణే. సుఖావేశముచే వికారమును బొందువా ప్రకృష్టం మనో యస్య ప్రమనాః. న. మంచిమనస్సుగలవాఁడు. ష్టం మానసం యస్య హృష్టమానసః. సంతోషించుమనస్సు డు. ౪. సంతోషముతోఁగూడినమనస్సు గలవానిపేళ్లు.

ర్మనా విమనా అన్తర్మనా స్స్యాత్-

దుఃఖితం మనో యస్యేతి దుర్మనాః. స.. దుఃఖితమైన మనస్సు
డు. ౧. విరుద్ధం మనో యస్యేతి విమనాః. స. విరుద్ధమైన మన
వాఁడు. ౨. చింతావశా దంతర్లీనం మనో యస్య త్యంతర్మనాః.
చేత బాహ్యవ్యాపారము లేక లోపల నణఁగినమనస్సు గలవాఁ
ఖేదపడిన మనస్సు గలవాని పేళ్లు.

ఉత్క ఉన్మనాః. ౮

ఉద్గతం మనో యస్య సః ఉత్కః, ఉన్మనాశ్చ. స. ప్రియవస్తువు
ఎత్తినమనస్సు గలవాఁడు. ౧. ౨. ప్రియమైనవస్తు వెప్పుడు గలు
యను త్వర గలిగినవాని పేళ్లు.

క్షిణే సరళో దారా-

దక్షతే పరకార్యం శీఘ్రం కరోతీతి దక్షిణః. దక్ష వృద్ధౌ
ర్యే చ. పరప్రయోజనము శీఘ్రముగాఁ జేయువాఁడు. ౧. సరతి
చ్ఛ మనుసరతీతి సరళః. సృ గతౌ. పరహృదయము ననుసరించు
. ౨. ఉదియర్తి పరకార్యం కర్తు మేతీ త్యుదారః. ఋ గతౌ.
ర్యమును జేయుటకుఁ బోవువాఁడు. 3. కుటిలముగాక చక్కనై
స్సుగల వాని పేళ్లు.

సుకలో దాతృభోక్తరి,

శోభనా కలా త్యాగభోగరూపా రస్యేతి సుకలః. త్యాగభోగము
ందు మంచివిద్య గలవాఁడు. ౧. త్యాగభోగములు గలవాని పేరు.

తత్పరే ప్రసితాసక్తౌ-

తస్యాభిమతవస్తునః పరః అధీన స్తత్పరః. అభిమతవస్తువున కధీన
వాఁడు. ౧. ప్రసినో త్యభిమతవస్తుని చిత్తమితి ప్రసితః. షిఞ్ బంధ
అభిమతవస్తువునందు మనస్సు నిలుపువాఁడు. ౨. ఇష్టవస్తుని ఆస
త్వాన క్తః. షఞ్జ సంగే. ఇష్టవస్తువునందుఁ దగిలినవాఁడు. 3. ఒకపదా
ందుఁ దగిలినమనస్సు గలవాని పేళ్లు.

ఇష్టార్థోద్యుక్త ఉత్సుకః. ౯

ఉత్సుఉద్యోగాతిశయః అస్యాస్తీ త్యుత్సుకః. ఇష్టమైనప్రయో
ందు ఉద్యోగాతిశయము గలవాఁడు. టీ. స. తదుక్తం భోజరాజే

న—"ఉది త్యుద్యోగ మాచష్టే స్వైత్యాధిక్యమభీప్సి తే, త ద
మత్వర్థే కనిస్యా దుత్సుకో మత" ఇతి. ఉచ్ఛబ్ద ఉద్యోగార్థః,
అతిశయార్థః, కశబ్ద స్సుఖవచనః. ఉత్సుక ముద్యోగేనాతిశయిత
మస్యేతి ఉత్సుకః. ఉద్యోగముచేత నతిశయించిన సుఖము గలవా
౧. ఇష్ట మైనప్రయోజనమం దుద్యోగము గలవానిపేరు.

* ప్రతీతే ప్రథిత ఖ్యాత విత్త విజ్ఞాత విశ్రుతాః,

ప్రతీయతే జ్ఞాయతే సర్వై రితి ప్రతీతః. ఇణ్ గతౌ. స
ర్థా జ్ఞానార్థాః. అందఱిచేత నెఱుఁగఁబడువాఁడు. ౧. ప్రథత ఇతి
ప్రథ ప్రఖ్యానే. ప్రసిద్ధుఁడు. ౨. ఖ్యాయత ఇతి ఖ్యాతః. ఖ్యా
నే. అందఱిచేతఁ గొనియాడఁబడువాఁడు. ౩. విద్యతే జ్ఞాయత
త్తః. విద జ్ఞానే. ఎఱుఁగఁబడువాఁడు. ౪. విశేషేణ జ్ఞాయత ఇ
తః. జ్ఞా అవబోధనే. విశేషముగా నెఱుఁగఁబడువాఁడు. ౫. వి
శ్రూయత ఇతి విశ్రుతః. శ్రు శ్రవణే. విశేషముగా వినఁబడువా
ధనాదులచేతఁ బ్రసిద్ధుఁడైనవానిపేళ్లు.

* గుణైః ప్రతీతే తు కృతలక్షణాహతలక్షణౌ.

కృత మభ్యస్తం లక్షణం నామ యస్యేతి కృతలక్షణః. "ల
నామచిహ్నయోః" అని. లక్షణ మనఁగా పేరు. అందఱికిని అభ్య
పేరుగలవాఁడు. ఆహతం గుణిత మసకృదుచ్చరితం లక్షణం యస్య
హతలక్షణః. పలుమాఱు లుచ్చరింపఁబడు పేరు గలవాఁడు. ౨.
తం నిహితం జనముఖే స్థాపితం లక్షణం గుణజాత మస్యేత్యాహితల
జనముఖమం దుంచఁబడిన గుణసమూహము గలవాఁడు. "ఇక్ష్వా
శప్రభవో నృపాణాంకకుత్స్థ ఇత్యాహితలక్షణోఽభూ" దితి రఘు
వష్ఠ సర్గే. ౨. త్యాగశౌర్యాది గుణములచేఁ బ్రసిద్ధుఁ డైనవాని

* ఇభ్య ఆఢ్యో ధనీ.

ఇభ మర్హతీతి ఇభ్యః. ఏనుఁగు నెక్క నర్హుఁడు. ౧. ఆ
ధ్యాయం త్యేన మిత్యాఢ్యః. ధ్యై చింతాయాం. అంతటనితనిఁదలఁ
౨. ధన మస్యాస్తీతి ధనీ. నాంతః. ధనముగలవాఁడు. ౩. ధని

* స్వామీ త్వీశ్వరః పతి రీశితా,

అధిభూ ర్నాయకో నేతా ప్రభుః పరివృఢోఽధిపః.

స్వే మైశ్వర్య మస్యాస్తీతి స్వామీ. నాంతః. సొమ్ము గలవాఁడు.
ష్టే తాచ్ఛీల్యేనే తీశ్వరః. ఈశ ఐశ్వర్యే. స్వభావైశ్వర్యము గల
స్త్రీలింగమందు ఈశ్వరా. ఈశ్వరీశబ్దము 'అశూ వ్యాప్తౌ'
మువుమీఁద నిష్పన్నము. ౨. పాతి స్వానుజీవిన మితి పతిః. పా
తనయాశ్రితుని రక్షించువాఁడు. స్త్రీలింగమందు రుచిశబ్దము
నపుంసకమందు వారిశబ్దమునవలెను రూపము. ౩. ఈష్ట ఇ తీశి
ఐశ్వర్యము గలవాఁడు. ౪. అధ్యుపరి భవతీతి త్యధిభూః.
సత్తాయాం. సేవకులకు మీఁదై యుండువాఁడు. ౫. నయతి
కే సేవకా నితినాయకః, నేతా చ. ౻. ణీఞ్ ప్రాపణే. నే
నియోగించువాఁడు. ౬. ౭. ప్రభవతి సమర్థో భవతీతి ప్రభుః.
సత్తాయాం. సమర్థుఁడగువాఁడు. ౮. పరిబృంహతి వర్ధత ఇతి
ః. బృహ బృహి వృద్ధౌ. వృద్ధిఁ బొందువాఁడు. ౯. పరిబృఢః.
పాతీతి అధిపః. పా రక్షణే. ఆధిక్యమున రక్షించువాఁడు. ౧౦.
ని పేళ్లు.

ధికర్ధి స్సమృద్ధ స్స్యాత్ -

అధికా ఋద్ధి ర్యస్యేత్యధికర్ధిః. అధికమైనసంపద గలవాఁడు. ౧.
ఋద్ధి ర్యస్యేతి సమృద్ధః. మంచి సంపద గలవాఁడు. ౨. సమృ
౨. అధికమైనసంపద గలవాని పేళ్లు.

కుటుమ్బవ్యాపృత స్తు యః,

స్యా దభ్యాగారిక స్త స్మి న్నుపాధిశ్చ పుమా నయమ్. ౧౨

అగారం భక్తి రస్యే త్యాగారికః, అభి అధికః ఆగారికః అభ్యాగా
అధికముగా గృహమునే భజించువాఁడు. ౧. ఉపదధాతి కుటుంబ
పాధిః. డు ధాఞ్ ధారణపోషణయోః. కుటుంబమును బోషిం
డు. నియతపుంలింగము. ౨. కుటుంబపోషణమునం దాసక్తుఁ
ని పేళ్లు.

రాఙ్గరూపోపేతో యః స్సింహసంహననో హి సః,

శ్రేష్ఠావయవసౌందర్యసహితో యః పురుషః సః సింహసంహ
త్యుచ్యతే. సింహసంహననశబ్దము ప్రత్యవయవమును చక్కనైన
ము గలవాని పేరు. సింహస్య సంహనన మివ సంహననం వపు ర్య

స్యేతి సింహసంహననః. సింహముయొక్క శరీరమువలె శ్రేష్ఠ
ము గలవాఁడు. ౧.

* నిర్వాహ్యః కార్యకర్తా య స్సంపన్న స్సత్వసంపదా.

సత్యపి దుఃఖాదికారణే వికారరహితం మన స్స త్త్వం. త
యా మనోవృత్త్యా సంపన్న స్సంయుక్త ఏవ యః కార్యం కరోతి
ర్య ఇత్యుచ్యతే. స త్త్వ మనఁగా నాపత్సంపదలయం దొక్క తీ
డెడిధైర్యము. అట్టిధైర్యసంపదతోఁ గూడుకొని యెవఁడు కా
జేయునో వాఁడు నిర్వాహ్యుఁ డనంబడును. నిర్వాహ్యతే జనైర్ధ్యః వృ
పదిశ్యతే ఆధిక్యేనేతి నిర్వాహ్యః. ధృ ధారణే. ఆధిక్యముచేత జన
నేర్పఱుపఁబడువాఁడు. టీ. స. 'సంపతంత్స త్త్వసంప' దేతి పాఠే
ర్థః సంగచ్ఛమానః. ౧.

* అవాచి మూకః.

మూయతే బధ్యతే వాక్ప్రవృత్తి రస్యేతి మూకః. మూ
ధనే. వాగ్వ్యాపారము వీనికి బద్ధమై యుండును. ౧. మూఁగవా

* అథ మనోజవసః పితృసంనిభః,

జవతీతి జవం వేగయుక్తం మనో యస్మిన్ స మనో
తీక్ష్ణమైనబుద్ధి గలవాఁడు. పా. మనోజవాః. మనోజవః. ౧ పితృస
తండ్రినిఁ బోలువానిపేరు.

* సత్కృత్యాలంకృతాం కన్యాం యో దదాతి స కూకుదః.

యః స్వసంప దనుసారేణ వస్త్రాభరణాలంకృతాం కన్యాం
శీలసంపన్నాయ వరాయ సత్కృత్య దదాతి స కూకుద ఇత్యు
తన సంపదకొలఁది వస్త్రభూషణాదులచేత నలంకరింపఁబడినకన్య
నకు సత్కరించి యిచ్చువాఁడు కూకుఁడుఁ డనంబడును. కూకుం క
దదాతీతి కూకుదః. కన్య నిచ్చువాఁడు. తథాచ స్మృతిః—"
రిత్యుచ్యతే కన్యా తద్దాతా కూకుదః స్మృతః" ఇతి. కోకతే
త్పుణ్య మాదత్తే కూకుదః. కుక వృక ఆదానే. అధికపుణ్యము
రించువాఁడు. ౧.

* లక్ష్మీవాం ల్లక్ష్మణ శ్శ్రీల శ్శ్రీమాన్-

లక్ష్మీ రస్యా స్తీతి లక్ష్మీవాన్. త. లక్ష్మణశ్చ. శ్రీ రస్యా స్తీతి శ్రీ

...శ్చ. త. లక్ష్మియనినను శ్రీయనినను సంపదయు, ఒప్పిదమును. ...వాఁడు. శ్రియం లా త్యాదత్తే వా శ్రీలః. లా ఆదానే. సంపదను ...నువాఁడు. పా. శ్లీలః. ౧-౪. సంపద గలవాని పేళ్లు. ఒప్పిదము ...ను.

స్నిగ్ధస్తు వత్సలః,

స్నిహ్యతీతి స్నిగ్ధః. ష్ణిహ ప్రీతౌ. స్నేహము గలవాఁడు. ౧. వ ...స్నేహః సోఽస్యాస్తీతి వత్సలః. వత్స మనఁగా స్నేహము ; అది ...డు వత్సలుఁడు. ౨. స్నేహముగలవాని పేళ్లు.

...స్యా ద్దయాళుః కారుణికః కృపాళు స్సురత స్సమాః. ౧౫

దయతే తాచ్ఛీల్యే నేతి దయాళుః. దేఙ్ రక్షణే. రక్షించుస్వ ...ము గలవాఁడు. ౧. కారుణ్యమస్యాస్తీతి కారుణికః. కరుణగలవాఁడు. ...కృపాం లాతీతి కృపాళుః. లా ఆదానే. కృపను స్వీకరించువాఁడు. ౩. ...రమత ఇతి సురతః. రము క్రీడాయాం. లెస్సగాఁ గ్రీడించువాఁడు. పా. ...తః. సూర్య ఇవ తపతి ప్రసిద్ధ్యా ప్రకాశత ఇతి సూరతః. తప సంతా ...సూర్యునివలెఁ బ్రసిద్ధిచేత నొప్పువాఁడు. ౪. దయగలవాని పేళ్లు.

...స్వతన్త్రోఽపావృతః స్వైరీ స్వచ్ఛన్దో నిరవగ్రహః,

స్వం ఆత్మా తంత్రం ప్రధానం యస్య స్వతంత్రః. తానే ప్రధానము ...గలవాఁడు. ౧. అపగతం ఆవృత మావరణం యస్యే త్యపావృతః. అడ్డు లేనివాఁడు. ౨. స్వేన ఈరితుం శీల మస్యేతి స్వైరీ. ఈర గతౌ. నాం ...యిచ్చకొలఁది దిరుగువాఁడు. ౩. స్వకీయ ఏవ ఛందోఽభిప్రా ...యమస్యేతి స్వచ్ఛందః. స్వకీయమైనయభిప్రాయము గలవాఁడు. ౪. ని ...ర్గతః అవగ్రహాదితి నిరవగ్రహః. అడ్డుబాటువలనఁ బాసినవాఁడు. ...స్వతంత్రుని పేళ్లు.

...పరతన్త్రః పరాధీనః పరవా న్నాథవా నపి. ౧౬

...అధీనో నిఘ్న ఆయత్తోఽస్వచ్ఛన్దో గృహ్యకోఽప్యసౌ,

పరః స్వస్మాదన్య స్తంత్రం ప్రధాన మస్యేతి పరతంత్రః. పరుఁడు ప్ర ...ముగాఁ గలవాఁడు. ౧. పరస్మి న్నధీనః గుణభూతః పరాధీనః. పరు ...ని డు అధీనుఁడు. ౨. పరో నియామకో ఽస్యాస్తీతి పరవాన్. త. పరుఁ ...నియామకుఁడుగాఁ గలవాఁడు. ౩. నాథోఽస్యాస్తీతి నాథవాన్. ఏలిక

గలవాఁడు. ౪. అధిగతః ఇనః స్వామీ అనే నేత్యధీనః. పొందఁబడి గలవాఁడు. ౫. నిహన్యతే ప్రతికూల మాచరన్ వీడ్యతే ప్రభుణేతి హన హింసాగత్యోః. ప్రతికూలకార్యము చేసినప్పుడు ప్రభువుచే పఁబడువాఁడు. ౬. ఆయత్యతే నియుజ్యతే స్వామి నేత్యాయత్తః ప్రయత్నే. ప్రభువుచేత నియోగింపఁబడువాఁడు. స్వచ్ఛందో న స్వచ్ఛందః. స్వతంత్రుఁడు గానివాఁడు. ౮. గృహ్యతే స్వీక్రియ పారేషు స్వామి నేతి గృహ్యకః. గ్రహ ఉపదానే. స్వామిచేత కా యందు గ్రహింపఁబడువాఁడు. "గుణగృహ్యా వచనే విపశ్చితః" రవి. ౯. పరాధీనుని పేళ్లు.

* ఖలపూః స్యాద్బహుకరః-

ఖలం పునాతి ఖలస్థధాన్యం నిశ్శేషం గృహ్ణాతీతి ఖలపూః పూఞ్ పవనే. కళ్లమును జక్కఁజేయువాఁడు. ౧. బహూని కి కరణాదీని కరోతీతి బహుకరః. కళ్లమును జక్కఁజేయుట మొద జాలపనులఁ జేయువాఁడు. ౨ కళ్లమూడుచువాని పేళ్లు.

* దీర్ఘసూత్రశ్చిరక్రియః.

దీర్ఘం సూత్రం విచారోఽస్యేతి దీర్ఘసూత్రః. దీర్ఘమైన గలవాఁడు. దీర్ఘంచిరకాలేన సూత్రయతే క్రమబద్ధాని కర్మాణి దీర్ఘసూత్రః. సూత్ర విమోచనే విమోచనం మోచనాభావః తి యావత్. పనులను మెల్లగాఁ జేయువాఁడు. ౧. చిరం క్రియా చిరక్రియః. తడవుగాఁ గార్యముఁ జేయువాఁడు. ౨. విచారించి గా కార్యమును జేయువాని పేళ్లు.

* జాల్మోఽసమీక్ష్యకారీ స్యాత్ -

అసమీక్ష్య గుణదోషా వవిమృశ్య కరోతీ త్యసమీక్ష్య నాంతః. డుకృఞ్ కరణే. గుణదోషముల ప విచారించక చేయువా ౨ విచారింపక కార్యమును జేయువాని పేళ్లు.

* కుణ్ఠో మన్దః క్రియాసు యః

కుంఠతి క్రియాసు మందో భవతీతి కుంఠః. కుఠి గతి ప్రతీఘా ఆలస్యే చ. పనులయందు మందుఁడై యుండువాఁడు. ౧. కార్యము దలసుఁడైనవాని పేరు.

...ర్మక్షమో౾లంకర్మీణః-

కర్మణి క్షమః కర్మక్షమః. కార్యమందు సమర్థుఁడు. ౧. అలం స... భవతి కర్మణ ఇతి అలంకర్మీణః. కార్యము నేయ సమర్థుఁ డైనవాఁ... అనాయాసముగఁ గార్యమును జేయువానిపేళ్లు.

క్రియావాన్ కర్మసూద్యతః. ౧౭

క్రియా స్యాస్తీతి క్రియావాన్. త. క్రియ గలవాఁడు. ౧. కార్య... కేయ నుద్యోగించినవానిపేరు.

...కార్మః కర్మశీలో యః-

కర్మ కరణం శీల మస్యేతి కార్మః, కర్మశీలశ్చ. కార్యము జేయు... స్వభావముగాఁ గలవాఁడు. ౧. ౨. ఫలము గలిగినను లేకున్న... కార్యమును జేయుస్వభావము గలవానిపేళ్లు.

కర్మశూరస్తు కర్మఠః,

కర్మణి శూరః కర్మశూరః. కార్యము జేయుటయందు తెగువగల... ౧. కర్మణి ఘటత ఇతి కర్మఠః. కార్యమందు వ్యాపారము గల... ౨. ఫలపర్యంతము కార్యమును జేయు తెగువ గలవానిపేళ్లు.

...ర్మణ్యభుక్కర్మకరః-

కర్మణి సాధు కర్మణ్యం వేతనం, తద్భుఙ్క్త ఇతి కర్మణ్యభుక్. సః ...ర ఇత్యుచ్యతే. కర్మణ్య మనఁగా కూలి. అది పుచ్చుకొని పనిచే...వాఁడు. కర్మణ్యభుక్కు వాఁడు కర్మకరుఁ డనంబడును. కర్మ కరో...త్యర్థమితి కర్మకరః. కూలికొఱకు కార్యముఁ జేయువాఁడు. పా. భ...క్. ౧. కూలి దీసికొని పనిచేయువానిపేరు.

కర్మకారస్తు తత్క్రియః. ౧౮

...యో భృతి మృగహీత్వైవ కర్మకర ఇవ క్రియాః కరోతి స శిష్య...ప్రసాదిః కర్మకార ఇత్యుచ్యతే. తత్క్రియుం డనఁగా కూలి లేక ...యునట్టిశిష్యుఁడు బంటు మొదలైనవారు. అట్టివాఁడు కర్మకారుఁ...బడును. కర్మ కరోతీతి కర్మకారః. డు కృఞ్ కరణే. కార్యమును ...వాఁడు. ౧. కూలి యడుగక పనిచేయువానిపేరు.

అపస్నాతో మృతస్నాతః-

అప నికృష్టం స్నాతః అపస్నాతః. నికృష్టమైన స్నానము జేసిన

వాఁడు. ౧. మృతే మరణే స్నాతో మృతస్నాతః. ష్ణా శౌచే.
నిమిత్తమై స్నానముచేసినవాఁడు. ౨. బంధుసుహృదాదిమరణని
స్నానముచేసినవాని పేళ్లు. పుత్త్రాదులచేత సంస్కారార్థమై స్నా
చేయించఁబడినశవమునకు పేళ్లని సుబోధినీకారుఁడు.

* ఆమిషాశీ తు శౌష్కలః,

ఆమిష మశ్నాతీ త్యామిషాశీ. నాంతః. మాంసమును
వాఁడు. ౧. శుష్కాణాం మాంసఖండానాం సమూహః శౌష్కం.
రసంఘాత ఇత్యర్థః. త ల్లా త్యాద త్త ఇతి శౌష్కలః, లా ఆదానే
డినమాంససమూహమును గ్రహించువాఁడు. షా. శష్కులీవ
త్వాది గుణయోగా న్మాంస మపి శష్కులీ. తా మశ్నాతీతి శ
లః. చక్కిలమువలె కఠినగుణము గలదౌటవలన మాంసము శష్కు
యనఁబడును. దానిని భక్షించువాఁడు. ౨. మాంసమును దినువా

* బుభుక్షిత స్స్యాత్ క్షుధితో జిఘత్సు రశనాయితః.

బుభుక్షా అస్య సంజాతేతి బుభుక్షితః. క్షు దస్య సంజాతేతి
ధితః. ఆఁకలి వీనికిఁ గలిగినది గనుక, బుభుక్షితుఁడు. క్షుధితుఁడును. ౧.
అత్తు మిచ్ఛుః జిఘత్సుః. భక్షింప నిచ్ఛయించువాఁడు. ౩. అశనాయా
సంజాతా అశనాయితః. ఆఁకలిగొన్నవాఁడు. ౪. ఆఁకలిగొన్నవానిపేళ్లు

* పరాన్నః పరపిణ్డాదః-

పరస్యాన్నం అస్యేతి పరాన్నః. పరునియొక్క యన్నమ
వాఁడు. ౧. పరపిండం పరాన్న మత్తీతి పరపిండాదః. అద భక్షణే.
న్నమునే భక్షించువాఁడు. ౨ పరాన్నమునే తినువానిపేళ్లు.

* భక్షకో ఘస్మరోఽద్మరః,

భక్షయ త్యధికమితి భక్షకః. భక్ష అదనే. అధికముగా భక్షిం
చువాఁడు. ౧. ఘసతి తాచ్ఛీల్యేన ఘస్మరః అత్తి తాచ్ఛీల్యేన అ
రః. ఘస్ ఌ అదనే. అద భక్షణే. భక్షించుస్వభావము గలవా
౨. ౩. తిండిపోతుపేళ్లు.

* ఆద్యూన స్స్యా దౌదరికో విజిగీషా వివర్జితే.

విజిగీష యనఁగా నైహికాముష్మికసాధనమైనయుద్యోగము
లేక, పొట్టపోసికొనువానియందు ఆద్యూన ఔదరిక శబ్దములు వ

దీవ్యతి ఈషత్ క్రీడతి అన్యత్రాసక్తత్వాత్ ఆద్యూనః దివు
ఉద్యోగము లేక క్రీడించువాఁడు. ౧. ఉదరే ఆసక్తః ఔద
ఉదరమందే ఆసక్తి గలవాఁడు. ౨.

వాత్మంభరిః కుక్షింభరి స్స్వోదరపూరకే,
స్వోదర మేవ పూరయతీతి స్వోదరపూరకః. పోష్యవర్గమును విడి
కడుపు నింపుకొనువాఁడు స్వోదరపూరకుఁడు. వానియందు ఆ
కుక్షింభరిశబ్దములు వర్తించును. ఆత్మానం స్వమేవ బిభర్తీతి
రిః స్వకుక్షిమేవ బిభర్తీతి కుక్షింభరిః. డు భృఞ్ ధారణపో
తనకడుపుమాత్రము నిండించుకొనువాఁడు. ౧.

ర్వాన్నీనస్తు సర్వాన్నభోజీ-
సర్వాన్నం భక్షయతీతి సర్వాన్నీనః. సర్వాన్నం భుఙ్క్తే సర్వా
నాంతః. భుజ పాలనాభ్యవహారయోః. సర్వమైనవారియన్న
భుజించువాఁడు, ౧. ౨. నియమము వీడి యెల్లవారుల భుజించు
ళ్లు.

గృధ్నుస్తు గర్ధనః. ౨౨

లోఽభిలాషుక స్తృష్ణక్-
గృధ్యతి కాంక్షతి తాచ్ఛీల్యేనేతి గృధ్నుః, గర్ధనశ్చ. గృధు అభి
యాం. స్వభావమున కాంక్షించువాఁడు. ౧. ౨. లుభ్యతి
లుబ్ధః. లుభ గార్ధ్యే. ఆశించువాఁడు. ౩. అభిలషతి తా
త్యభిలాషుకః. లష కాంతౌ. స్వభావముననే అభిలషించు
౪. తృష్యతి తాచ్ఛీల్యేనేతి తృష్ణక్. జి. తృష పిపాసాయాం.
మ అత్రేచ్ఛావిశేషః. స్వభావముననే కోరువాఁడు. ౫. ఆశ
పేళ్లు. మొదటి ౨ పరద్రవ్యమునం దాసగలవానికిని, తక్కిన
యముందైనను తెంపులేని యాశ గలవానికిని పేళ్లని కొందఱు.

సమౌ లోలుప లోలుభౌ,
లోలుప్యతే భృశం ముహ్యతీతి లోలుపః. లుప విమోహనే. మి
మోహపడువాఁడు. ౧. లోలుభ్యతే భృశం గృధ్యతీతి లోలుభః.
గార్ధ్యే. కాంక్షించువాఁడు. ౨ మిగుల నాశ గలవానిపేళ్లు.

న్మాద స్తూన్మదిష్ణు స్స్యాత్-

ఉన్మాదేన సహితః సోన్మాదః. ఉన్మాదముతోఁగూడుకొన్న
పా. సూన్మాదః. ఉన్మదః. ౧. ఉన్మాదశీలః ఉన్మదిష్ణుః. మదీ హ
యోః. ఉన్మాదస్వభావము గలవాఁడు. ౨. భూతావేశాదులచే
లెఱుఁగనివాని పేళ్లు.

* అవినీత స్సముద్ధతః.

వినీత శ్శిక్షితో న భవతీ త్యవినీతః. శిక్షింపఁబడనివా
సముద్ధన్యతే సర్వై స్తాడ్యత ఇతి సముద్ధతః. అందఱిచేతఁ గొ
వాఁడు. ౨. అడఁకువ లేనివానిపేళ్లు.

* మత్తే శౌణ్డోత్కట క్షీబాః-

మాద్యతి స్మ మత్తః. మదీ హర్ష గ్లేపనయోః. మదించిన
౧. శుండా పానాగారం, సురా వా. తత్ర స్థితః-ఆసక్తో వా
మద్యపానగృహమందు దునికి గలవాఁడు గాని మద్యమందాసక్తి గల
గాని శౌండుఁడు. ౨. ఉద్రిక్తః ఉత్కటః. మదోద్రేకము గల
ఉద్భూతః ప్రకాశితః కటః శ్రోణిభాగోఽస్యఉత్కటః. మదము
కానొకప్పు డొడలెఱుఁగక వస్త్రహీనుఁ డౌను గనుక అగపడుచు
ణిభాగము గలవాఁడు. ౩. క్షీబతి మాద్యత ఇతి క్షీబః. క్షీబృ
మదించినవాఁడు. ౪. మద్యపానాదులచే నొడ లెఱుంగనిపేళ్లు.

* కాముకే కమి తానుకః,

క్రమ్రః కామయి తాభీకః కమనః కామనోఽభికః.

కామయతే తాచ్ఛీల్యే నేతి కాముకః; కమితా. ఋ. అను
మ్రః, కామయితా. ఋ. అభీకః, కమనః, కామనః, అభికశ్చ. 'అ
కాభీకః కమి' తేతి నిపాతనాత్ కమితేత్యర్థే త్రయశ్శబ్దాః కప్రత్య
తా స్సాధవః. కము కాంతౌ. కామించుస్వభావము గలవాఁడు. అ
భికాభీకశబ్దములు ఈయర్థమందు నిపతితములు గనుక నిదియ వ్య
౯. (వేశ్యాపతి ర్భుజంగ స్స్యాత్ షిద్గః పల్లవికో విటః) ఈశబ్దము
కాముకునియందు వర్తించును. ౯ కాముకుని పేళ్లు. కోరిక గలవా

* విధేయో వినయగ్రాహీ-

విధాతుం నియోక్తుం యోగ్యో విధేయః. డు ధాఞ్
పోషణయోః. నియోగింపఁదగినవాఁడు. ౧. ఇదం కార్య మిద

...గుర్వాద్యుపదేశో వినయః. తం గృహ్ణాతీతి వినయగ్రాహీ. నాంతః.
...పాదానే. వినయము నంగీకరించువాఁడు. ౨. వినయము గల
...పేళ్లు.

వచనేస్థిత ఆశ్రవః,

వచనే గుర్వాదివచనే తిష్ఠతీతి వచనేస్థితః. ష్ఠా గతినివృత్తౌ. గు
...లు చెప్పినమాటలో నుండువాఁడు. ౧. గుర్వాదిభి రాదిష్ట మ
...శృణోతీత్యాశ్రవః. శ్రు శ్రవణే. గుర్వాదులు చెప్పినమాట విను
... ౨. చెప్పినట్టు చేయువానిపేళ్లు. ౪ ను వినయముగలవానిపేళ్లే
...టీకానర్వస్వకారుఁడు. ఆలాగుననే, "స్యా దాశ్రవో విధేయ
...త్" అని రత్నకోశకారుఁడును పర్యాయములుగానే చెప్పినాఁడు.
...వో౽స్మి భవత స్సహానుజః" అని మాఘుఁడు.

...శ్యః ప్రణేయః-

వశం గత ఇతి వశ్యః. వశమును బొందినవాఁడు. ౧. ప్రణేతుం
...తుం శక్యః ప్రణేయః. ణీఞ్ ప్రాపణే. వశమును బొందింప శక్య
...వాఁడు. ౨. ఔషధాదులచేత వశ్యుఁడైనవాని పేళ్లు. విధేయశబ్ద
...ముదలు ౬ ను విధేయునిపేళ్లనికొందఱు.

నిభృత వినీత ప్రశ్రితా స్సమాః. ౨౫

నితరాం భ్రియత ఇతి నిభృతః. డు భృఞ్ ధారణపోషణయోః.
...పోషింపఁబడినవాఁడు. ౧. వినీయతే శిక్ష్యత ఇతి వినీతః. ణీఞ్
... శిక్షింపఁబడినవాఁడు. ౨. ప్రకర్షేణ శ్రియత ఇతి ప్రశ్రితః. శ్రి
...వాయాం. ప్రకర్షముచేత సాధువులను బొందువాఁడు. 3. శిక్షిం
...నవానిపేళ్లు.

...ష్టే ధృష్ణు ర్వియాతశ్చ-

...ధృష్ణోతీతి ధృష్టః, ధృష్ణుశ్చ. ఞి ధృషా ప్రాగల్భ్యే. దిట్టమై
...వాఁడు. పా. ధృష్ణక్. జ. ౧. ౨. విశేషేణ ఆభిముఖ్యం యా
...యాతః. యా ప్రాపణే. విశేషముగా నెదుటికిఁ బోవువాఁడు. 3.
...ము గలవానిపేళ్లు.

ప్రగల్భః ప్రతిభాన్వితే,

ప్రత్యుత్పన్నమతిత్వం ప్రతిభా. తదుక్తం. "బుద్ధిస్తాత్కాలికీ జ్ఞే

యా మతి రాగామిగోచరా, ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా ఇతి. అప్పటప్పటికి క్రొత్తగాఁ బ్రకాశించుప్రజ్ఞ ప్రతిభ యను ఆప్రతిభతోఁ గూడినవాఁడు ప్రగల్భుఁ డనంబడును. ౨. ప్రకర్షేణ ప్రగల్భః. గల్భ ధార్ష్ట్యే. ౯. ప్రకర్షముచేత దిట్టతనము గలిగి ౧. ఎప్పటికప్పుడు క్రొత్తయూహలు దోఁచు మంచిబుద్ధి గలవాని

* స్యా దధృష్టే తు శాలీనః-

ధృష్టో నభవతీ త్యధృష్టః. దిట్టరి కానివాఁడు. ౧. సలజ్జత్వే సుస్థాతు మసమర్థతయా శాలా మేవ ప్రవేష్టు మర్హతీతి శా గలవాఁ డౌటచేత సభలయం దుండ నశక్తుఁడై యిల్లు చేర నవాఁడు. ౨. దిట్టతనము లేనివాని పేళ్లు.

విలక్షో విస్మయాన్వి తే.

కేనచి దనుచితవ్యాపారే రహసి కృతే. తస్మిఁ కథంచి టీభూతే సతి మయాకృత మిదం ప్రకాశ మభూ దితిక ర్తుర్మనసి వి భవతి లజ్జా చ జాయ తే. తదుభయ మప్యత్ర విస్మయశబ్దేన లక్ష్యతే తైవిలక్షశబ్దో వ ర్త తే. తదు క్తమాలంకారికైః. "ఆత్మనశ్చరితే జ్ఞాతే౽న్యైర్య స్య జాయ తే, అపత్రపా తిమహతీ స విలక్షఇతి స్మృ విగతం లక్షం ప్రకృతార్థజ్ఞాన మస్యేతి విలక్షః. లక్ష దర్శనాంక దర్శనం=జ్ఞానం. ఆశ్చర్యముచేత ప్రకృతార్థజ్ఞానము లేనివాఁడు. ౧. నాన్వితో విస్మయాన్వితః. ఆశ్చర్యముతోఁ గూడుకొన్నవాఁడు. ౨ ర్యముచేఁ బ్రకృతార్థస్మృతి గలవాని పేళ్లు. వెఱఁగుపడినవాఁడు,

* అధీరే కాతరః-

ధీరో న భవతీ త్యధీరః. ధైర్యము లేనివాఁడు. ౧. కా తీతి కాతరః. తౄప్లవనతరణయోః. ధైర్యము లేకుండుటచేత కా చుకంత దాఁటువాఁడు. కేన సుఖేనతీర్ణః ప్రాప్తో నభవతీతి వా ఖము చేతఁ బొందనివాఁడు. ౨. వ్యసనాదులచేత వ్యాకులపడినవా

* త్రస్నో భీరు భీరుక భీలుకాః,

త్రస్యతి తాచ్ఛీ ల్యే నేతి త్రస్నుః. బిభేతి తాచ్ఛీ ల్యేనేతి భీ కః. భీలుకశ్చ. త్రసీ. ఉద్వేగే. ఞి భీ భయే. వెఱచుస్వభావముగల త్రస్నువు, భీరువు, భీరుకుఁడు, భీలుకుఁడును. ౪. వెఱచుస్వ

పేళ్లు. అభీరాదులు ౬ ను వెఱపుగలవానిపేళ్లని కొందఱు.
దు "అభీరే కాతర త్రస్నూ" అని మూలము.
ంసు రాశంసితరి-
శంసతి తాచ్ఛీల్యేనేతి ఆశంసుః, ఆశంసితా చ. ఋ. శంసు స్తు
పూర్వ ఇచ్ఛాయాం. స్వభావమున ప్రార్థించువాఁడు. ౨. తన
స్తువును కావలయు నని కోరువాని పేళ్లు.

గ్రహయాళు ర్గృహీతరి. ౨౭

గ్రహయతి తాచ్ఛీల్యేనేతి గ్రహయాళుః. గృహ్ణాతి తాచ్ఛీల్యేనే
తా. ఋ. పుచ్చుకొనుస్వభావము గలవాఁడు. ఇచట 'గృహయా
పాఠము. 'గ్రహయాళుః' అను రేఫసహితపాఠము 'భ్రాంతిమూ
టీకాసర్వస్వకారుఁడు. ౧. ౨. పుచ్చుకొనుస్వభావముగలవాని పేళ్లు.
ద్ధాళు శ్రద్ధయా యుక్తే-
శ్రద్ధధతే తాచ్ఛీల్యేన శ్రద్ధాళుః. డు ధాఞ్ ధారణపోషణయోః.
ర్వః. విశ్వసించుస్వభావముగలవాఁడు. ౧ నమ్మకముగలవాని పేరు.

పతయాళు స్తు పాతుకే,

పతతి తాచ్ఛీల్యేనేతి పతయాళుః, పాతుకశ్చ. పత్ ౡ గతౌ. స్వ
మననే పడువాఁడు. ౧. ౨. పడుస్వభావము గలవాని పేళ్లు.
జ్జాశీలో౽పత్రపిష్ణుః-
లజ్జాశీల మస్యేతి లజ్జాశీలః. లజ్జయే స్వభావముగాఁగలవాఁడు.౧.
పతే తాచ్ఛీల్యేనేతి అపత్రపిష్ణుః. త్రపూష్ లజ్జాయాం. స్వభావము
గ్గుపడువాఁడు. ౨. సిగ్గుపడుస్వభావము గలవాని పేళ్లు.

వన్దారు రభివాదకే. ౨౮

వందతే తాచ్ఛీల్యేనేతి వందారుః. వది అభివాదనస్తుత్యోః. మ్రొ
భావము గలవాఁడు. ౧. అభివాదయతి ఇత్యభివాదకః. వద వ్య
ం వాచి. మ్రొక్కువాఁడు. పా. అభివాదుకః. ౨. మ్రొక్కు
వముగలవాని పేళ్లు.
రారు ర్ఘాతుకో హింస్రః-
శృణాతి తాచ్ఛీల్యేనేతి శరారుః. హంతి తాచ్ఛీల్యేనేతి ఘాతుకః.
తాచ్ఛీల్యేనేతి హింస్రః. హింసా హింసాయాం; హనహింసాగత్యోః.

హిసి హింసాయాం. స్వభావముననే చంపెడువాఁడు. ౧, ౨,
స్వభావము గలవాని పేళ్లు.

* సాన్యా ద్వర్ధిష్ణుస్తు వర్ధనః,

వర్ధతే తాచ్ఛీల్యేనేతి వర్ధిష్ణుః, వర్ధనశ్చ. వృధు వృద్ధౌ.
మున నే వృద్ధిఁబొందువాఁడు. ౧. ౨. వృద్ధిఁబొందుస్వభావము
పేళ్లు.

* ఉత్పతిష్ణు స్తూత్పతితా-

ఉత్పతతీ త్యుత్పతిష్ణుః, ఉత్పతితాచ. ఋ. పత్ ౢ గతౌ.
మున నెగయువాఁడు. ౧. ౨. ఎగయుస్వభావము గలవాని పేళ్లు.

* అలంకరిష్ణు స్తు మణ్డనః.

అలంకరోతి తాచ్ఛీల్యేనే త్యలంకరిష్ణుః. మండయతితాచ్ఛీ
మండనః. డు కృఞ్ కరణే, మడి భూషాయాం. అలంకరించుస్వ
గలవాఁడు. ౧. ౨. శృంగారించుస్వభావము గలవాని పేళ్లు.

* భూష్ణు ర్భవిష్ణు ర్భవితా-

భవతి తాచ్ఛీల్యేనేతి భూష్ణుః. భవిష్ణుః. భవితా చ. ఋ.
త్తాయాం. అగునట్టిస్వభావముగలవాఁడు. ౧. ౨. ౩. కాఁగల
ళ్లు. పలుమాఱును బుట్టుస్వభావము గల కేశనఖాదులవే ళ్ళని
అందురు.

* వ ర్తిష్ణు ర్వ ర్తన స్సమౌ,

వ ర్తతే తాచ్ఛీల్యేనేతి వ ర్తిష్ణుః. వ ర్తనశ్చ. వ ర్తించు స్వభా
గలది. ౧. ౨. వ ర్తించు స్వభావముగలవాని పేళ్లు. కాలాదుల
కొందఱు.

* నిరాకరిష్ణుః క్షిప్నుః స్యాత్-

నిరాకరోతి తాచ్ఛీల్యేనేతి నిరాకరిష్ణుః. డు కృఞ్ కరణే, స్వ
మున నే తిరస్కరించువాఁడు. ౧. క్షిపతి తాచ్ఛీల్యేనేతి క్షిప్నుః. క్షి
ణే. త్రోయుస్వభావము గలవాఁడు. ౨. తిరస్కరించుస్వభావము
వాని పేళ్లు.

* సాన్ద్రస్నిగ్ధ స్తు మేదురః.

మేద్యతి తాచ్ఛీల్యేనేతి మేదురః. ఞి మిదా స్నేహనే, స్వ

స్నిగ్ధుగలిగియుండును. ౧. సాంద్రమనఁగా దట్టమైనది. స్నిగ్ధము స్నిగ్ధ గలిగినది. అట్టి మేఘపటలాదులయందు మేదురశబ్దము ము

జ్ఞాతా తు విదురో విన్దుః-

జానాతి తాచ్ఛీల్యేనేతి జ్ఞాతా. ఋ. వేత్తి తాచ్ఛీల్యేనేతి విదు రశ్చ. జ్ఞా అవబోధనే. ఎఱుంగు స్వభావముగలవాఁడు. ౧. ౨. ఱుగుస్వభావము గలవానిపేళ్లు.

వికాసీ తు వికస్వరః,

వికసతి తాచ్ఛీల్యేనేతి వికాసీ. నాంతః. వికస్వరశ్చ. కస గతౌ. ముననే వికసించునది. ౧. ౨. వికసించు స్వభావము గలదాని

సృత్వరో విసృమరః ప్రసారీ చ విసారిణి. 3౧

విసరతి తాచ్ఛీల్యేనేతి విస్పృత్వరః, విస్మమరః, ప్రసారీ, నాంతః, చ. నాంతః, సృ గతౌ. స్వభావమున నెఱయునది. విసృత్వరము. ఱయుస్వభావముగల వానిపేళ్లు. (నీటిమీఁది చమురుచుక్క మొ దియు.)

హిష్ణు స్సహనః క్షన్తా తితిక్షుః క్షమితా క్షమీ,

సహతే తాచ్ఛీల్యేనేతి సహిష్ణుః, సహనశ్చ. క్షమతే తాచ్ఛీల్యే ంతా. ఋ. క్షమితా. ఋ. క్షమీ చ. నాంతః. తితిక్షత ఇతి . షహ మర్షణే. క్షమూష్ సహనే. తిజ నిశాతనే. స్వభావ ోర్చువాఁడు. ౬. స్వభావముననే యోర్చువానిపేళ్లు. "బాహ్యే త్మికే చైవ దుఃఖే చోత్పాదితే సతి, న కుప్యతి నవా హంతి హా పరికీర్తితా" అని క్షమాలక్షణము.

ధనోఽమర్షణః కోపీ-

క్రుధ్యతీతి క్రోధనః. క్రుధ కోపే. స్వభావముననే కోపించుకొను ౧. న మృష్యతి తాచ్ఛీల్యేనేత్యమర్షణః. మృష సహనే. స్వభా మోర్వనివాఁడు. ౨. కుప్య త్యవశ్యమితి కోపీ. నాంతః. కుప అవశ్యము కోపగించుకొనువాఁడు. 3. స్వభావముచేతనే కోపము పేళ్లు.

* చణ్డ స్త్వత్యన్తకోపనః.

చండతి కుప్యతీతి చండః. చడి కోపే. మిక్కిలి కోప వాఁడు. ౧. కుప్యతి తాచ్ఛీల్యేనేతి కోపనః. అత్యంతం కోపన కోపనః. కుప కోపే. స్వభావమునసే మిక్కిలి కోపగించుకొన ౨. మిక్కిలి కోపగించుకొనువానిపేళ్లు.

* జాగరూకో జాగరితా-

జాగర్తి తాచ్ఛీల్యేనేతి జాగరూకః, జాగరితా చ. జా నిద్రాక్షయే స్వభావమునసే మేల్కొనియుండువాఁడు. మేలు డుస్వభావము గలవానిపేళ్లు.

* ఘూర్ణితః ప్రచలాయితః,

ఘూర్ణతే ఇతస్తతో డోలాయత ఇతి ఘూర్ణితః. ఘూ భ్రమణే. ఇట్టటునూఁగెడువాఁడు. ౧. ప్రచల ఇవాచరతీతి ప్ర తః. ఊఁగెడువానివలె నుండువాఁడు. ౨. కూరుకుపాటుపడువా కూర్చుండి నిద్రపోవువాఁడు.

* స్వప్నక్ శయాలు ర్నిద్రాళుః-

స్వపితి తాచ్ఛీల్యేనేతి స్వప్నక్. జ, ఞి ష్వప్ శయే. శే చ్ఛీల్యేనేతి శయాళుః. శీఙ్ స్వప్నే. నిద్రాతి తాచ్ఛీల్యేనే ళుః. ద్రా కుత్సాయాంగతౌ. నిద్రపోవు స్వభావముగలవాఁడు. ౧ ౩. నిద్రపోతుపేళ్లు. తూఁగుపోతు.

* నిద్రాణ శయితౌ సమౌ.

నిద్రాతీతి నిద్రాణః. శేతే స్మ శయితః. ద్రా కుత్సా తౌ. శీఙ్ స్వప్నే. నిద్రించువాఁడు. ౧. ౨. నిద్రించువానిపేళ్లు.

* పరాఙ్ముఖః పరాచీనః-

పరం అఞ్చతీతి పరాఙ్. పరాఙ్ ముఖంయస్య పరాఙ్ముఖః. దిక్కు ముఖము గలవాఁడు. ౧. పరా ఞ్చేవ పరాచీనః. అంచు గ నయోః. అవ్వలిదిక్కును బొందినవాఁడు. ౨. ఆవలిముఖమయు పేళ్లు. పెడమొగముగా నున్నవాఁడు.

* స్యా దవాఙ ప్యధోముఖః,

అప అంచతీతి అవాఙ్. చ. అపిశబ్దా దవాచీనశ్చ. ముఖ

[...]లవాఁడు. స్త్రీలింగమైనప్పుడు 'అవాచీ' అని ఈకారాంతము.
[...]మునలన 'అవాచీనుండును.' ౧,౨. అధో ముఖం యస్యేతి త్య
[...] క్రిందైనముఖము గలవాఁడు. ౨ తలవంచుకొన్నవాని పేళ్లు.
[...]నా సఞ్చతి దేవద్ర్యఙ్-
దేవాః అంచతి గచ్ఛతి పూజయతీతివా దేవద్ర్యఙ్. చ. అంచు
[...]నయోః. స్త్రీలింగమైనప్పుడు 'దేవద్రీచీ' అని ఈకారాంతము.
[...]తలనుగూర్చి పోవువాఁడు. లేక దేవతలను బూజించువాఁడు.

విష్వద్ర్యఙ్ విష్వగఞ్చతి. 3౮

విష్వక్ సర్వత్రాంచతీతి విష్వద్ర్యఙ్. చ. అంతట నడుచువాఁడు.
[...]గము యినపుడు విష్వద్రీచీ అని ఈకారాంతము. ౧. అన్నిదిక్కు
[...]ను వ్యాపించువానిపేరు.
[...] సహాఞ్చతి సధ్ర్యఙ్ సః-
సహాంచతీతి సధ్ర్యఙ్. చ. కూడినడుచువాఁడు. స్త్రీలింగము
[...]ను సధ్రీచీ. ఈ. ౧ ఒకనితోఁ గూడి పోవువానిపేరు.

స తిర్యఙ్ యస్తిరోఽఞ్చతి,

తిరోంచతీతి తిర్యఙ్. చ. అంచు గతిపూజనయోః. అడ్డముగాఁ
[...]వాఁడు. స్త్రీలింగమయినపుడు తిరశ్చీ. ఈ. ౧. అడ్డముగా నడుచు
పేళ్లు.
[...]ో వదావదో వక్తా-
వదతీతి వదః, వదావదశ్చ. వక్తీతి వక్తా. ఋ. వద వ్యక్తాయాం
వచ పరిభాషణే. మాటలాడువాఁడు వదుఁడు. వదావదుఁడు.
[...]ను. ౧. ౨. 3. సభయందు భయము లేక పలుకనేర్చినవాని

వాగీశో వాక్పతి స్సమౌ. 3౯

వాచామీశో వాగీశః. వాచాం పతి ర్వాక్పతిః. వాక్కులకు
[...]గీశుఁడు, వాక్పతియును. ౧,౨. (గద్యపద్యాదిప్రబంధములను)
[...]ముగాఁ బలుకనేర్చినవాని పేళ్లు.
[...]చో యుక్తిపటు ర్వాగ్మీ వావదూకోఽతివక్తరి,
వాచో యుక్తిర్యస్య వచసాం ప్రయోగః తత్ర పటుః వాచోయుక్తిప

టుః. మాటలయొక్క యుక్తియందు సమర్థుఁడైనవాఁడు. ౧.
వా గస్యేతి వాగ్మీ. నాంతః. మంచివాక్కు గలవాఁడు. ౨.
భృశం వదతీతి వావదూకః. వద వ్యక్తాయాం వాచి. లెస్సగా
వాఁడు. 'వావదూకశ్చవక్తరి' యని కొందఱు. ౩ తాఁ బలుక
చినయర్థము ను యుక్తివలన లెస్సగా నిర్వహించి మాటలాడు

* స్యా జ్జల్పాకస్తు వాచాలో వాచాటో బహుగర్హ్యవాక్.

జల్పతి కుత్సితం వదతీతి జల్పాకః. జల్ప వ్యక్తాయాం వా
తముగాఁ బలుకువాఁడు. ౧. కుత్సితా వాచ స్సంత్యస్యేతి వాచా
చాటశ్చ. కుత్సితములైన పెక్కుమాట లాడును గనుక వా
వాచాటుఁడును. ౨. ౩. బహ్వ్యః గర్హ్యా వాచో యస్యేతి బహ
వాక్. చ. కుత్సితమైన పెక్కుమాటలు గలవాఁడు. ౪.
యుక్తములు గాక దోషయుక్తముగాఁ బెక్కుమాట లాడువా

* దుర్ముఖే ముఖ రాబద్ధముఖౌ-

దుష్టం ముఖం వచనమస్యేతి దుర్ముఖః, ముఖరశ్చ. అప్రి
మాటలు గలవాఁడు దుర్ముఖుఁడు, ముఖరుఁడును. ౧. ౨. అ
యంత్రితం ముఖమస్యే త్యబద్ధముఖః. అప్రియవాక్కులచేత ని
లేనిముఖము గలవాఁడు. ౩. అప్రియముగాఁ బలుకువానిపేళ్లు.

* శ్లక్ష్ణః ప్రియంవదే,

శ్లిష్యతే సర్వైరితి శ్లక్ష్ణః. శ్లిష ఆలింగనే. అందఱిచేత
నము సేయఁబడువాఁడు. పా. శక్నోతి ప్రియమేవ వక్తుమితి శ్లక్ష్ణ
శి శక్తౌ. ప్రియమును బలుక నేర్చినవాఁడు. ౧. ప్రియం వదతీతి ప్రి
దః. వద వ్యక్తాయాం వాచి. ప్రియముగాఁ బలుకువాఁడు. ౨. ప్రి
గాఁ బలుకువానిపేళ్లు.

* లోహల స్స్యా దస్ఫుటవాక్-

లోహతి స్థానప్రయుత్నవైకల్యం కరోతీతి లోహలః. లు
నాదౌ. ఉచ్చారణమందు వైకల్యము గలవాఁడు. లునాతి వాక్య
ధ్యే ఛినత్తీతి లోహలః. లూఞ్ ఛేదనే. మాటను నడుమ నిలుపు
లోహః అతికాఠిన్యేన లోహసదృశం రసనాతాల్వాదికం. తం లా
హలః, దట్టమైయుండుటచేత నినుమువంటి కాఠిన్యముగల నాలు

...లోహము. అది గలవాఁడు. ౧. అస్ఫుటా వాగ్యస్యేత్యస్ఫుట
...వ్యక్తము గానివాక్కు-గలవాఁడు. ౨. వ్యక్తము కాకుండ
...సువానిపేళ్లు.

గర్హ్యవాదీ తు కద్వదః. 38

...గర్హ్యం వదతీతి గర్హ్యవాదీ. నాంతః. నిందార్హముగాఁ బలు
... ౧. కుత్సితం వదతీతి కద్వదః. వద వ్యక్తాయాం వాచి. కుత్సి
... బలుకువాఁడు. నిందార్హముగా మాటలాడు వానిపేళ్లు. వా
...ు నింద్యములైన పెక్కు-మాట లాడును. కద్వదుఁడు నింద్యము
...ంచెముమాట లాడు నని వా రిద్దఱికిఁ గల భేదము.

...హా కువాద కుచరా-

కుత్సితః పరదోషప్రఖ్యాపనశీలః వాదః భాషణం యస్యేతి కు
... పరదోషప్రకాశకము లైనమాటలు గలవాఁడు. ౨. కుత్సితం
... కువదః. వద వ్యక్తాయాం వాచి. కీడును బలుకువాఁడు. కుత్సి
...తి భాషతే గచ్ఛతి వా కుచరః. చర గతిభక్షణయోః. కుత్సి
... బలుకువాఁడుగాని చరించువాఁడుగాని కుచరుఁడు. ౨. పరుల
...ును బలుకువాని పేళ్లు.

స్యా దసౌమ్యస్వరోఽస్వరః,

విరుద్ధః శ్రవణకటుః స్వరో యస్యే త్యస్వరః. విన నింపుగానిస్వర
...వాఁడు. ౧. చెవుల కింపుగాని స్వరమును బలుకువానిపేరు.

...ణ శ్శబ్దనః-

...రౌతి తాచ్ఛీల్యేనేతి రవణః. శబ్దాయతే తాచ్ఛీల్యేనేతి శబ్దనః.
... శబ్ద శబ్దే. స్వభావమునవే మ్రోయువాఁడు. ౧. ౨. మ్రోయు
...ము గలవానిపేళ్లు.

నాన్దీవాదీ నాన్దీకర స్సమౌ. 39

...నాందీం వదతీతి నాందీవాదీ. నాంతః. వద వ్యక్తాయాం వాచి.
...నృపాదీనాం స్తుతి ర్యస్మాత్ప్రవర్తతే, ఆశీర్వచనసంయుక్తా సా
...ందీకీర్తితా, సాస్యాత్పదై ర్ద్వాదశభి రష్టభి ర్వాప్యలంకృతా' ఇత్యా
...మాలాదిభిరుక్తలక్షణః పద్యవిశేషో నాందీత్యుచ్యతే. యత్కించి
...సూచకం వచోమాత్రం వా. ఆశీర్వచనయుక్తమయిన దేవద్విజ

నృపాదులయొక్క స్తుతిగాని, మంగళసూచకమయిన వచనము
ది యనంబడును. అట్టినాందిని జేయువాఁడు. ౧. నాందీం కరో
కరః. డు కృఞ్ కరణే. నాందిని జేయువాఁడు. ౨. ఆశీర్వాదము
డిన దేవతాదులయొక్క స్తోత్రము చేయుమంగళపాఠకుని పేళ్లు.

* జడో౽జ్ఞః-

"ఇష్టంవా నిష్టంవా సుఖ మితరద్వా న వేత్తి యో
తూష్ణీకః పరవశగ స్స భవతి జడసంజ్ఞకః పురుషః" అని. జల
తీతి జడః. జల ఘాతనే. స్తబ్ధుఁడై యుండువాఁడు. ౧. న జానాతీ
అవబోధనే. ఎఱుఁగనివాఁడు. ౨. ఇష్టానిష్టసుఖదుఃఖముల
పరవశుఁడై యూరకుండువాని పేళ్లు.

* అనేడమూక స్తు వక్తుం శ్రోతు మశిక్షితే,

ఏడమూక సదృశో౽నేడమూకః. అత్ర నఞ్ సాదృశ్యే
క్తం. "తత్సాదృశ్య మభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రా
విరోధశ్చ నఞర్థా షట్ ప్రకీర్తితాః" ఇతి. చెవిటివానికిని మూ
కిని సరియైనవాఁడు. "నఖ ల్వనేడమూకావా సర్వపతే మ
అని శ్రీహర్షప్రయోగము. కొందఱు ఏడమూకః అనుపాఠము
రించి చెవుడును మూఁగతనమును గలిగినవానికి పేరని చెప్పుదు
సంస్కృతభాషాదౌ కృతబుద్ధిషు వ్యవహరత్సు యః స్వయ
న్నతయా తదీయవాక్యాని శ్రోతుం ప్రతివక్తుం చ సమర్థోన భవ
మూక ఉచ్యతే. ఏడో బధిరః. మూకో వాగింద్రియరహితః. ఏడ
మూకశ్చేతి విశేషణసమాసః. సంస్కృతభాషాదులయందు
వ్యవహరించుచుండఁగా వినుటకును ప్రతివచనముఁ జెప్పుటకును
గానివాఁడు ఏడమూకుఁ డని కొందఱు. ౧. మాటలాడుటకు
టకును సమర్థుఁడు కానివాని పేరు.

* తూష్ణీంశీల స్తు తూష్ణీకః-

తూష్ణీం శీల మస్య తూష్ణీంశీలః, తూష్ణీకశ్చ. ఊరకుం
వముగలవాఁడు తూష్ణీంశీలుఁడు, తూష్ణీకుఁడును. ౧. ౨. మా
యూరకుండుస్వభావము గలవాని పేళ్లు.

* నగ్నో౽వాసా దిగమ్బరః,

న లజ్జత ఇతి నగ్నః. ఓ లస్జీ వ్రీడే. సిగ్గులేనివాఁడు. ౧. న విద్య
...తే యస్య త్యవాసాః. స. బట్టలేనివాఁడు. ౨. దిక్ అంబరం
... దిగంబరః. బయులే బట్టగాఁ గలవాఁడు. ౩. దిసమొలవానిపేళ్లు.

...ష్కాసితోఽవకృష్ట స్స్యాత్ -

నిష్కాస్యత ఇతి నిష్కాసితః. కస గతౌ. వెళ్లఁగొట్టఁబడినవాఁ...
అవకృష్యతే బలాత్కారేణే త్యపకృష్టః. కృష విలేఖనే. బలిమి...
...యఁబడినవాఁడు. ౨. వెళ్లఁగొట్టఁబడినవానిపేళ్లు.

అపధ్వ_స్తను ధిక్కృతః,

అపధ్వస్యతే స్మ అపధ్వ_స్తః. స్రంసు ధ్వంసు అవస్రంసనే. దిగఁ...
...బడినవాఁడు. ౧. ధిగితి కృతః ఉచ్చారిత ఇతి ధిక్కృతః. డుకృ
...ణే. కరోతి రత్ర ఉచ్చారణే. చోరంకార మాక్రోశతీతి వత్. చె...
...ని పలుకఁబడినవాఁడు. ౨. తిరస్కరింపఁబడినవానిపేళ్లు.

...త్తగర్వోఽభిభూత స్స్యాత్ -

ఆత్తః స్వీకృతః గంధః గర్వో యేన సః ఆత్తగంధః. గంధ అ...
...పొందఁబడిన గర్వము గలవాఁడు. పా. ఆత్తగర్వః. అభిభూయ తే
...భిభూతః, భూ సత్తాయాం. పరిభవింపఁబడువాఁడు. ౨. గర్వితుఁ...
...రాజుచేతఁగాని శత్రువులచేతఁగాని గర్వభంగముఁ బొందినవాని
...అపధ్వ_స్త శబ్దము మొదలు ౪ పర్యాయము లని కొందఱు.

దాపిత స్సాధిత స్సమౌ. ౪౦

రాజ్ఞా వివాదాస్పదీభూతం ధనం ధనినే దాప్యతే అస్మాదితి దా...
...డు దాఞ్ దానే. రాజుచేత వివాదగ్ర_స్త మైనధనమును ధన...
...కొఁ ఇప్పించఁబడినవాఁడు. పా. దాయితః. ౧. ప్రతివాదినా సా...
...ద్యాదిభి స్సాధ్యతేస్మ సాధితః. రాధ సాధ సంసిద్ధౌ. ప్రతివాదిచేత
...లేఖ్యాదులవలన సాధింపఁబడినవాఁడు. ౨. దండుగగొనఁబడిన
...పేళ్లు.

ప్రత్యాదిష్టో నిర_స్త స్స్యా త్ప్రత్యాఖ్యాతో నిరాకృతః,

ప్రత్యాదిశ్యతే నిరాక్రియత ఇతి ప్రత్యాదిష్టః. దిశ అతిసర్జనే.
...కరింపఁబడినవాఁడు. ౧. నిరస్యతే స్మ నిర_స్తః. అసు క్షేపణే. నిరసిం...
...డినవాఁడు. ౨. ప్రత్యాఖ్యాయతే స్మ ప్రత్యాఖ్యాతః. ఖ్యా ప్రక...

థనే. ధిక్కరింపఁబడినవాఁడు. 3. నిరాక్రియతే స్మ నిరాకృతః. కరణే. నిరాకరింపఁబడినవాఁడు. ౪. న్యాయముచేఁ బరిహ వానిపేళ్లు.

* నికృత స్స్యా ద్విప్రకృతః-

నితరాం దుఃఖితః క్రియతే స్మ నికృతః, విప్రకృతశ్చ. కరణే. మిక్కిలి పీడింపఁబడినవాఁడు గనుక నికృతుఁడు, విప్ర సు. "తస్మిన్ విప్రకృతాః కాలే తారకేణ దివౌకసః" ఇతి కు భవే కాళిదాసః. పరకృతతిరస్కారముచేఁ బీడింపఁబడినవానిపేళ్లు.

* విప్రలబ్ధస్తు వఞ్చితః.

విప్రలభ్యతే స్మ విప్రలబ్ధః. వంచ్యతే స్మ వంచితః. ప్రాప్తౌ. వంచు విప్రలంభనే మోసపుచ్చఁబడినవాఁడు విప్ర వంచితుఁడును. ౧. ౨. మోసపుచ్చఁబడినవానిపేళ్లు.

* మనోహతః ప్రతిహతః ప్రతిబద్ధో హతశ్చ సః,

మనసి హతో మనోహతః. మనసి ప్రతిహన్యతే స్మ ప్ర హన హింసాగత్యోః. మనస్సునందలి యుత్సాహము చెడినవాఁ నోహతుఁడు, ప్రతిహతుఁడును. ౨. మనసి ప్రతిబధ్యతే స్మ ప్ర బధ బంధనే. మనస్సునందు కట్టఁబడియుండువాఁడు. 3. నిశ్చే హతసదృశతయా హతః. నిశ్చేష్టుఁడౌటవలనఁ జచ్చినవానివలె వాఁడు. ౪. కార్యవిఘాతము, విరుద్ధకార్యోత్పత్తి మొదలగుదా మనస్సున నుత్సాహము చెడినవానిపేళ్లు. 'ప్రత్యాదిష్టో నిరస్త స్స్యా అనునది మొదలు ఒకటిన్నరశ్లోకము ప్రక్షిప్తమని కొందఱు.

* అధిక్షిప్తః ప్రతిక్షిప్తే-

అధిక్షిప్యతే స్మ అధిక్షిప్తః. ప్రతిక్షిప్యతే స్మ ప్రతిక్షి పప్రేరణే ఆక్షేపించఁబడినవాఁడు అధిక్షిప్తుఁడు. ప్రతిక్షిప్తుఁడు ౨. కౌటసాక్ష్యాదులవలన సభ్యులచేత నిందింపఁబడినవానిపేళ్లు.

* బద్ధే కీలిత సంయతౌ.

కీల్యతే స్మ కీలితః. సంయమ్యతే స్మ సంయతః. కీల బంధనే. మ ఉపరమే. కట్టఁబడువాఁడు కీలితుఁడు, సంయతుఁడును. ౧. ౨. చౌ ర్యాపరాధమున బొండకొయ్య మొదలగుదానిచేతఁ గట్టువడినవాని

న్న ఆపత్ప్రాప్త స్స్యాత్ -

ఆపద్యతే స్మ ఆపన్నః. ఆపదం ప్రాప్తః ఆపత్ప్రాప్తః. పత్ ౹ గ
౹ వ్యాప్తౌ. ఆపదఁబొందినవాఁడు. ఆపన్నుఁడు, ఆపత్ప్రాప్తుఁ
౧. ౨. ఆపదఁబొందినవాని పేళ్లు.

కాన్దిశీకో భయద్రుతః,

కాం దిశం గచ్ఛామీతి చింతయన్ పలాయితః కాందిశీకః. ఏది
బోవుదు నని చింతించుచుఁ బరుగెత్తువాఁడు. భయేన ద్రుతః భ
తః. ద్రు గతౌ. భయముచేతఁ బోవువాఁడు. శత్రువు మొదలైన
భయపడి పాఱిపోవువాని పేళ్లు.

క్షారితః క్షారితో౽భిశస్తే-

ఆక్షార్యతే స్వరూపా చ్చాల్యత ఇ త్యాక్షారితః, క్షారితశ్చ. క్షర
నే. స్వరూపమునుండి చలింపఁబడినవాఁడు ఆక్షారితుఁడు, క్షారి
ను. ౧. ౨. అభిశస్యతే వాగ్బాణైరిత్యభిశస్తః. శసు హింసాయాం.
వాక్యాదులచేతఁ బీడింపఁబడినవాఁడు. 3. పరస్త్రీగమన, బ్రహ్మహ
దోషములచేత దూష్యుఁ డని వాదఁబడినవాని పేళ్లు.

సంకసుకో౽స్థిరే. ౪3

సమ్యక్ కసతి ఇతః సతో గచ్ఛతీతి సంకసుకః. కస గతౌ. ఇట్టు
బోవువాఁడు. ౧. స్థిరో న భవతీ త్యస్థిరః. స్థిరుఁడు గానివాఁడు. ౨.
ముందును నిలుకడ లేనివాని పేళ్లు.

వ్యసనా ర్తోపరక్తౌ ద్వౌ-

వ్యసనేన ఋతో వ్యసనార్తః. ఋ గతౌ. వ్యసనముచేతఁ బొందఁబడిన
ు. ౧. ఉపరజ్యతే స్మ ఉపరక్తః. రంజ రాగే. వ్యసనముచేఁ గప్పఁ
వాఁడు. ౨. దైవకృతమునఁ గాని మనుష్యకృతమునఁగాని శరీర
గలవాని పేళ్లు. ద్యూతాదివ్యసనములు గలవాఁ డని కొందఱు.

విహస్త వ్యాకులౌ సమౌ,

విగతౌ వ్యాపారశూన్యౌ హస్తౌ యస్యేతి విహస్తః. వ్యాపారము
హస్తములుగలవాఁడు. ౧. వ్యాకుల్యతే మనో యస్యేతి వ్యాకులః.
సంస్త్యానే. శోకాదులచేత మందముగాఁ జేయఁబడినమనస్సు గల
ు. ౨. శోకాదులవలన నిది సేయవలయు నని యెఱుఁగక తిచ్చ

వడినవానిపేళ్లు.

* విక్లబో విహ్వలః-

విక్లబతే శక్తో నభవతీతి విక్లబః. క్లబ కాతర్యే. "ధా
వ్యవతిష్ఠో౽పి విక్లబభాతురున్నేయః. పాఠస్య ప్రదర్శనార్థత్వా"
బోధినీకారః. విక్లబ ఇతి అవ్యుత్పన్న ప్రాతిపదికమితి కేచిత్.
గానివాఁడు.౧.విరుద్ధం హ్వలతీతి విహ్వలః. హ్వల సంచలనే.
గాఁ జలించువాఁడు. ౨ భయశోకాదులచేఁ దనయవయవములకు
వ శక్తిలేనివానిపేళ్లు.

* స్యాత్తు వివశో౽రిష్టదుష్టధీః.

విరుద్ధం వష్టీతి వివశః. వశ కాంతౌ. విరుద్ధమైనదానిఁగో
డు. ౧. అరిష్టమనఁగా నాసన్నమరణము. దానిచేత దూషిత
గలవాఁడు వివశుఁ డనంబడును.

* కశ్యః కశార్హే-

కశాపర్హతీతి కశ్యః. కశార్హశ్చ. చబుకుపెట్ల కర్హమై
కశ్యుఁడు, కశార్హుఁడును. ౧. అపరాధమువలన చబుకుపెట్లకు
వానిపేళ్లు.

* సన్నద్ధే త్వాతతాయీ వధోద్యతే,

ఆతతమధికం పాపమేతీ త్యాతతాయీ. నాంతః. ఇణ్
అధికమైనపాపమును బొందినవాఁడు. ఆతం పలాయమానం
జిఘాంసయా గచ్ఛతీతి ఆతతాయీ. తయ గతౌ. పరుగెత్తువాని
నిచ్ఛచేఁ దఱుముకొనిపోవువాఁడు. ౧. అత్ర వధోద్యతపదే. "అ
గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః, క్షేత్రదారహరశ్చైవ షడేతే
తాయిన" ఇతి స్మృత్యుక్తాః పరానిష్టకారిణో గృహ్యంతే.
నని యుద్యోగించి సన్నాహపడినవానిపేరు.

* ద్వేష్యే త్వక్షిగతః-

ద్వేష్టుం యోగ్యో ద్వేష్యః. ద్విష అప్రీతౌ. ద్వేషింప
వాఁడు. ౧. అక్షిగతశూకసికతాదివత్పీడాకరత్వాదక్షిగతః. కంటు
నెఱుసు, ఇసుక మొదలైనదానివలెఁ బీడించువాఁడు. ౨. ద్వేషి
దగినవానిపేళ్లు.

వధ్య శ్శీర్షచ్ఛేద్య ఇమౌ సమౌ. ४९

...ధమర్హతీతి వధ్యః. చంపఁదగినవాఁడు. ౧. శీర్షచ్ఛేదమర్హతీ ...ద్యః. తలఁగొట్టఁదగినవాఁడు. ౨. చంపఁదగినవానిపేళ్లు.

...విషేణ యో వధ్యః-

...షేణ వధ్యో విష్యః. విషముచేతఁ జంపఁదగినవాఁడు. ౧. విష ...ంపఁదగినవానిపేరు.

ముసల్యో ముసలేన యః,

ముసలేన వధ్యో ముసల్యః. రోఁకటిచేఁ జంపఁదగినవాఁడు. ౧. ...యాది ప్రాయశ్చిత్తార్థమై రోఁకటిచేఁ జంపఁదగినవానిపేరు.

...దానోఽకృష్ణకర్మా-

...ంద తే కర్మణా శుద్ధో భవతీతి శిశ్విదానః. శ్విది శ్వైత్యే. స ...ఁ బరిశుద్ధుఁడైనవాఁడు. స్వా. శ్వేతతే పాపవిశేషాద్వైవర్ణ్యం ...తి వా పుణ్యవిశేషా ద్విశుద్ధిం ప్రాప్నోతీతి వా శిశ్విదానః. శ్వి ...ద్వే. పాపవిశేషమువలన వైవర్ణ్యముగాని పుణ్యవిశేషమువలన ...ని పొందువాఁడు. ౧. అకృష్ణం శుద్ధం కర్మ యస్యేత్యకృష్ణక ...ాంతః. పరిశుద్ధమయిన నడవడికగలవాఁడు. ౨. మంచియాచార ...వానిపేళ్లు. శిశ్విదానః కృష్ణకర్మా అనుపాఠము నంగీకరించి పా ...నిపేళ్ళని కొందఱు. శిశ్విదానః కృష్ణకర్మేతి సర్వానంద సుభూ ...ద్రా. శిశ్విదానః అకృష్ణకర్మేతి సుబోధినీకారః. పక్షద్వయేఽపి ...ప్రయోగ దర్శనాత్ నిఘంట్వంతర గవేషణాచ్చ శిశ్విదానశ ...నిశ్చేతవ్యః. అథవా అరిష్టశబ్దస్యమిథో విరుద్ధ శుభాశుభరూపా ...వత్ శిశ్విదానశబ్దస్యాపి పుణ్యాపుణ్యకృల్లక్షణోభయార్థవాచ ...త్యవధేయం.

చపల శ్చికుర స్సమౌ. ४८

"అవిమృశ్యతు యః కార్యం పురుషో వధబంధనాదికం కుర్యా ...వినిశ్చితకారిత్వా త్స తు ఖలు చపలో బుధై ర్జ్ఞేయః" అని. చో ...చపలః. చుప మందాయాం గతౌ. మంద మయినజ్ఞానము గల ... ౧. చకతి తృప్యతి స్వకర్మణేతి చికురః. తాఁ జేసిన ప్రయోజ ...త తృప్తిఁబొందువాఁడు. ౨. దోషము విచారించక వధబంధ

నాదులఁ జేయువాని పేళ్లు.

* దోషైకదృ క్పురో భాగీ-

దోష మేకం పశ్యతి దోషైకదృక్. శ. దృశిర్ ప్రేక్షణే. దోషమునే చూచువాఁడు. ౧. పురో దోషం భజతి గృహ్ణా ల్యేనేతి పురోభాగీ. నాంతః. భజ సేవాయాం. ముందు దోష భావమున గ్రహించువాఁడు. ౨. దోషమునే వెదకువాని పేళ్లు

* నికృత స్త్వనృజు శ్శఠః,

నికృణోతి హినస్తి నికృతః. కృఞ్ హింసాయాం. డు. ౧. అనృజుహృదయత్వా దనృజుః. కుటిలహృదయము ౨. శఠతీతి శఠః కైతవే. కపటముగలవాఁడు. "గూఢ చ్ఛఠః" అని యాలంకారికులు. ౩. కుత్సితుని పేళ్లు.

* కర్ణేజప స్సూచక స్స్యాత్ పిశునో-

రాజాదీనాం కర్ణే జపతి వ్యక్తం వదతి పరకీయదోషా వః. జప వ్యక్తాయాం వాచి. రాజాదులయొక్క చెవియందు దోషములను జెప్పువాఁడు. ౧. సూచయతీతి సూచకః. సూ న్యే. సూచించువాఁడు. ౨. పింశ త్యనృతస్యావయవో భవతీతి పిశ అవయవే. అసత్యమునకు అవయవమయినవాఁడు. ౩. కొ జెప్పువాని పేళ్లు.

* దుర్జనః ఖలః.

దుష్టో జనః దుర్జనః. దుష్టుఁడయినజనుఁడు. ౧. ఖల దితి ఖలః. ఖల సంచలనే. ధర్మమువలనఁ జలించువాఁడు. ౨. యినవాని పేళ్లు. కర్ణేజపశబ్దము మొదలు ౫ పరదోషప్రకాశ కొందఱు. పిశున దుర్జనఖలశబ్దములు ౩ ను, జనులలో నొక తగవు పెట్టువాని పేళ్లని కొందఱు.

* నృశంసో ఘాతుకః క్రూరః పాపః-

నౄన్ శసతి శంసతి చ నృశంసః. శసు హింసాయాం. శం దుర్గతౌ చ. మనుష్యులను బీడించువాఁడు. ౧. హంతీతి ఘాతుక హింసాగతో్యః. హింసించువాఁడు. ౨. కృంతతీతి క్రూరః. నే. వ్యథ పెట్టువాఁడు. ౩. పాపమస్యేతి పాపః. పాపముగలవా

బాధ సేయుస్వభావము గలవానిపేళ్లు.

ధూర్తస్తు వఞ్చకః,

ధూర్వతి హినస్తీతి ధూర్తః. ధుర్వీ హింసాయాం. పీడించు
౧. వఞ్చయతీతి వఞ్చకః. వఞ్చు విప్రలంభే. మోసపుచ్చువాఁ
మోసపుచ్చువానిపేళ్లు.

జ్ఞే మూఢ యథాజాత మూర్ఖ వైధేయ బాలిశాః. ౪౮
న జానాతీ త్యజ్ఞః. ఎఱుకలేనివాఁడు. ౧. ముహ్యతీతి మూఢః,
హ్యే. ముహ వైచిత్త్యే. మోహమును బొందువాఁడు. ౨. ౪. జాత
కశూన్యత్వా దితి యథాజాతః. వివేకశూన్యుఁ డౌటవలన పు
ప్పటివలె నెల్లప్పుడు నుండువాఁడు. ౩. విధాతుం యోగ్యో విధే
ధేయ ఏవ వైధేయః, శిక్షింపఁదగినవాఁడు వైధేయుఁడు. ౫.
ం బలింపూజాం శ్యతీతి బలిశః. బలిశ ఏవ బాలిశః. తనకుఁ
న్నానమును జెఱుచుకొనువాఁడు బాలిశుఁడు. దేవతార్థం దత్త
పాది బలిం శ్యతి భక్షణేన తనూకరోతీతి బలిశః. బలిశ ఏవ బాలిశః.
కై యుంచఁబడిన యపూపాదులను భక్షించి స్వల్పముగాఁ
వాఁడు. ౬ ఎఱుకలేనివానిపేళ్లు,

దర్యే కృపణ క్షుద్ర కింపచాన మితంపచాః,

కుత్సితః. అర్యః కదర్యః. కుత్సితుఁడైన ధనికుఁడు. ౧. కల్పతే కు
కనేనాపి జీవనాయ సమర్థో భవతీతి కృపణః. కృపూ సామర్థ్యే.
లమును బీడించియైనను బ్రతుకనేర్చినవాఁడు. ౨. క్షుద్నాతి
ం పీడయతీతి క్షుద్రః. క్షుదిర్ సంపేషణే. కుటుంబమును
వాఁడు. ౩. కించి దన్నం పచతీతి కింపచానః. ఇంచుకంత వంట
వండుకొనువాఁడు. పచా పాకః, కిం కించిత్ పచయా అత్యల్ప
అనితి జీవతీతి కింపచానః. అన ప్రాణనే. ఇంచుక వంటచేత బ్ర
వాఁడు. ౪. మితం అత్యల్పం పచతీతి మితంపచః. డు పచ్ ష్ పాకే.
వండుకొనువాఁడు. ౫. ఒకనికిఁ బెట్టక తాను భక్షింపక ధన
గూడఁబెట్టువానిపేళ్లు.

స్వస్తు దుర్విధో దీనో దరిద్రో దుర్గతో౽పి సః. ౪౯
నిర్గతః స్వాదితి నిస్స్వః. ధనమువలనఁ బాసినవాఁడు. ౧. దుష్టా జీర్ణ

వ స్త్రధారణకదన్నభోజనాదిరూపా విధా ప్రకారో యస్యేతి
చినిఁగినగుడ్డ కట్టుకొనుట, కుత్సితమైన యన్నమును భుజించు
లైనప్రకారము గలవాఁడు. ౨. దీయత ఇతి దీనః. దీఙ్
యించువాఁడు. ౩. దరిద్రాతి దుర్గతిం ప్రాప్నోతీతి దరిద్రః.
దుర్గతౌ. దుర్గతిని బొందినవాఁడు. ౪. దురవస్థాం గతో దుర్గతః
ని గతౌ. దురవస్థను బొందినవాఁడు. ౫ దరిద్రునిపేళ్లు.

* వనీపకో యాచనకో మార్గణో యాచ కార్థి నౌ,

వనతీతి వనీపకః. యాచత ఇతి యాచనకః, యాచకః
యతీత్యర్థీ. నాంతః. వను యాచనే. టు యాచృ యాఞ్ఞాయాం
ఉపయాఞ్ఞాయాం. అడుగువాఁడుగనుక వనీపకుఁడు, యాచ
యాచకుఁడు, అర్థియును. వనీ యాచ్ఞా తాం పాతి రక్షతీతి
పా. రక్షణే. అడుగుటను రక్షించువాఁడు. పా. వనీం
మాత్మన ఇచ్ఛతీతి వనీపకః. అడుగుటను తనకు నిచ్ఛ
వాఁడు. యాచ్యతే అనేనేతి యాచనం దేహీత్యాదిపదం త
తీతి యాచనకః. కై శబ్దే. ఇమ్మని యడుగువాఁడు. ౧. ౨.
మార్గయతి దాతారమితి మార్గణః. మార్గ అన్వేషణే. దాతను
వాఁడు. ౪, ౫ అడుగువానిపేళ్లు.

* అహంయు స్స్యా దహంకారీ-

అహమితి మాంతమవ్యయమ్. అహంకారోఽస్యేతి అహం
అహంకారోఽస్యాస్తీత్యహంకారీ. నాంతః. అహంకారముగలవా
హంయువు, అహంకారియును. ౧. ౨. అహంకారము గలవానిపే

* శుభంయుస్తు శుభాన్వితః.

శుభమితి మాంతమవ్యయం మంగళార్థే. శుభమస్యేతి
యుః. శుభము గలవాఁడు. ౧. శుభే నాన్వితః శుభాన్వితః. శుభ
గూడుకొన్నవాఁడు. ౨. శుభము గలవానిపేళ్లు.

* దివ్యోపపాదుకా దేవాః-

దివి భవాః దివ్యాః. మాత్రాదినిరపేక్షేణ ధర్మవిశేషాదే
ద్యంత ఇత్యుపపాదుకాః. దివ్యాశ్చ తే ఉపపాదుకాశ్చ దివ్యోపపా
స్వర్గమందుండువారు దివ్యులు. తల్లి మొదలైనవారు లేకయే ఆ

రు ఉపపాదుకులు. దివ్యులైన ఉపపాదుకులు దివ్యోపపాదు
అయోనిజులై స్వర్గమందున్న దేవతలపేరు.

నృగవాద్యా జరాయుజాః,

ప్పత్తిసమయే జరాయోర్జాయంత ఇతి జరాయుజాః. జనీ ప్రా
. పుట్టునప్పుడు మావివలనఁ బుట్టువారు. ౧. మావివలనఁ బు
ష్యులు పశువులు మొదలైనవాని పేరు.

జాః కృమి దంశాద్యాః-

స్వేదాత్ భౌమోష్మణో జాతా స్వేదజాః. ఉక్కవలనఁ బుట్టి
పురుగులు ఈఁగలు మొదలైనవానిపేరు. ఆదిశబ్దమువలన ఉసు
లు మొదలైనవానికిని పేరు.

పక్షిసర్పాదయోఽణ్డజాః. ౫౧

అండా జ్జాయంత ఇత్యండజాః. జనీ ప్రాదుర్భావే. గ్రుడ్డువలనఁ
. ౧. పక్షులు పాములు మొదలైనవాని పేరు. ఆదిశబ్దముచేత
ములకును పేరు.

(ఇంతవఱకు ప్రాణివర్గము.)

ద్భిద స్తరు గుల్మాద్యాః-

ఉద్భిద్య న్తి భువమిత్యుద్భిదః. ద. భిదిర్ విదారణే. పుట్టునపుడు
వ్రక్కలించునవిగనుక ఉద్భిత్తులు. ౧. తరుగుల్మలతాదుల పేరు.
ముచేత గడ్డిపోఁచలు, ఓషధులు, తీఁగలు మొదలగునవియు.

ఉద్భి దుద్భిజ్జ ముద్భిదమ్,

ద్భిత్ వ్యాఖ్యాతమ్. భూమేరుద్భేదనముద్భిత్. తతో జాత
. జనీ ప్రాదుర్భావే. భూమిని వ్రక్కలించి పుట్టినది. ౨. ఉద్భి
ద్భిదం. భూమిని వ్రక్కలించునది. 3 ఆ తరుగుల్మాదులకే పేళ్లు.
రం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్. ౫౨
తం మనోహరం రుచ్యం మనోజ్ఞం మఞ్జుమఞ్జులమ్,
వామం హారి శాలి రమణీయం మనోరమమ్)
తరాం ఆద్రియత ఇతి సుందరం. దృజ్ ఆదరే. మిక్కిలి సం
మనది. ౧. రోచత ఇతి రుచిరం. రుచ దీప్తౌ. ప్రకాశించునది.
మనోఽస్మిన్నితి చారు. చరగతిభక్షణయోః. దీనియం
సంచరించును. సుష్ఠు సహం సర్వస్య అభిలాషవిషయత్వే

నేతి సుషమం. సర్వమైనవారికి అభిలాషవిషయమౌటచేత స
డునది. ర. సాధ్నోతి శుభమితి సాధు. రాధ సాధ సంసిద్ధౌ.
సాధించునది. ౫. శోభత ఇతిశోభనం. శుభ శుంభ శోభార్థే.
కామ్యత ఇతి కాంతం.కము కాంతౌ. కాంక్షింపఁబడునది. కస్య
తో నిశ్చయోఽత్రేతివా కాంతం. సుఖముయొక్క నిశ్చయము
దుఁగలదు.౭. మనోహరతీతి మనోహరం.హృఞ్ హరణే.మనస్సు
చునది. పా. మనోరమం. ౮. రోచత ఇతి రుచ్యం. రుచ దీప్తౌ.
చునది. ౯. మనసా జ్ఞేయం మనోజ్ఞం. జ్ఞా అవబోధనే. మనస్సు
గఁదగినది. ౧౦. మన్యతే సద్భి రితి మంజు. మన జ్ఞానే. అంద
లంపఁబడునది.౧౧. మంజుత్వమస్యేతి మంజుళం. మంజుత్వము గ
మంజుళబ్దము శ్యామాదిశబ్దములవలెనే ధర్మపరమునుగలదుగను
మందు శ్యామలాదిశబ్దములవలె మంజులశబ్దమును. చక్కని వస్తు

* త దాసేచనకం తృప్తే ర్నాస్త్యన్తో యస్య దర్శనాత్.

ఆసిచ్యతే అపూర్యతే దృగాదిక మనేనేతి ఆసేచనకం.
క్షరణే. దీనిచేత నేత్రాదీంద్రియములు నిండింపఁబడును. పా. న
న క్షరతి దృగస్మాది త్యాసేచనకం. ఎంతసేపు చూచినను తని
సుందరవస్తువు పేరు.

* అభీష్టేఽభీప్సితం హృద్యం దయితం వల్లభం ప్రియమ్,

అభిముఖ్యేన ఇష్యతే అభీష్టం. ఇషు ఇచ్ఛాయాం. అభి
గా నిచ్ఛయింపఁబడునది. ౧.అభిత ఆప్తుమిష్టమభీప్సితం. ఆప్ ?
అంతట పొంద నిచ్ఛయింపఁబడునది. ౨. హృదయస్య ప్రియం హృ
హృదయమునకు ప్రియమైనది. ౩. దయతే చిత్తమాదత్త ఇతి
దయ దానగతిరక్షణహింసాదానేషు. మనస్సు నాకర్షించునది. ౪.
ప్రీణాతీతి వల్లభం. వల్ల ప్రీతౌ. ప్రీతిని గలుగఁజేయునది. ౫. ప్రీ
ప్రియం. ప్రీఞ్ తర్పణే. తృప్తిని జేయునది. ౬.మనస్సునకుఁ ప్రీ
వస్తువు పేళ్లు.

* నికృష్ట ప్రతికృష్టార్వ రేఫ యాప్యావ మాధమాః,
కుపూయ కుత్సి తావద్య ఖేట గర్హ్యాణకాః సమాః,

నికృష్యతే స్మ ప్రతికృష్యతే స్మ తిరస్కృత ఇతి నికృష్టం.

